శ్రీరామ

# పూర్వాచార్యచరిత్రము

# శ్రీరామానుజవైభవము

1

# అక్షరాంజలి

శ్రీ రఘురామపాద సరసీజమరందము గ్రోలి; తత్కథా
సార సుధాతరంగములస్నానములన్ పొనరించి; తన్మహో
దారమహత్వ ధర్మగుణ తత్త్వములన్ గొనియాడి; అబ్ధి గం
భీర తదీయరూపమును ప్రేమ తలిర్పఁగఁ బ్రస్తుతించెదన్. 1.

చల్లనిచూపు – శీతలవచస్సు - సుధాసమ మందహాసరే
ఖోల్లసనాననంబు - ననలోద్ధృత కీర్తతవర్తనంబు; వి
ద్యుల్లలితాభదేహరుచి నొప్పెడి రాముని దివ్యగేహి నీ
ఫుల్లపదారవిందయుగమున్ భజియించెదనిష్టసిద్ధికిన్. 2.

తులసవనములోన వెలసినదే బాల
విష్ణుచిత్తు గృహానఁ బెరుఁగుకొఱకు?
విరిసరమ్ములు నెఱికురులఁ జుట్టె నెవర్తె
నెన్నుని కన్నను మున్ను తానె?
వెలఁది యెవ్వతె దాల్చి విడిచినదండలు;
పొంగి తాగ్రహియించె రంగభర్త?
రంగేశువలపించి ప్రణయానురాగమ్మె
వెలయ నెవ్వతె వానిఁ బెండ్లియాడె?

అట్టి లోకైకమాత; కల్యాణజాత;
సకల సద్గుణసముపేత; సౌమ్యచేత;
పూర్ణకరుణాంతరంగయై ప్రోచుఁగాక
లీలమము నెప్డు గోదాసతీలలామ. 3.

హరి సందేశవినీతుఁడై, సకల బ్రహ్మాండాళి సృష్టించి, వు
స్తర మాహాత్మ్యవిదగ్ధుఁడై, స్థితి వినాశంబుల్ క్రమస్ఫూర్తి స

త్సరుఁడై తీర్చుచునుండు సూత్రవతీభర్తన్ దైత్యహర్తన్ ప్ర
స్మరణానూన విశుద్ధవర్తనుని విష్వక్సేను సేవించెదన్. 4.

పాయక విష్ణుదేవునకుఁ బాన్పుగ, దివ్యఫణాసహస్ర ప్ర
చ్ఛాయ; సౌధశాలఁగల దదంచిత రత్నము లెల్లదీపముల్
గా, యుగధర్మ పాండితి నొకండు తనంతటివాఁడు లేఁడనన్
ధీయుతుఁడై వెలుంగు నతిధీరు ననంతు నుతింతు భక్తితోన్. 5.

రక్షోదక్షకరీంద్ర బృందఘనహర్యక్షుండు; అక్షీణవా
లాక్షిప్తక్షయకృద్విపక్షనిచయాధ్యక్షుండు; భక్తచ్ఛటా
రక్షాపేక్షకటాక్ష వీక్షణ సుధారమ్యాద్భుతాక్షుండు; రా
మక్షోణీశ్వరు సేవకున్ గొలుతు క్షేమస్ఫూర్తినిన్ మారుతిన్ 6

పక్షంబుల్ సువిశాల సుందరమహాప్రాసాదభాగమ్ములై
విక్షిప్తాక్షయసూక్ష్మతూలికలు మేల్వింజామరల్ గా, సరో
జాక్షున్ స్కంధతలంబునన్ నిలిపి రక్షఃపక్షమున్ గూల్చ నా
పక్షీంద్రున్ ఘనపక్షు గొల్చెద మదిన్ వ్యాళచ్ఛటోన్మూలునిన్.

అసురభీకరమౌ సహస్రధారాన్వి తా
వక్రవిక్రమపేటి చక్రధాటి
దశదిశాపూరితధ్వనిమాత్ర వేదోండ
చటులభేదనవర్తి శంఖమూర్తి.
అరివీర దుర్నిరీక్షాకృతి సజ్జనా
నందకంబై యొప్పునందకంబు
జ్యాటాంకృతిచ్ఛటాజృంభితోదద్ర
శాత్రవౌఘలయము-శార్ఙ్గరవము

కదనభయదశక్తి కౌమోదకీయుక్తి
భక్తజనుల పాలి పరమరక్ష
పరగు విష్ణుదేవు పంచాయుధమ్ముల 8.
భక్తియుక్తి మిగులఁ బ్రస్తుతింప.

## జగద్గురుస్తుతి

పాషండ మతతరుప్రతతికిదావాగ్ని;
చార్వాక శైల వజ్రంపు ధార;
బౌద్ధమతధ్వాంతభాస్కరబింబమ్ము;
జైన మదేభ పంచాననమ్ము;
సరవి మాయావాద సర్ప పక్షీంద్రమ్ము;
త్రైవిద్యలకు శిరోరత్నభూమి;
శ్రీ వైష్ణవాగమ సిద్ధాంతలక్ష్మిస
ముద్భవమ్మునకు సముద్రగర్భ;

మహాహా! శ్రీరంగరాజ పదాబ్జబంభ
రమ్ము; విజయధ్వజీభూతరంగభర్త;
బద్ధభవవార్ధి మగ్నుల నుద్ధరించి,
నట్టి యాచార్య రామానుజార్యుఁ గొలుతు 9

చోళరాజపురోహితులీల గెలిచి
ఎదురు లేనట్టి పండితుం డీతఁడనఁగఁ
గీర్తిఁ గైకొన్న వైష్ణవాగ్రేసరుండు
మోదమొప్పార యామునమునినిఁ దలఁతు, 10

అమితాజ్ఞాన మహాబ్ధి మగ్నమగు బ్రహ్మాండ ప్రజావాహినిన్
దమి జ్ఞానైక పథంబునన్ నడుప విద్యారూపభక్తి ప్రబో
ధము గావించి మురారి పాదనలినద్వంద్వంబునర్చించుమన
ధ్వము చూపించిన వారిఁ గొల్తు నెడదన్ బన్నిద్దరాళ్వారులన్. 11

## పితృపూజ

అజ్ఞాన తిమిరంబు లాటలాడెడు వేళఁ
బూడివాడను పురమ్మున జనించి,
పిననాట సంకురించిన విష్ణుపదభక్తి
వికసించి వయసుతో విస్తరింప;
దేవాలయము గట్టి శ్రీవేణుగోపాల
దేవునిఁ దెచ్చి ప్రతిష్ఠ సలిపి,
జ్ఞానసూర్యోదయ గ్రంథరాజము మొదల్
గల యెన్నొ పుస్తకమ్ములు రచించి

ఓజ, శ్రీభాష్యకారసమాజమొకటి
నెలమి స్థాపించి, పెక్కు శిష్యుల గడించి
చేతనుల నెల్ల నుద్ధరించిన మహాత్ముఁ
డలరుఁ బితృదేవు వేంకటదాస విబుధు. 12

ఎవని పదారవిందరజ మించుక సోఁకిన బద్ధచేతనుల్
భవజలధుల్ తరించి, సులభమ్ముగ మోక్షముఁ జూఱలాడిరో?
ఎవని దరస్మితామృత మొకింత స్రవించినఁ బాపతాపముల్
దివిరి నశించెనో? యెవని దివ్యవచఃప్రభలజ్ఞతాంధకా

రపసరమున్ బటాలున బ్రద్దలుచేసి జనాళిఁ బ్రోచెనో?
యవగతి రామనామ మధురాక్షర రమ్య మహత్త్వ మెవ్వఁడీ
యవనిని వ్యాప్తిచేసెనో? అనంతయశస్సున కాలవాలమై
యెవని చరిత్ర నిల్చె? స్తుతియించెద నమ్మని వేంకటాఖ్యునిన్.

## మాతృపూజ

పతిపాద సేవనా భావనారతి తప్ప
అన్య మెఱుంగని అతి పవిత్ర
పేదసాదల సదా ఆదరంబున పిల్చి
అన్నంబు వెట్టిన అమృతహస్త
యాచకప్రకరంబులరు దేరలేదని
ఉచ్చరింపఁగలేని సచ్చరిత్ర
క్షితిసర్వమానవక్షేమకార్యముల, ఆ
సక్తి నెఱపిన విశాల హృదయ

సతత దేవపూజాక్రియా చరణ నిరత
రమ్య సద్గుణ నికురుంబ, రాధమాంబ
నాదు తల్లిని వినుతింతు మోదమరలఁ
దల్లిఋణమును దీర్చు పుత్రకులుగలరె? 14

---



గ్రంథకర్త - వారి ధర్మపత్ని

## శ్రీమతే రామానుజాయనమః

"యత్పాదాంభోరుహధ్యాన విధ్వస్తాశేషకల్మషః
వస్తుతాముపయాతోహం యామునేయం నమామితం"

ఆసియాఖండమునందు గల దేశమ్ముల కన్నింటికంటె, భారతదేశమున కొక ప్రత్యేకత కలదు. ఈ దేశమునందున్న కులములుగాని – మతములుగానీ – భాషలుగాని మరి యేదేశమునందును లేవనియే చెప్పనొప్పును దీనికి, ఈ దేశమున వ్రేళ్ళూనుకొనిన గీర్వాణభాషయే కారణము. అపారమగు వేదవాఙ్మయమంతయు నిందేయున్నది. ఋగ్వేదము, ప్రపంచమునందలి మొదటి గ్రంధమని, ఖండాంతరవాసులుగూడ నంగీకరించి యున్నారు. ఈ భారతదేశ చరిత్ర మొత్తము ఋగ్వేదము నందే యున్నది. కాని అది వేదమగుటచేతను, దాని సంప్రదాయ మతి ప్రాచీనమగుటచేతను, అందలి శబ్దములు – పారిభాషికపదము లగుటచే అది సామాన్యులకు దురవగాహమై యున్నది.

శ్రుతికి ఉపబృంహణము స్మృతీతిహాసాదులు, స్మృతులవలన, ఇతిహాసములవలన వేదార్థము తెలిసికొనవలయునే కాని, కోశాదులవలన తెలియదు. ఉదాహరణమునకు "అత్యతిష్ఠద్దశాంగుళం" (పురుషసూక్తము) పది యంగుళముల మేరకు వ్యాపించి యుండెనని కోశాదులవలన తెలియుచున్న భావము. కాని దాని అర్థ మది కాదు. "దశగుణం. ఇదముపలక్షణం – అనంతపరిమాణమితియావత్" అని పెద్దలు సెలవిచ్చిరి. అందువలన వేదాదుల అర్థ మవగతమగుట కొఱకే పురాణేతిహాసములు బయలుదేరినవి. వీని యన్నింటియందును, మానవుని మనుగడ కవసరమగు విషయములే ప్రతిపాదింపబడి యున్నవి.

ఎందరో మహానుభావు లీ భారతభూమియం దవతరించి, యెన్నియో సంస్కారము లాచరించిరి. ఎన్నియో నీతు లుపదేశించిరి. వారు ప్రబోధించినమార్గములే మతములని వ్యవహరింపబడుచున్నవి. సంస్కృత వాఙ్మయము, ఋక్కులుగను, సూత్రములుగను, శ్లోకములుగను, గద్యములుగను, అనేక ప్రక్రియలతో కూడియున్నది.

చార్వాక, గాణాపత్య, సౌరాదిమతము లనేకములున్నను, వానిని ప్రజ లెక్కువగా ఆదరింపలేదు. ఆరు మతములు జనాదరణ మత్యంతముగా పొందినవి. అవియే షడ్దర్శనములు. న్యాయము- వైశేషికము-సాంఖ్యము-యోగము-మీమాంస-వేదాంతము. ఈ ఆరింటిలో నేదిముందు, ఏదివెనుక అని నిర్ణయించుట చాలకష్టము. న్యాయమునకు కర్త గౌతముడు. ఇతడు ఈ దృశ్యమాన ప్రపంచమంతయు పదియారు పదార్థములుగా విభజించెను. ఈతడు ప్రత్యక్షము – అనుమానము – శాబ్దము – ఉపమానము అను నాల్గు ప్రమాణముల నంగీకరించెను.

వైశేషికమునకు కర్త కణాదుడు. ఇత డీ జగత్తు నంతయు ఏడు పదార్థ ములుగా విభజించెను. ఇతడు ప్రత్యాక్షానుమానశాబ్దము లను మూడు ప్రమాణము లనే గ్రహించెను. ఈ రెండుమతములును తర్కప్రమాణములు కావున (కార్యేణ కారణానుమానమ్) అనగా కార్యముచేత కారణము నూహింపవలసియున్నది. అందుచే ఈ కార్యరూపమైన జగత్తునకు కారణముండి తీరవలయును. (అంకురాది కం సకర్తృకం యథాఘటవత్) అంకురాదులన్నియు కర్తతో కూడియున్నవి కనుక, ఈ జగత్తునకు బ్రహ్మము నంగీకరింపలేదు. ధర్మాధర్మరూపకర్మములకు ఫల మొసంగునది అదృష్టమని యొక తత్త్వమున్నది. దానిచేతనే చేతనులు సుఖదుఃఖ ముల ననుభవించుచున్నారనియు, జీవేశ్వరులు భిన్నులనియు – అందీశ్వరుం డొక్కడేగాని – జీవులు ప్రతి శరీరభిన్నులనియు వచించిరి.

ఇక సాంఖ్యము. ఇందు ప్రకృతి పురుషు లిద్దరే సత్యము జడ స్వరూప మగునది యంతయు, ప్రకృతియనియు, చేతన స్వరూపమంతయు పురుషుడనియు, ఈ పురుషుడు ప్రకృతియందు చిక్కి జనన మరణాది రూపమగు దుఃఖము ననుభ వించుచున్నాడనియు, ప్రకృతినుండి విడిపడుటయే మోక్షమనియు, ఈ మతము నిర్ధా రించెను.

యోగముకూడ నించుమించు సాంఖ్యమును బోలియే యుండును. కాని జీవుడు మోక్షమును పొందుటకు, యమనియమాదులతో కూడిన యోగ మవసరము. దానిచేత మాత్రమే మోక్షము లభింపగలదని యీ మతము నిర్ణయించెను.

పై చెప్పిన ఈ రెండుమతములును నిరీశ్వరములే దైవమున్నాడని యివి యంగీకరింపవు.

మీమాంసకు వేదమే ప్రమాణము. వేదముయొక్క పూర్వ భాగము నను సరించి యుండును. ఇందు తత్త్వములు మూడు. 1. ప్రకృతి. 2. పురుషుడు, 3. అపూర్వము. పురుషుడు వేదవిహితమగు యజ్ఞాది విహితకర్మములను చేయ వలయును. అందుచే నాతడు మోక్షమును పొందుచున్నాడు. దీనికి అపూర్వమే కర్త.

వేదాంతమునకును వేదమే ప్రమాణము. కర్మజ్ఞానస రూపమగు వేదము నంతయు నంగీకరించినను, జ్ఞానకాండయగు నుపనిషత్తులమీదనే యిది యెక్కువగా నాధారపడియున్నది. అభిప్రాయభేదముచే దీనియం దనేక మతము లుద్భవించినవి. 1. అద్వైతము, 2. విశిష్టాద్వైతము, 3. ద్వైతము, మూడు మతములును, మూడు తత్త్వముల నంగీకరించినవి. 1. చిత్తు, 2. అచిత్తు, 3. ఈశ్వరుడు, 'చిత్తు' అనగా జీవుడు అచిత్తు అనగా జడాత్మకమగు నీ ప్రపంచము. ఈశ్వరుడు పై రెండింటిని నియమించువాడు.

తత్త్వములు మూడయినప్పటికిని, ఈశ్వరుడొక్కడే సత్యమని శంకరా చార్యులు భావించిరి. ఈయన మతముప్రకారము జీవప్రకృతులు రెండును భ్రాంతి కల్పితములు 'మాయ' అనునది అనాది. ఇదియే అవిద్యయని చెప్పబడును. దీనిచే ఈశ్వరునకు భ్రాంతికలిగి నేను జీవుడను, అను భ్రమ తోచుటచే, జనన మరణాది రూపమగు దుఃఖము కలిగి ప్రకృతియందు చిక్కెను. అతడెప్పుడు నేను పరబ్రహ్మ మును – ఈ కనంబడుచున్నదంతయు రజ్జుసర్ప భ్రాంతివలె మాయా (భ్రాంతి) కల్పితము, ఇది మిథ్య, అను జ్ఞానము పొందునో, అప్పుడే ఈ సంసార బంధ మంతయు నశించి, తన స్వరూపమును పొందును. అదియే మోక్షమని శంకర భగవత్పాదులు వివరించిరి.

భాస్కరాచార్యులు తత్త్వత్రియము సత్యమే ఐనను, ఉపాధిభేదముచే సత్యమేకాని, ఈశ్వరుని కంటె భిన్నము కాదు అని వచించిరి. భాస్కరుడు తన భాష్యారంభమున "సూత్రాభిప్రాయ స వృత్యాస్వాభిప్రాయ ప్రకాశనాత్ వ్యాఖ్యాతం యైరిదం శాస్త్రం వ్యాఖ్యేయం తన్నివృత్తయే" శంకరులు సూత్రకారుని అభిప్రాయ మును కప్పి పుచ్చి తమ యిష్టానుసారముగా భాష్యమును రచించిరి. అందులకై నేను యదార్థమును తెలుపుచు వ్యాఖ్యానించుచున్నాను' అని పేర్కొనెను.

యాదవప్రకాశులు మూడు తత్త్వములును సత్యములే అయ్యును, ఇవి ఈశ్వరుని వికారములేకాని వేరుకావని అభిప్రాయపడెను. ఈమూడు మతములును

కించిద్భేదము కలవియేగాని, మొత్తముమీద అద్వైతములే. వీనికి వరుసగా మాయా వాదము - ఉపాధివాదము - వికారవాదము - అని పేర్లు.

ఈ అద్వైతమునందు ఈశ్వరుడు నిర్గుణుడు. నిర్విశేష చిన్మాత్రుడు. నిర్విశేషమనగా సజాతీయ - విజాతీయ - స్వగతభేదములేకుండుట. శ్రీ భాష్యము - జిజ్ఞాసాధికరణము "యదస్యాహుః అశేష విశేషప్రత్యనీక చిన్మాత్రం బ్రహ్మైవ పరమార్థః తదతిరేకి నానావిధ జ్ఞాతృజ్ఞేయ తత్కృతజ్ఞానభేదాది సర్వం తస్మిన్నేవ పరికల్పితం మిథ్యాభూతం" అని చెప్పుచున్నది. అనగా పైని చెప్పినభేదములు లేని పరబ్రహ్మ మొక్కటియే సత్యము. తద్వ్యతిరేకములగు జ్ఞాతలు జ్ఞేయములు, జ్ఞానములు - అన్నియు ఆ బ్రహ్మమునందే కల్పితములు - మిథ్యాభూతములు. మిథ్యయనగా "మిథ్యాత్మంనామప్రతీయ మానత్వపూర్వకయథావస్థిత వస్తుజ్ఞాననివృత్త్యత్వమ్"

విశిష్టాద్వైతము చిదచిదీశ్వరులను మూడు తత్త్వములును సత్యములేయని విశిష్టాద్వైతుల విశ్వాసము ఏదియు మిథ్యాభూతముకాదు. ఈశ్వరుడెట్లు సత్యమో, అట్లే జీవ ప్రకృతులు రెండును సత్యమే. ఇందు ప్రకృతి పరిణామముకలదు. స్థూల సూక్ష్మరూపములు రెండును కలవు. జీవేశ్వరులు మాత్రము నిర్వికారులు. అనగా వారు స్థూలసూక్ష్మస్వరూపరహితులు. ఈశ్వరుడు తన ఇచ్ఛచేతనే స్థూల సూక్ష్మ రూపములు ధరించును. భగవద్గీతలో శ్రీ కృష్ణుడు "జన్మకర్మచమే దివ్య" మనుశ్లోకమున "అర్జునా? నాజన్మములుగాని, కర్మములుగాని, దివ్యములు. అప్రాకృతములు. అని ఎవడు తెలిసికొనునో వాడీ సంసారబంధమునుండి విముక్తుడగును" అని వచించెను. ఈమతమున సర్వేశ్వరుడు నిర్గుణుడు కాదు. నిఖిల హేయప్రత్యనీక కల్యాణైకతానానన్తజ్ఞానానన్దైక స్వరూపుడు. సకల దుష్టత్వములకు ప్రతిభటములు మంగళాకరములు నైనజ్ఞానము - ఆనందము మొదలగు గుణములకు స్థానమైన వాడు. జీవుల సంఖ్య అనంతము. ఒక్కొక్క శరీరమునకు ఒక జీవుడు. ఈజీవుడు అనాదియగు కర్మచే జననమరణరూపమగు నీ సంసారమునందు చిక్కుకొని బాధలం దుచు, సదాచార్యాశ్రయణముచే జ్ఞానము కలిగి, తద్వారా సర్వేశ్వరునియందు భక్తి కలిగి, యుండును. భక్తిస్వరూపమును "నిరతిశయ ప్రియానన్య ప్రయోజన స్వేతర వైతృష్ణ్యావహజ్ఞానవిశేష ఏవ" అధికమగు ప్రియంకరమగునదియు, ఇతర ప్రయోజనము లేనిదియు తనకన్న నితరమునందు కోరికలేనిదియు నగు జ్ఞానస్వరూ

పమే భక్తి యని భాష్యకారులు నిర్వచించిరి. సర్వేశ్వరునియందు సర్వ భావములను నిక్షేపించి యున్నచో, నాతడే భక్తుని రక్షించును. ఇదియే ప్రపత్తి. రక్షించుటయనగా సర్వేశ్వరుడు తనతో సమానమైన రూపమును, సమానమైన లోకమును ఇచ్చి, ఆదివ్య లోకమునందు ఆనందపడునట్లు చేయుట. ఇదియే మోక్షము. ఈ మతము అనాది యనియు, మహర్షుల కాలమునుంచి వచ్చుచున్నదని చెప్పుటకు కాబోలు, భాష్యకారులు కొందఱు మహర్షుల నామములను పేర్కొనిరి. "భగవద్బోధాయనటంకద్రమిడి గుహదేవకపర్దిభారుచిప్రభృత్యవిగీతశిష్టపరిగృహీతపురాతనవేదవేదాంత వ్యాఖ్యాను వ్యక్తార్థ శ్రుతినికరదర్శితోయం పన్థాః" బోధాయన-టంక-ద్రమిట - గుహదేవ - కపర్ది - భారుచి మొదలగు మహాపురుషులచేత ప్రతిపాదింపబడిన అర్థములుగలదియు, వేదవేదాంతములందు పేర్కొనబడినదీ మతమని వారు సాయించిరి. ప్రకృతిరూపమగు మహాభూత సంఘాతము జీవునకెట్లు శరీరమో, అట్లే జీవుడును పరమాత్మకు శరీరము ఇదియే సామానాధికరణ్యము. విడదీసిన ప్రకృతివేరు, జీవుడు వేరు. సర్వేశ్వరుడు వేరు. కలిసినచో నొకేస్వరూపము. సూక్ష్మచిద చిద్విశిష్టుడు సర్వేశ్వరుడును, స్థూలచిద చిద్విశిష్టుడగు సర్వేశ్వరుడును ఒక్కడే, దీనిచేతనే ఈ మతమునకు విశిష్టాద్వైతము అని పేరు వచ్చినది.

హేయులగు ప్రకృతిజీవులు, కల్యాణగుణస్వరూపుడగు సర్వేశ్వరున కెంత మాత్రము శరీరసంబంధులు కారని ద్వైతము ప్రతిపాదించుచున్నది. ఈశ్వరునకు నీశ్వరుడే. జీవునకు జీవుడే. పరబ్రహ్మేచ్ఛచే జీవుడు ఆనందమయమగు లోకమును పొందును. ఇదియే మోక్షము అని నిర్ధారించెను. అందులకే దీనికి ద్వైతమను పేరు కలిగెను.

ఈ పైని పేర్కొనిన మతకర్తలు ముప్పురును ప్రస్థానత్రయమునకు భాష్యములను వ్రాసిరి. ప్రస్థానమనగా, "ప్రకృష్టం స్థానం ప్రస్థానం" గొప్ప స్థానము అని అర్థము. దేనికి గొప్పస్థానమనగా సర్వేశ్వరుని పొందుటకని సమాధానము. అనగా ఈ సంసారమందు బంధింపబడిన జీవుడు సర్వేశ్వరుని సన్నిధానమునకు పోవుటకై ఇది మార్గము. ఈ మూడింటియందే ఆ మార్గము ప్రదర్శింపబడినది. కావున దీనికి ప్రస్థానత్రయమని పేరువచ్చెను. దశోపనిషత్తులు-బ్రహ్మసూత్రములు-

లేవు. ఈ విషయములు మా తండ్రిగా రనేక పర్యాయములు శిష్యుల కుపదేశించు చుండగా వింటిని. దానిని గ్రంథస్థమొనర్చితిని. మిగిలిన చరిత్రములుకూడ వ్రాయ వలయునని కుతూహలమున్నది. భగవ దనుగ్రహమున్నచో అచిరకాలముననే వానిని రచింతును. గుణగ్రహణ పారీణులగు ధీమణులు దోషములను క్షమించి గుణములను గ్రహించి నన్ను అనుగ్రహింతురు గాక.

పుస్తకములు వ్రాయుట యొకయెత్తు, వానిని ప్రచురించు టొక యెత్తు ఈ గ్రంథ ముద్రణమునకు తిరుపతి-తిరుమల దేవస్థానమునుండి ధనసహాయ మందిం చిన, ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు శ్రీమాన్, **P. V. R. K.** ప్రసాదు **I. A. S.** గారికి, పబ్లిక్ రిలేషన్ ఆఫీసరు శ్రీమాన్ రావుల సూర్యనారాయణ మూర్తి **M. A : B ed.** గారికి శ్రీ వేంకటేశ్వరస్వామి అనంత సుఖ సంతో షాయురారోగ్యైశ్వర్యముల ప్రసాదించుగాకయని శ్రీవారిని ప్రార్థించుచున్నాను. పుస్తకము నందముగా ముద్రించిన అనూరాధా ఆర్ట్ ప్రింటర్స్ వారికి నా మెచ్చుకోలు.

పూడివాడ
రౌద్రి-గ్రీష్మము

సుధీ విధేయుడు.
**మొవ్వ శ్రీనివాస పెరుమాళ్ళు.**

# పూర్వాచార్య చరిత్రము

## (రామానుజ వైభవం)

అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుండును. సమస్త కల్యాణ గుణ పరిపూర్ణుండును. అఘటనఘటనా సమర్థుండును, సర్వజగత్సృష్టి, స్థితి, లయ కారకుండును, భక్తాభీష్ట ఫలప్రదుండును, ఆనంద స్వరూపుండును, అవాఙ్మానస గోచరుండును, సనకసనందనాది మహాయోగిజన సంసేవ్యుండును నైన నారాయణుండు, జగన్మాతయు, కరుణాస్వరూపిణియునగు లక్ష్మీదేవి తనను, సేవించుచుండ, రత్నప్రభా భాసిత సహస్రఫణామండిత శేషపర్యంకంబున, శయనించి యుండెను. అట్టి సమయంబున లోకమాతయగు లక్ష్మి విభుండగు సర్వేశ్వరునకు పాదము లొత్తుచుండెను. అట్టితఱి ఆ లక్ష్మి తన దివ్యమనంబున నొక్కసారి నిత్య విభూతింగూర్చి చింతించెను, ఆ నిత్య విభూతియందు నివసించు జీవ కోటులు, ఆనందాతిశయముచే మైమఱచి, సర్వేశ్వరు ననుభవించుచు, కేవలము, ఆనంద సుఖస్వరూపులై తమ తమ భార్యలతో గూడి రమించు చుండిరి.

పిమ్మట ఆ జగన్మాత లీలా విభూతివైపునకు తన దివ్య దృష్టిని మరల్చెను. ఇకనేమి చెప్పవలెను? ఆ లీలావిభూతియందు నివసించు వార దఃఖ దుఃఖపంక నిర్మగ్నులై, కష్ట సముద్రతరంగాభి ఘాతులై, తినతిండియు కట్ట బట్టయు లేక, పాపకార్యములయం దాసక్తి కలవారలై, తత్కారణమున నరకాది దుష్టలోకగతులై, యాతనాసమూహముల ననుభవించుచు, హీనజన్మము లెత్తుచు, అనేక బాధలందుచుండిరి. ఈ వృత్తాంతంబంతయు నారసిన కరుణాలయయగు పద్మాలయ, అత్యంత దుఃఖిత అయ్యెను. ఆమె కనుగొలకులనుండి జారిన మిలిమెచ్చని కన్నీటిధారలు సర్వేశ్వరుని పాదపంకజములను ప్రక్షాళించెను. అప్పుడు వెన్నుడామెను కనులెత్తిచూచి యిట్లనెను.

"ఓ తన్వీ ! నీ విచారమునకు కారణం బెయ్యది ? లోకముల కేటు వంటి అపాయమును సంభవించలేదు కదా ? నిత్య లీలా విభూతుల యందున్న వారెల్లను కుశలురే కదా !"

ఆమె భర్తను కనుంగొని "దేవా ! మీరు జగదధీశ్వరులు. సర్వజ్ఞులు. మీకు నేను చెప్పగలదానను కాను. ఐనను మీరు నాకిచ్చిన చనవుచే వచించు చుంటిని. మన విభూతి రెండు రూపముల విరాజిల్లుచున్నయది. 1. నిత్యవిభూతి, 2. లీలా విభూతి, పరమాకాశమను నామాంతరముకల, ఈ నిత్య విభూతియందు, జీవు లెట్లు సుఖించుచున్నారో, ఎంతటి ఆనంద మనుభవించుచున్నారో చెప్ప శక్యముకాదు. ఇక లీలా విభూతిలో నున్నవార లెంతటి దుఃఖమునందుచున్నారో, ఆనంద విహీనులై ఎట్టి కష్టముల బడుచున్నారో వచింపతరముగాక యున్నది. వారలు కృత్యాకరణ, అకృత్య కరణములాచరించుచు హీన జన్మములెత్తి, దయారూపులైన మీ పదపద్మములకు దూరులై, నీచులై అధోగతిపాలగుచు నున్నారు. మీకు పతిత జనోద్ధరణ బిరుదము అన్వర్థముకదా ! అట్టి మీరు లీలా విభూతియందున్న వారిని, ఇంతటి దుఃఖ పూరితులనుగాజేయ పాడియా ? నిత్య విభూతియందలి జీవులు ఆనంద సముపేతులై వర్తించుచుండ "సమోహం సర్వ భూతేషు" అను బిరుదమున కన్యధాత్వము సిద్ధింపదా ? కావున లీలా విభూతి యందలి జీవులనుగూడ, నిత్య విభూతియందలి జీవులనువలె ననుగ్రహింపుడు. దేవ! వారిని శాసించు దానను గాను, కర్తవ్యము నుపదేశించు దాన నంతకంటె గాను. ఆ, బద్ధ సంసారుల దుఃఖమును వీక్షించుటచే నా మనస్సున కశాంతి కల్గు చున్నది. ఈ విశ్వము నందలి జంతు సంతానమంతయు మన కొక్కరూపమేకాని వేరుకాదు. కుమారులకు వారిలో వారికి తరేతరభేదము ఉండుట సహజమేకాని, తల్లి దండ్రుల కుండపుకదా ! తమకు తెలియనిదిలేదు. మీరు నిగ్రహానుగ్రహ సమర్థులు. సర్వస్వామ్యత్వరులు. అశరణ్య శరణ్యులు. మీరనుగ్రహింపవిచో నీ జీవుల నుద్ధరించు వారెవరు ? సంతానమంతయు సమత్వమును కల్గి సుఖించు చుండ మనము కనులారగాంచి సంతసింపవలె" నని పల్కెను.

అంతట శ్రియఃపతి ఆమె వాక్యంబులు ముద్దుసేసి, అల్లననగుచు, మెల్లగా నిట్లనియె. "ఓ దేవీ ! నీ వాక్యమ్ములు సత్యదూరములుకావు. నేనీ విషయములను మున్నే ఆలోచించి, లీలా విభూతి జీవులనుద్ధరింప, అనేక ప్రయ

త్నము లొనర్చితిని. అవి యన్నియు అడవిగాచిన వెన్నెలలాయెను. సనకస నందనాది యోగివరేణ్యుల మూలమున, ఆత్మ తత్త్వమును, లోకమునకు ప్రబో ధించితిని. కేవలము ఒక్కసారి వినిన మాత్రమున కృతార్థత జెందజాలు శాస్త్ర ములు సృజించితిని. మహా పవిత్రములై, సంతోషదాయకములై, మోక్ష ప్రద ములై యొప్పు గంగా, యమునా, గోదావరీ, కావేరీ, కృష్ణాది దివ్యనదీనదమ్ముల ననేకంబు కల్పించితిని. సర్వజీవులకు, ఆనందదాయకమగు సూర్యకాంతి గుడ్ల గూబల కనహ్యమైనట్లు, నేను కల్పించినవన్నియు, వీరియందు నిష్ఫలములైనవి. వారు, ఆధ్యాత్మ తత్త్వోపదేష్టలగు మహాయోగులను, తమవంటి ప్రాకృతమానవు లనుగా తలంచిరి. శాస్త్రములను, అప్రమాణములని తృణీకరించిరి. పుణ్యనదీనద జలములను సామాన్య కూపోదకముగా నెంచి, నీరు దేహమలినమును పోగొట్టునే కాని, పాపములను పోగొట్ట జాలదని తీర్మానించి, "నదీజలము, పాపముల పోగొట్ట జాలునచో, ఆ నదీ తీరవాసులు, నిరంతరము, ఆ నీటిని, అన్నస్నాన పానాదులకుపయోగింతురుకదా! వారందరకు మోక్షము సంప్రాప్తించునా? ఆ నీటియందు మునుంగుచున్న పశు పక్ష్యాదులకు, అదే నీరమున నివసించు మత్స్య సర్పాది జలజంతువులకు ఉత్తర జన్మములు నశించి, కైవల్యము సిద్ధించునా?" అని హేళన మొనర్చుచున్నారు. వీనివలన ప్రయోజనములేదని నిశ్చయించి, నేనే అజహత్స్వభావముతో, రామకృష్ణాద్యవతారములెత్తి అసాధారణములు, అనితర సాధ్యములు అగు మహాకార్యంబులు అవలీలగా నిర్వహించితిని, దివ్యరూప మ్ములు ప్రదర్శించితిని. నేనే సర్వేశ్వరుండనని చాటించితిని. చెప్పించితిని. అవియు వారలయందు నిష్ప్రయోజనములైనవి. నా అవతారమ్ములను దూషించి, మహాపాతక కార్యంబుల కొడిగట్టిరి. నన్ను సజాతీయునిగా తలంచిరేకాని, పర బ్రహ్మమనని యెంచరైరి. పరలోక మొకటియున్నదా? యని కొందఱును, ఈ జగత్తు నిరీశ్వరమని మఱికొందఱును, సర్వమును మిథ్యయని, యింక కొంద ఱును భావించి దుర్గతి పాలగుచున్నారు. దీనికి నన్నేమందువు? నేను చేయ గల్గిన దేమున్నది?"

ఆ ఆదిమ దంపతుల సల్లాప సంవాదము వినుచున్న ఆదిశేషుండు "ఓ స్వామీ! మీరిట్లు తలంపవలదు. అనుగ్రహించి నన్ను భూలోకంబున కన్పుడు. నేను పోయి, ఆ భూలోక వాసులందఱును, తమకు సుముఖుల నొన రించి, ఈ లోకమునకు గొనివత్తును. నాకేకాని యీపని నీకెట్లు సాధ్యమని

ప్రశ్నింప వలదు. అల్పజ్ఞుల నుద్ధరింప సజాతీయులే కావలయుగాని, విశ్వనియం తలగు మీకు సాధ్యముకాదు. నన్ను పంపదలచుకొన్నచో నాకు ఈ ఉభయ విభూతులపై సర్వాధికారము నొసంగవలయును. లేనిచో నా ప్రయత్నము చెవిటివాని ముందూదిన శంఖధ్వని కాగలదు. దేవఅవారనుగ్రహించినచో కొలదికాలముననే, ఈ నిత్య విభూతి పెద్ద సందడితో కూడినదగునుగాక చిత్తగింపగలరు'' అని నిటలతల ఘటితాంజలియై విన్నవించుకొనెను.

ఆ మాటలకు శ్రీ శ్రియః పతులు సంతసించి, అనంతుని దయా వీక్షణంబుల నాదరించి, ''వత్సా! నీ వడిగినట్లే ఇచ్చితిమి నీ యాత్ర దిగ్విజయ మగుగాక. మధ్యమ లోకమునకు పోయిరమ్ము'' అని సెలవిచ్చిరి.

అపుడా శేషుడు లక్ష్మీనారాయణుల పాదారవిందమ్ములకు ప్రణమిల్లి, వారిచ్చిన ఆశీర్వాదముల గ్రహించి, వారియాజ్ఞ శిరసావహించి, భూలోకమునకు వచ్చుచుండెను. ఇది యిట్లుండ తూర్పు సముద్రమునకు పశ్చిమముగా. తుండీర మండలమ్మున కలంకారప్రాయమై, విద్వజ్జన నివాస భూమియై, సర్వసస్య సంపత్సమృద్ధమై, శాఖోప జీవితానేక శకుంత సంతాన సమాక్రాంత తరుషండ మండితోపవన విరాజితమై, ధర్మగోపురమణిమయమంటప దివ్యవిమాన ప్రాకార భాసురంబై, ఆదికేశవాధిష్ఠితంబై భూతపురమను పురంబొండు, ఆ ఖండల పుర వైభవంబున మెండుకొనియుండు.

ఆ పుర ప్రజలు నిత్యసత్య వ్రతులు. ధర్మరతులు. అట్టి ఆ నగర మ్మునకు చుట్టును, అనేక భూతమ్ములు నివసించి యుండెను. ఆకారణమున ఆ పురమ్మునకు పెరుంబుదూరను పేరు కలిగెను. ఆ భీకరభూతముల బెడదకు తట్టుకొనజాలక, ఆస్తిపాస్తులను వదలి గ్రామమును వీడిపోవజాలక, అందలిజనులు' రాత్రులందు సమీపగ్రామమును వీడిపోవజాలక, అందలి జనులు, రాత్రులందు సమీప గ్రామములకేగి, ఆ రాత్రుల నచ్చటగడిపి. ఉదయకాలములందు తమ గ్రామములకు మరలివచ్చెడివారు. ఇట్లు చాలకాలము గడచిపోయెను. ఇట్టి బెట్టిదపు కష్టముల కగ్గమగుచుండిరిగాని, ఆ యూరిని మాత్రము విడిచిపోవలేక పోయిరి. ''సుగుణాకర జన్మభూమి సుఖమెట్టిదోకో'' అన్న వాక్య మీనాటిదా? 'జనని కన్నమేలు జన్మభూమి'' అని పెద్దలు నుడివి యుండిరికదా!

ఆ పెరుంబుదూరు పురమ్మున, అసూరి వంశమునందు, కేశవయజ్వ అను నొక బ్రాహ్మణ శ్రేష్ఠుడు నివసించుచుండెను. ఆయన సమస్త వేదవేది. సకల శాస్త్రపారగుడు. నిత్యాగ్నిహోత్రి, నిరతాన్నదాత. నిష్ఠాగరిష్ఠుడు. శీలసంపన్నుడు. అతని భార్య కాంతిమతీదేవి ఆమె మహాసాధ్వి. సుగుణవ్రత, ఆర్యవృత్త. అట్టి అర్ధాంగితోకూడి, అత దఖిల భోగముల ననుభవించుచు, భగవచ్ఛాసనంబుల నెరవేర్చుచు, ధర్మకార్య తత్పరుండై కాలము బుచ్చుచుండెను. ఆతడు సంతాన హీనుడైన కతమున, ఆదికేశవ స్వామినారాధించుచు, భార్యాసహితుడై వ్రతము ననుష్ఠించు చుండెను. ఆ వ్రత పూర్తియైన వెనుక, ఆదికేశవస్వామి సన్నిధికేగి, తీర్థ ప్రసాదమ్ములు స్వీకరించి, "ఓ స్వామీ! నీవంటి కుమారుని ప్రసాదింపుము" అని ప్రార్థించెను. అపుడా సర్వనియంత, అర్చక ముఖమున నిట్లు వచించెను.

"వత్సా! నావంటి పుత్రు నొసంగుమని యాచించుచుంటివి. నావంటివాడీ విశ్వమ్మున ఇతరుం డొక్కరుండులేడు. నేను నిస్సమాభ్యధికుడను. నావంటివాడను నేనే గనుక, మీగర్భ వాసమున నేనే జనింపవలసియున్నది. మీ భక్తికి సంతసించితిని. అట్లే మీకు జన్మించెదను."

ఆ పుణ్య దంపతుల మందానందమ్మున గృహమ్మున కరిగి, సర్వేశ్వరుని వాక్యంబులు తలంచి, ఆనందపడు చుండిరి. నిత్య విభూతినుండి భగవదాజ్ఞచే వచ్చుచున్న శేషుడు, ఆ కేశవయజ్వ ధర్మపత్నియగు కాంతిమతీదేవి గర్భమున ప్రవేశించెను ఆమెకు నవమాసములు నిండెను. ఒకనాడు భూతబాధకోర్వజాలని గ్రామవాసులు సాయం సమయమున, సమీప గ్రామములకు తరలుచుండిరి. అది వారి నిత్యకృత్యమగుటచే నెవ్వరికిని, అది బాధాకరముకాక యుండెను.

ఆసమయమున కేశవయజ్వయు, భార్యాసహితుడై ప్రక్కయూరికి వెడలుచుండెను. భార్య నిండుచూలాలగుటచే నడువలేక ఆయాసపడుచు, మెల్ల మెల్లన నడుగులు వైచుచు నడచుచుండెను. భర్త ఆమెను తొందరించు చుండెను అపుర వాసులందఱు నెవరి వసతులకువారు తరలిపోయిరి. సూర్యభగవాను, డస్తాద్రిం జేరబోయెను. నలుదెసల నల్లని చీకటులు, వ్యాపించెను. దృశ్యాదృశ్యములగు భూతజాలము గోచరించు చుండెను. అట్టివేళ విప్రుడర్ధాంగిం జూచి "దేవీ!

చూచితివా! దిక్కులంధకార బంధురములైనవి. దివాచరముల గోచరములైనవి. రాత్రించరములు సంచరించుచున్నవి. మనతో వచ్చిన వారందఱు నెవరి త్రోవన వారు చనిరి. మనమిప్పుడున్న ఈ స్థలము భూతముల కాటపట్టన యిందుము. ఇచట నిలువరాదు. వేగముగా పోవుదమురమ్ము" అని తొందరచేసెను.

అందులకా సాధ్వి భర్తమోమున దృష్టినిడిపి "స్వామీ! మీరనుచున్న మాటలు నాకు స్పష్టముగా విన్పించుటలేదు. గర్భవేదన అధికమైనది. నొప్పులు తగులుచున్నవి. నేను సత్వరముగా నడువజాలను సరికదా, మెల్లగ నడుగిడుటకు కూడ శరీరము వశమగుటలేదు నేను నడువజాలను. కాని మీరు మాత్ర మిచట మనలవలదు. త్వరగాపొండు, మీరుండియు నన్ను రక్షింపలేరు. ఇచ్చటనున్నచో మీకును భూతములవలన హానికల్గును. నాస్థితి యెట్లందురా? "దైవాధీనమ్ జగత్సర్వం" జగమంతయు సర్వేశ్వరాధీనమని కదా పెద్దలందురు. తనకు సాధ్యము కాని పనికై యత్నించి, హానిచెందుట మంచిదికాదు. "కోఽతివర్తేదైవమ్ దైవము నతిక్రమించు వారెవ్వరు? మీరు జీవించియున్నచో మరల వివాహమాడవచ్చును. వంశమైనను నిలుచును. మీకును, నాకును గల సంబంధ మింతవఱకేయని తలంపుడు. మీరుకూడ ఇచ్చటనేయున్న ప్రయోజనంబేమి? దుచ్ఛేద్యమైన ఈ ప్రేమ బంధమును త్రెంపికొని ఆలసింపక త్వరితగతినిపొండు" అని వచించెను.

ఆ మాటలకు భూసురవర్యుడెంతయో బాధనంది, భార్యను కౌగిలించుకొని, "ప్రియా! నీవు, ఏదినమున నాచెట్టపట్టితివో, ఆ దినమునుండియు, శరీరములు వేరైనను, మనస్సులొక్కటిగా గడపితిమి సుఖదుఃఖములను సమానముగా ననుభవించితిమి. నిన్నువిడిచి యొక్క క్షణమైనను జీవింపజాలను. అట్టి నేను, ఇప్పుడీ భూతమధ్యమ్మున నిన్ను విడనాడి చనుటయెట్లు? భార్యా భర్తల సంబంధ మేడుజన్మములవఱకుండుననియు, పరలోకమునందుగూడ కూడియుందురని శాస్త్రములు ఘోషించుచున్నవి. అర్ధాంగివగు నిన్నువిడిచి, ఈ లోకంబున జీవించియుండుటకంటె ఒకేసారి, ఇద్దఱమును కలిసిపోవుటయే మేల్తరమని తలంచుచుంటి" నని సాదరంబుగ వచించెను.

నీతోడిదే లోకము నాకును అగుగాక, యనుచున్న మగని మనసార కౌగిలించుకొని "నాథా! ఒక్కమాట వినుడు. మీరు నన్నురక్షింప లేనపుడు

మీరిటనుండుటయు వ్యర్థము, అదిగాక "నేనే మీకు తనయుండనై జనింతు"నని సర్వేశ్వరుండు మున్నె వరమొసంగి యున్నాడు. నాగర్భస్థ శిశువు దివ్యపురుషుడాయెనా, నాకే ప్రమాదమునులేదు. లేనిచో మనయిద్దఱకును అపాయము సంభవించును. మీరు క్షేమముగా నున్నచో వంశమునుద్ధరింప వచ్చును. అయ్యది ఉత్తమలోకములకు కారణం బై యుండును. మీరు తప్పకదయచేయుఁడు" అని ప్రతిమాలెను.

విధి ప్రేరణచే నెట్టకేలకు భార్యయందలి మోహపాశమును త్రెంచుకొన్నవాడై కేశవయజ్వ మరలి మరలి చూచుచు తరలిపోయెను. నొప్పులధికమగుటచే కాంతిమతీదేవియు స్పృహతప్పి పడిపోయెను.

ఆ సమీప వర్తులగు పిశాచములన్నియు గుంపులు గుంపులుగా నామె దరిజేరి, "మన మిన్నిదినంబులనుండి సంచరించుచున్నను, ఒక్క మనుజుడును లభింపలేదు. నేటికి గర్భవతియగు సుందరి లభించినది. మనము తొందరపడక, శిశువు జన్మించిన తదుపరి, సమముగా పంచుకొని భక్షింతము." అని తమలో తాము ముచ్చటించుకొనుచు, చుట్టును పరివేష్టించి యుండెను.

ఆ వాక్యములు కాంతిమతీదేవికి స్పష్టాస్పష్టముగ విన్పించుచుండెను. అంతట ఆమె గర్భమునందభివృద్ధినందుచున్న శేషభగవానుడు, ఉదయ శిఖరినుదయించు బాల భాస్కర ప్రభా విభవంబును క్రేణిసేయుచు, స్తంభోద్భవుండగు నృసింహదేవుని వైభవంబు నధః కరించుచు, యజ్ఞకుండమునుండి బయలువెడలు, సప్తజిహ్వుని తేజంబు తిరస్కరించుచు, భూమిపై నవతరించెను. ఆ దివ్యపురుషుని తేజః ప్రసరమ్ముచే సమీప భూమియంతయు కాంతిమంతమాయెను. ఆ తేజస్సుచే పిశాచములకు కన్నులు కన్పింపవాయెను. శరీరములు కంపించెను. హృదయములు నిష్పందము లాయెను. ఇట్టి విజృంభ మాణముతో ఆ అనంత దేవుం డవతరించినవాడై భూతంబుల నన్నింటిని, ఒక్కసారి భూమిలోని కణగ త్రొక్కుచుండెను.

అపుడా భూతముల నంత దేవునకు ప్రణమిల్లి "దేవాదిదేవా! నీవే విశ్వమయుండవు. లోకేశ్వరేశ్వరుండవు పురాణ పూరుషుండవు. దివ్యావతారంబులు దాల్చి యీ భూమి నుద్ధరించిన ఆదినారాయణుండవు. అనంతా! నీ దివ్యలీలలు

నుతింప నెవ్వరితరము? యోగీశ్వరేశ్వరుండవగు భగవంతుండవు నీవే. కాని యెడల మమ్మిట్లు బంధింప నెవ్వరితరము? మీ కంజలి బంధంబులర్పించు చున్నాము. మమ్మేమిచేయ దలంచితివో, అట్లే సేయుము. దయాజలధివగు నీవేమి చేసినను, మాకదియే అఖిల ఫలప్రదముకదా! దివ్యచిత్తానుసారమవధరింపుము'' అని వినయమున విన్నవించుకొనెను.

అంత ఆ ఫణినాథుండు భూతంబులంగాంచి ''ఓ పిశాచములారా! నేడు కలి విజృంభణముచే జగత్తంతయు పాప భూయిష్ఠమైనది. పాషండమయ మైన లోకంబున నిరీశ్వర వాదమధికమైనది. పుణ్య పాపమ్ములు మిథ్యయనియు, పరలోకము లేదనియు, జీవుడను నదసత్యమనియు, దేహమే జీవుడనియు, పాంచ భౌతికమగు ఈ విశ్వము తనంతట తానావిర్భవించి, వృద్ధిగాంచి, నశించుచున్న దనియు, పరమునకై యత్నములొనర్చుట వ్యర్థమనియు, వేదాధ్యయన, పుణ్య తీర్థ గమన, దేవతారాధన, ధర్మ వ్రతాదులన్నియు నిష్ఫలములనియు, లోకమున పాషండ మతములు చెలరేగుచున్నవి. అందులకై నే నిప్పుడీ పృథ్వికి రావలసి వచ్చినది. నేను నూటయిరువది సంవత్సరము లీ భూమిపైనుండి, లోకము నంతయు బాగుచేసి, జీవేశ్వర తత్త్వమును వ్యక్తమొనర్చి మరల నా అవతార పరిసమాప్తికాలమున నిచ్చటికేతెంచెదను. అంతదనుక మీరీ భూమియందడంగి యుండుడు. అపుడు మీకు మోక్షమొసంగ గలవాడ'' నని ఆనతిచ్చి, భూతముల స్తంభింపజేసి, స్పృహదప్పి పడియున్న తల్లిని లేపి, పసిబిడ్డడై పరుండియుండెను.

ఇది యంతయు ఆ కాంతిమతీదేవి కొక స్వప్నముగా గోచరించు చుండెను. ఆమె మెల్లన కన్నులువిప్పి నలుదెసలు పరికించెను. భూతములు గోచ రింపవయ్యె. పిల్లవాడేడ్చుచుండెను. ఆమె శరీరమున నుత్సాహరేఖ పొడసూపెను. అనిర్వచనీయానందమామె మనస్సున పొటమరించెను. అపుడామె లేచి, పసి కందు నెత్తుకొని నిర్జనమైన పురంబుజేరి, స్వగృహంబందు జొచ్చి, పిల్లవానికి వేడినీటి స్నానముచేయించి, తానును మజ్జనంబాడి, పిల్లవాని నుయ్యెలతొట్టిలో పరుండబెట్టి జోలపాడుచుండెను.

కేశవసూరి, ఆరీతిగా భార్యను వదలి దుఃఖించుచు, సమీప గ్రామమున కేగి, జరిగిన యుదంతంబంతయు, స్వజనులకు విశదీకరింప, వారంబును అనేక

విధముల పరితపించిరి. ప్రభాతంబైన కేశవయజ్వ తిరిగి స్వగ్రామంబునకు పోయి తనయింట ప్రవేశించెను. వాకిలి తెఱచియుండెను. లోపల జోలపాట విన్పించుచుండెను. ఆశ్చర్యముచే తబ్బిబ్బునందుచు, లోన ప్రవేశింప భార్య యెదురువచ్చి పాదములకు ప్రణమిల్లెను.

ఇది యంతయు నాతనికేదియో ఇంద్రజాలమువలె నుండెను. భార్యతో భాషించుటకుగాని, యిదియెట్లు జరిగెనని విచారించుటకుగాని తోచక స్తంభీకృతుడాయెను. అట్టియెడ ఆమె భర్తను జూచి "స్వామీ! మీరేల యిట్లు వింతగా చూచెదరు? మన కుదయించిన నందనుడు శేషశయానుడో, శేషుడో, శేషాశనుడు గరుడుడో, లేక నిత్యసూరులందొక్కరుండో యగునుగాని, సామాన్య ప్రాకృత మానవుండు మాత్రముకాడు" అని జరిగిన కథయంతయు చెప్పగావిని, ఆనంద తరంగములలో తేలియాడుచు కేశవయజ్వ అపర్యాప్తామృత దేవుండగు నారాయణుని మనమ్మున ధ్యానించి, "ప్రాణేశ్వరీ! మనము ధన్యులము. జగమున మనవంటివారు మరొక్కరు లేరని చెప్పనొప్పు. మన నామములు, సువర్ణాక్షరములతో లోకమ్మున శాశ్వతముగా నిలిచియుండును." అనిపల్కి దివ్యవిభ్రాజమానుండగు ఆత్మజుం గాంచి ముదమ్మున చొక్కుచుండెను.

ఆ నగరవాసు లీవృత్తాంతం బాకర్ణించినవారై, తండోపతండంబులుగా తద్గృహమ్మున కరుగుదెంచి, సర్వలక్షణలక్షితుండైన ఆ అర్భకుని కన్గొని తేజోవిశేషమ్ముల కచ్చెరువందుచు "ఈ బాలకుండు భూతమ్ముల త్రొక్కనాడనుటకు సందియములేదు. ఈ తండు సర్వేశ్వరాంశచే సంభవించినవాడు. కానిచో, ఈ కాంతాలలామంబు సుఖంబుననుండుట యెట్లుకలుగు?" అని ప్రమోదించుచు ఆనాటినుండియు ఉపద్రవరహితులై నిర్భయులై రాత్రులందుగూడ ఆ గ్రామముననే వసించుచు, సుఖించుచుండిరి. మహాపురుషుల ఆవిర్భావమేకదా జగత్కల్యాణ సంధాయకము. ఇట్లు చైత్రమాసమ్మున శుక్లపక్షమ్మున, ఆర్ద్రానక్షత్రయుక్త గురువాసరమ్మున కాంతిమతి కేశవయజ్వల పున్నెములపంటయై శేషుండు భూమియందవతిరించెను. అతండు జగత్తున అవతరించిన దినమున ఆ గ్రామవాసులు అత్యంతోత్సాహయుక్తులై ఉత్సవంబును నెరపిరి. అదియే ఆర్ద్రోత్సవమని ప్రసిద్ధికెక్కెను. ఈ వృత్తాంతము తెలిసి, తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామివారికి తీర్థకైంకర్య మొనరించుచున్న కాంతిమతీదేవి యన్నగారగు శ్రీశైల పూర్ణులు

భూతపురికరుగుదెంచి. మేనల్లునిం జూచి, సంతసించి, పదురెండవ దినమున సుదర్శన పాంచజన్యంబు లస్పృశింపజేసి, బాలకునకు లక్ష్మణాచార్యులను నామకరణంబొనరించి, దీవనలందియనుజ్ఞగైకొని మరలి తిరుమల కరిగెను.

కొంతకాలమునకు, కేశవసూరి కుమారునకు, చౌలోపనయనాది కృత్యంబులాచరించి, వేదములు బోధించుట కారంభించెను. ఏకసంధాగ్రాహియగు నా బాలకుడు, వేదము నొక్కపరి విన్నంతనే తిరిగి చెప్పుచుండెను. అట్లే వేదంబులన్నింటిని. అచిరకాలమున అభ్యసించెను. వేయిమోముల వేయి వ్యాకిరణంబులొక్కసారి వచించు అనంతున కిదియొక లెక్కలోనిది కాదుకదా! సకల వేద పారగుండగు నా చిరుతండు షట్శాస్త్రములను తండ్రీ ముఖముననే అభ్యస్తము కావించెను.

విద్యాభ్యాసానంతరము, యుక్తవయస్కున, మంచి వంశమున సుద్భవించిన, తంజమ్మయను కన్నియను, తండ్రి యనుమతితో లక్ష్మణుండు పెండ్లియాడెను. ఇట్లు కొంతకాలము కేశవసూరి, భార్యయు, కొడుకును, కోడలును తన్ను సేవింప నీలోకమ్మున అనురూప సుఖంబులనుభవించి, మేలునాడలంకరించెను. లక్ష్మణుడు తండ్రి వియోగమునకు అత్యంత చింతాక్రాంతుడైనను, యథాశాస్త్రముగా, ఊర్ధ్వదైహిక క్రియలన్నియు నిర్వహించి, భార్యతోడను, తల్లితోడను కొంతకాలను భూతపురియందే నివసించియుండెను.

ఇట్లు కొంతకాలము చనిన తరువాత, లక్ష్మణుండు అద్వైతభాష్యము నభ్యసింపవలయునని యెంచి, కాంచీపురమునందు సర్వశాస్త్ర విశారదుండగు యాదవ ప్రకాశుండనెడు పండిత ప్రకాండు డుండెనని విని, సకుటుంబముగా కాంచీనగరమ్మున కరిగి, వరదరాజ స్వామివారిని దర్శించి, తదాజ్ఞచే నచ్చటనే వసించుచు, యాదవ ప్రకాశునియొద్ద అద్వైత విశేషములు పఠింప దొడగెను. యాదవుండును, లక్ష్మణసూరి బుద్ధి వైశారద్య తేజోవిశేషముల కబ్బురంబంది "ఈతండు భగవదంశసంపన్నుండు. కేవలమనంతుడేయిట్టి రూపమున పుట్టియుండ నోపు" నని భావించి, భాష్యాదుల నమితశ్రద్ధతో బోధించుచుండెను.

ఇట్లుండ, నొకానొక సమయమ్మున, ఆదేశమును పరిపాలించు, రాజుయొక్క కుమార్తెను, ఒక బ్రహ్మరక్షస్సు ఆవేశించి బాధించుచుండెను. ఆరాజు,

ఆ భూతమును వదలించుటకై మంత్ర తంత్ర వేత్తల ననేకుల పిలిపించి చూచెను. కాని ఫలితము శూన్యమాయెను. యాదవ ప్రకాశుఁడు గొప్పమంత్ర విదుఁడనితలంచి, ఆతనిని రప్పించెను. ఆతండు శిష్యసమేతుండై రాజభవనముం బ్రవేశించి, రాజపుత్రింగాంచి, సమీపమునకుం బిలిపించి, భూతమంత్రంబుల నెన్నింటినో పఠించుచుండెను.

అపుడా రాజకుమారి నాశ్రయించియున్న భూత మా యాదవప్రకాశుని వీక్షించి, "ఓయీ! యాదవా! నీ మంత్ర తంత్రములు నాయొద్ద పనిచేయునని యెంచితివేమి! నీకు వచ్చిన మంత్రములకన్న వేయిమడుంగులు మంత్రములు నాకెక్కువ వచ్చును. అబద్ధమని తలంతవేమో" అని పండ్లు పటపట కొరకుచు. ఉచ్చైస్స్వరంబున, ఆ మంత్రములను పఠింప ప్రారంభించి, యాదవుని సమీపించి "పిచ్చిబాపడా! నీ విషయమే నీకు తెలియదు. అట్టివాడవు నన్నెట్లు వదలింపగలవు? నీ పూర్వజన్మ విశేషంబు నుగ్గడింతు వినుము.

కాంచీపురమ్మున కనతిదూరమ్మున, మధురాంతకమను గ్రామంబొండు కలదు. దాని కనతిదూరంబున నొక పద్మాకరం బొప్పు, దాని కీశాన్యభాగంబునందొక పెద్ద పుట్టకలదు. ఆ వల్మీకమునందు నీ వొక ఉడుమువై యుంటి. ఆ సమయమున, నొకా నొక వైష్ణవోత్తముడు దేశాటనంబు కావించుచు, ఆ కొలను దరిగల చెట్టుక్రింద వంటచేసికొని, సర్వేశ్వరార్పణ మొనర్చి భోజనముచేసి. ఉచ్ఛిష్టమును పుట్టదరి పారవైచి, యథేచ్ఛం జనియెను. నీవా భాగవత వల్లభుని ఉచ్ఛిష్టము నారగించితివి. ఆ కారణంబున ఈ జన్మంబున నీవు విప్రుండవైతివి.

ఇక నా జన్మ ప్రకారంబు విస్తరించెద. నాలకింపుము. పూర్వజన్మంబున నేనొక భూసురుండను. భార్యాసహితుడనై యజ్ఞము చేయుచుంటిని, విధివశమ్మున ఆ క్రతువున కంతరాయము ఘటిల్లెను. ఆ కారణమున నేను బ్రహ్మరాక్షసుండనైతి. నేను గత జన్మంబున విప్రుండనైన కతమున నాకు రాని మంత్రములేదు నన్ను నీవు వదలింపజాలవు. నీకొక ఉపాయము వచించెద. నీ యొద్ద విద్యాభ్యాస మొనర్చుచున్నవాడును, సర్వలక్షణ సంపన్నుండును, కరుణామయుండును నగు లక్ష్మణదేశికుండు వచ్చి తన శ్రీపాద తీర్థమిచ్చి వారిపాదముల నాశిరమున నుంచినచో నేను వెడలిపోయెదను" అని పలికెను.

యాదవ ప్రకాశులా వాక్యంబు లాలకించి లజ్జించి, శిరము వాంచి మిన్నకుండెను. భూపాలుడా పిశాచి వాక్యంబులు విన్నవాడు కావున లక్ష్మణసూరి పదమ్ములకుం బ్రణమిల్లి "స్వామీ! మీరు మీ పాదపవిత్ర తీర్థము నొసంగినచో భూతము వెడలి పోయెదననుచున్నది. కాన అట్లు కావింపు"డని విన్నవించెను.

అపుడా దేశికేంద్రుండు గురువుగారికి నమస్కరించి, ముఖనిర్దేశ మాత్రానుజ్ఞాతుండై రాకుమారిని సమీపించి తీర్థమిప్పించి, స్వీయపాదము లామె శిరమున నుంచగా, ఆ రాజపుత్రిని పట్టిన భూత మామెను విడిచి, తన రాక్షసత్వ మును గడచి, దివ్యవిమానము నధిష్ఠించి, లక్ష్మణదేశికు సన్నుతించుచు స్వర్లోక గమనుండై వెడలిపోయెను. యాదవ ప్రకాశులును, తనచేతగాని పని తనశిష్యునిచే నైనదని బాధనందుచు, కలుషీభూతచేతస్కుండై సశిష్యుండై తిరిగి కాంచీపుర మ్మున కరుగుదెంచెను.

ఒకానొక దినమున లక్ష్మణసూరి గురుసన్నిధానమున కేతెంచి, "స్వామీ! "సత్యమ్ జ్ఞానమనంతం బ్రహ్మ"అను శ్రుతికర్థము సెలవిండు" అని అడిగెను. అందులకు గురుండు సర్వేశ్వరునకు నిర్గుణత్వమును ప్రతిపాదించుచు, నద్వైతపరముగా అర్థమును విపులీకరించెను. అదివిని లక్ష్మణుండు "ఆర్యా! మీరు వచించినది సరియగు భావముకాదు. ఆ శ్రుతివాక్యము సర్వేశ్వరుండు సత్య జ్ఞానాది సమస్త కల్యాణగుణ పరిపూర్ణుండని వచించుచుండ, మీరిట్లు చెప్పుట యన్యాయ"మనెను. అపుడా ఏకదండియగు యాదవ ప్రకాశులు, హుంకరించి "వేదార్థము నీకే తెలిసినచో నన్నుగునేల? నీవు నాకు బోధించుచుంటివో, నేను నీకు తెల్పుచుంటినో నాకింత వఱకు అవగతము కాకయున్నది. నీ యుపన్యాస మింతట కట్టిపెట్టుము" అని దిట్టతనమున పలికి యూరకుండెను.

అట్టి సమయమున మళల మంగళ గ్రామనివాసియు లక్ష్మణుని పినతల్లి కొమరుండగు గోవిందభట్టరు, అన్నయగు లక్ష్మణసూరి యాదవ ప్రకాశు నొద్ద విద్య నభ్యసించు చున్నాడనివిని, తానును కాంచీపురమ్మునకు వచ్చి పెదతల్లిని, రామానుజులను నమస్కరించి, వారి ఆదరాభిమానమ్ములనంది తానును, యాదవ ప్రకాశునియొద్ద విద్యాభ్యాస మొనరించుచుండెను. యాదవుడు రామానుజా

నకు విద్యను బోధించుచున్నను మత వైరమును వహించి ద్వేషమును పూని యుండెను.

ఒక దినమున యాదవుండు తనకు విశ్వాసపాత్రులగు కొందరు ముఖ్య శిష్యులను రావించి, రహస్యముగా సమావేశపఱచి ''బాలకులారా! మీతో పాటు చదువుచున్న లక్ష్మణుడు మనకు వ్యతిరేకి, వాని మతము విశిష్టాద్వైతము. మన మద్వైతులము. వీడు జీవించి యుండెనా, మన మతము బూడిదపాలగును. నేను చెప్పుచున్న వేదార్థంబులకు దురర్థములు ప్రతిపాదించు చున్నవాడు: నా యంతటి పండితుడీ భూమండలంబున అన్యుండు లేడని జనులు విశ్వసించి యున్నారు. నాయంతటి వాడను నేనేయని నేనును, విశ్వసించుచుంటిని. కాని నా వాక్యంబుల నన్నింటిని, ఈతండు పూర్వపక్షము సేయుచున్నాడు. వాడు చెప్పు నది పూర్వపక్ష మొనర్చుటకు నాకెందులకో సాధ్యము కాకయున్నది. ఈ తడు బుద్ధియందు బృహస్పతి. వాక్యధాటి ఫణిరాజు. మన యొద్ద చదువుచునే మన భాష్యమును పూర్వపక్షము సేయుచున్నాడు ఇక ముందు వీనిముందు అద్వైతము నామమాత్రా వశిష్టము కాగలదు. అదియుగాక, మొన్న బ్రహ్మరక్షస్సు నన్ను తృణీకరించి, నా శిష్యుని మిన్నచేసినది. అట్టిచో నాకెట్టు లుండునో, మీరే యోజింపుడు. ఇక ఎట్లైనను, ఆతనిని భూమిపై నుండనీయరాదు. దాని కొక చక్కని యుపాయ మాలోచించితిని. మాఘస్నానము ప్రయాగయందు చేసిన, మహాఫల ప్రదమని శాస్త్రములు ఘోషించుచున్నవి. అందువలన మేమందఱము బయలుదేరి లోకపావని యగు గంగాభవానియందు క్రుంకులిడి తిరిగివత్తుమని నిశ్చయించి, గంగా యాత్రసేయ సంకల్పించితిమి. నీవుకూడ మాతోవత్తువేని మార్గమధ్యంబున పాఠములభ్యసింప వచ్చును. లేదా వచ్చిన విద్యయంతయు మఱపునకు వచ్చును. అని నమ్మిక పుట్టపలికి లక్ష్మణసూరిని తోడుకొనిరండు, గంగాస్నాన సమయమున నాతనినందే ముంచి చంపవచ్చును. అందువలన బ్రహ్మహత్యాపాతకము మనలనంటనేరదు. వానికి స్వర్లోక ప్రాప్తి. మనకు విరోధి నిరసన మహానందసంతృప్తి. ఈ పథకమెట్లున్నదో చెప్పుడు.'' అని పలికెను.

అపుడు వారు గురువును వీక్షించి ''ఓ గురుచంద్రమా! మీరాలోచించి నది కడుగడులెస్స అట్లే చేయుదము. లోకనిందయు మనకురాదు. శుభలగ్నము నిర్ణయింపుడు. బయలుదేరుదము'' అని గురు వాక్యంబులు బలపఱచిరి.

అంత నా శిష్యులందరేకమై లక్ష్మణుని గురు సమ్ముఖమునకు ఆహ్వానించి, ఆతనితో "ఓయీ! మాఘమాసమున త్రివేణీసంగమస్నాన పలమత్యధికమని పెద్దలు వక్కాణించు చున్నారు. అందులకై మే మందఱము గంగాయాత్ర సలుప సంకల్పించి, గురువుగారి నర్థింప వారును మనతో వచ్చుటకు దయతో నంగీకరించిరి. మరలి యిరవుల కరుగుదెంచుటకు వత్సరము పట్టునో, లేక రెండు వత్సరములు పట్టునో? నీవును మాతో వత్తువేని మార్గమధ్యమున నిరాతంకముగా మన పాఠముల నభ్యసింపవచ్చును, గురువుగారికి నీ యందభిమానము మెండు. మేమందఱ మొకయెత్తు, నీ వొక్కడ వొక్కయెత్తు నిన్ను విడిచి వెళ్ళ నేరక యున్నారము. కావున నీవును మాతోడరమ్మ" అని పలికిరి.

అది యంతయు విశ్వమని యెంచి, లక్ష్మణసూరి వరదరాజస్వామికి ప్రణమిల్లి తల్లి ఆశీస్సులనంది, భార్యతో చెప్పి గురువువెంట గంగాస్నానమునకు బయలుదేరెను. ఇట్లు యాదవ ప్రకాశుడు శిష్యసమేతుడై బయలుదేరి, అహోరాత్రములు నడచుచు, గంగాయాత్ర కొనసాగించు చుండెను. కొంతకాలము నడచి వింధ్యమును సమీపించి వింధ్యారణ్య మధ్యమ్మున నడచుచుండిరి యాదవుండా అటవీ మధ్యంబున లక్ష్మణవధోపాయంబుల వెదకుచుండెను. శిష్యులును గురునితో గుజగజలువోజొచ్చిరి. గోవిందభట్టరు, ఏమియు నెఱుంగని యనాయకుని చందమ్మున వర్తించుచు, గురువు దుస్తంత్రమ్మును, శిష్యుల దురాలోచనమును పసిగట్టినవాడై, రహస్యముగా లక్ష్మణసూరితో నిట్టులనియెను.

"అన్నా! నీవు చాల పొరబడితివి. గురుని దుర్బుద్ధి నీ కవగతము కాలేదు. యాదవుండును, తచ్ఛిష్య వర్గమును, నిన్ను ప్రయాగయందుగాని, మార్గమధ్యమ్మునగాని మడియింప సమకట్టియున్నారు. ఈ యాత్ర నిన్ను చంపుటకుద్దేశింపబడినదేకాని వేరుకాదు. నేను వారి దుస్తంత్రమునంతయు పసిగట్టితిని. ఇప్పటి కేమియు మించిపోలేదు. ఈ యరణ్యమధ్యమున నెవ్వరికిని కానరాకుండ తప్పుకొనుము. లేనిచో కార్యము తప్పును. నాకు తెలిసినట్లు గాని, నీకు నేను చెప్పినట్లుగాని తెలియరాదు. తెలిసినచో నన్నైనను బాధింతురు." దైవమేవ శరణమ్". అశరణ్య శరణ్యుండగు వరదుని కీర్తించుచు తొలగుము. నేను వారితోపాటు పోవుచున్నాను" అని చెప్పి కదలిపోయెను

లక్ష్మణసూరి అవ్వాక్యములు విని, భయకంపిత చిత్తుడై, చెట్టు పుట్టల చాటున తప్పుకొనుచు, మహారణ్యమ్మున బడెను. యాదవ ప్రకాశుఁడును, శిష్యులును, లక్ష్మణునిం గానక అరణ్యమందెల్లడల చెట్టు చెట్టు, గుట్ట గుట్ట, పుట్ట పుట్ట, పొద పొద లన్నియు గాలించిరి. లక్ష్మణుని యునికి యెందును గోచరింప దయ్యెను.

చివఱకు వారందరును గుమిగూడి, గోవిందభట్టరు నుద్దేశించి "మీ యన్న లక్ష్మణుం డేమయ్యెను? ఈవన మధ్యమ్మున నెచ్చట తప్పుకొనియెనో తెలియదు. మేమీ విపినమంతయు వెదకి వేసారితిమి. కాని యాత డెందును కన్పింపలేదు. నీ వేమైన అతనిం జూచితివా?" యని ప్రశ్నించిరి.

అందుల కాత డేమియు నెఱుంగని మాడ్కి నటించుచు, మొగంబున విన్నదనంబు దెచ్చుకొని, "అయ్యో! అతడు మీకు వెనుకనో ముందో నడచుచు, మీతో కలిసి వచ్చుచున్నాడని తలంచితిని. ఈ భీకరారణ్యమున నెట్లు తప్పుకొనియెనో, ఏమిచేయగలడు? ఈ గహనంబు నిర్జనంబు. ప్రొద్దుగ్రుంకుచున్నది. అంధకారము క్రమ్ముచున్నది. క్రూరమృగములు ఘూర్ణిల్లుచున్నవి ఇట్లు అరణ్యమున ఏకాకియై యెట్లు జీవింపగలడు? కాంచీపురమునకు మరలిపోవు మార్గము తెలియదు. దైవ వైపరీత్యం బిట్లుండ మనమేమి చేయగలము?" అని దుఃఖంబు నభినయించుచు వారి ననుసరించెను. గురు శిష్యులు పైకి విచారము వ్యక్తమొన ర్చును, లోలోన "మనము చేయుదలంచిన పని భగవంతుడే చేసినాడు. కాగల కార్యము గంధర్వులే తీర్చిరి" వీడీ యరణ్యమునుండి కంచికి చేరగలడా? ఎచ్చటి వింధ్యాటవి? ఎచ్చటి కాంజీపురి? ఏకాకియై యీ వనమునందీతడే క్రూర మృగమునకో ఆహారమై యుండును. మన మనః పీడతెగిపోయినది" అని సంత సించుచు, గంగా తీర్థావగాహన తత్పరులై పోవుచు దిరి.

లక్ష్మణసూరియు మార్గమును వీడినవాడై భీకారణ్యమునబడి కొంత దవ్వరుగు సరికి, సూర్యుడస్తంగతుడాయెను. అంధకారము వ్యాపించి, దిక్కులు గోచరింపకుండెను. అన్ని వైపులనుండి క్రూరమృగ ధ్వనులు వీతెంచుచుండెను, భయంకరముగ ఝిల్లికారవం బేతెంచుచుండెను. అట్టి భీషణారణ్యమున తోడు లేనివాడై "నాకిప్పుడేది దిక్కు? కాంచీపురమ్మునకేవిధిపోవుదు? ఇచ్చటి కాయూరే దిక్కునను న్నదో యెఱుంగను. ఈ వనమధ్యమున ఈరే యెట్లు పుచ్చు

వాడ ? సమీపమున నొక్క గ్రామ మైనను, జనపద, మైనను, ఉన్నటులలేదే ? నడచిన నెంతటి దవ్వరుగ నడచెదనన్న భూమికంటక శిలావృతంబయి యున్నది. నడచిన నెంతటి దవ్వరుగ గలను ?'' అని మనః క్లేశముననుభవించుచు, నిరుపాధిక బంధుండును, భక్త పరాధీనుండును, దయాశరధియునగు వరదుని, మదియందు ధ్యానించుచు, నొక వృక్షమూలమ్మున ఆసీనుండయ్యెను.

అట్టి సమయమున పీతాంబరధారియు, బద్ధ గోధాంగుళీ త్రాణుండు, భయంకర ధనుర్ధరుండునగు నొక్క వృద్ధవ్యాధుండు వృద్ధయగు భార్యతోగూడి, రామానుజుడున్న వృక్షమూలమ్ముచేరి, అతనితో నిట్లనియెను. ''బాలకా ! నీదే యూరు ? పేరేమి ? జన్మించిన కులంబెద్ది ? తలిదండ్రు లెవరు ? ఈ ఘోరకానన మున, నొంటరిగా నిట్టి యర్ధరాత్రమ్మున నేల సంచరించు చుంటివి ? నీవాలకము చూడ, ఏదియో కార్యార్థివై వచ్చి త్రోవదప్పి యొంటిమై యిచట చిక్కితివని తలంతును, నీ గమ్యస్థాన మెద్ది ? మాది కాంజీనగరము. మేము కిరాతులము. ఈమె నా భార్య. ఈ యరణ్యములన్నియు మాకు కొట్టినపిండి. ఎప్పుడును, ఈ అటవీ ప్రాంతమ్ములనే సంచరించు చుందుము. పూర్వమొకప్పుడు పదునాల్గు వత్సరమ్ము లీయడవియందే యుంటిమి. వృద్ధుడనైన కతమున నిప్పుడు కాంచీ నగరమున నివాసమేర్పరచు కొంటిని. కంచిని వదలి కొలదికాలమైనది. మరల నిప్పుడు కాంచీనగరమునకు పోవుచున్నారము.

ఆ మాటలు విని లక్ష్మణసూరి మహానందంబంది, ''ఈ ఆపత్కాల మున ఈ వ్యాధ దంపతులను జూపితివా ప్రభూ ! కరుణామయుండవైన నీకే యిట్టి కార్యంబులుచెల్లు. నీ విలాసముల నెట్లు నిర్ణయింపనగును'' అని సర్వేశ్వరుని కొనియాడి వృద్ధునితో నిట్లనియె.

''అయ్యా ! నాది కాంచీనగరము. నే నొక కారణమున నిచ్చటి కరు దెంచి త్రోవతెలియక చిక్కుపడితిని. నాతోపాటు వచ్చినవారెల్లను వెడలిపోయిరి. నాకు త్రోవతెలియని కారణమున నిచ్చట కూర్చుండి యుండితిని. నన్ను లక్ష్మణ సూరి యందురు. విప్రకుల సంజాతుండ. కేశవయజ్వ నా తండ్రి. కాంతిమతీ దేవి నాతల్లి. మీతోడ నేనును కాంచీనగరమునకు వత్తును.'' అని చెప్పి వారితో కలిసి పయనమునకు సంసిద్ధు డాయెను.

అప్పుడా కిరాత దంపతులు హర్షించి "వత్సా ! అట్లే పోవుదము. మంచి సహవాసము మాకును లభించినదని తలంతుము. కాంచీపురమునకు దగ్గఱి దారు లనేకములు నాకు తెలియును. ఈ కాన నాకు చిరపరిచితము. నీకేమియు భయములేదు. మా వెంటరమ్ము. ఈ సమీపమున నొక మఱ్ఱిచెట్టున్నది. అది విశ్రమించుట కన్నివిధముల తగినది." అని లక్ష్మణుని వెంటనిడుకొని, వృక్షమును సమీపించి, "బాలకా ! ఈవేళ నీకేమియు నాహారములేక కడు డస్సినట్లు కన్పించు చుంటివి. విశ్రమింపుము. మేము వృద్ధులమగుటచే మాకు నిద్ర చాల తక్కువ. మా యిద్దఱి మధ్య శయనింపుము. మృగములు, నా ధనుర్జ్యావల్లీరావము విన్నంతనే భీతిల్లి పారిపోవును." అని పలికి ఆతనిమధ్య నిడుకొని, ఆ కిరాత దంపతులు శయనించిరి.

ఆ వృద్ధవ్యాధు డేవేవియో, ఆరణ్యకములగు విషయములు అభివర్ణించి చెప్పుచుండ, ఆకర్ణించుచు, కొంతవడికి లక్ష్మణసూరి నిద్రించెను. తెల్లవార వచ్చుచుండెను. అట్టివేళ బరవనిత భర్తను జూచి, "ఏమయ్యా ! నాకు చాలదాహమగుచున్నది. సందెజాముననే నీరమడిగితిని కదా ! ఈ అర్ధరాత్రముననెట్లు ? తెల్లవారుఝామున తెచ్చియిచ్చెదనంటివి. నాలుక పిడుచ గట్టుచున్నది. మంచి నీరు కొనిరమ్ము" అని అడిగెను.

అందులకా వ్యాధుడు ఆమెనుజూచి "ముసలి దానా ! నాకు గూడ దాహమగుచున్నది. ఇంక కొలదిగా తెల్లవారనిమ్ము. వృద్ధుడనగుట దారి కన్పించుటలేదు." అని బదులు చెప్పెను.

అట్టి సమయమున లక్ష్మణసూరి వరదుని ధ్యానించుచు లేచి ఆ వ్యాధ దంపతుల సంవాద మాలించి" దాహబాధచే మీరిట్లు మసలనేల ? మంచినీర మెచ్చటనున్నదో చెప్పుడు. నేను పోయి తీసికొనివచ్చెద. పాత్రయేమైన నున్నచో నిండు" అని పలికెను.

అంత నాకిరాతుడు "అయ్యా ! ఇదిగో సమీపమున నొండు బావి కలదు. జనులు తండోప తండములుగా వచ్చి నీరు తీసికొనిపోవుచున్నారు.

చూడుము.'' అని ఒక స్వారకాయబుల్లి నొసంగెను. అంతట ఆ శేషమూర్తియు లేచి బావికడకు పోయి చూచెను. ఆ ప్రదేశమంతయు తనకు నిత్యపరిచితముగా గోచరించు చుండెను. మనుజులు గుంపులు గుంపులుగా నడయాడు చుండిరి. దేవస్థానములు కన్పించుచుండెను. ఇది యంతయు నాతని కొంకవింతగా దోచుచుండ నచ్చట నున్నవారిం జూచి, ''అయ్యలారా! ఇది యే దేశము? ఈ పట్టణ నామ మెయ్యది? ఈ దేవళమందున్న స్వామి యెవ్వరు?'' అని పృచ్ఛ చేసెను.

ఆ మాటలకు వారు మందహాసమొనర్చుచు, ''ఈ యూరిపేరు కూడ నీకు తెలియదా? ఇది కాంచీనగరము. అది వరదరాజ స్వామివారి గోపురము. నీ వెచ్చటనుండి వచ్చుచుంటివి?'' అని పల్కరించిరి. అంత లక్ష్మణసూరి ఆశ్చర్యానంద నిమగ్నుండై వెనుకకు తిరిగిచూచెను. వ్యాధ దంపతులుగాని, వింధ్యాటవిగాని గోచరింపవయ్యె. రాజ వీధులు కన్పింప దొడగెను. అప్పుడా యనంతుడు ''ఎచ్చటి కాంచీనగరము? ఎక్కడి వింధ్యాటవి? ఎచ్చటిబోయ దంపతులు? ఏమి యీ యాశ్చర్యము? వరదరాజస్వామివారును, శ్రీదేవియు నన్ను రక్షించుటకు కిరాతదంపతులై వచ్చియుండనోపు. ఓ దయామయా! నా కొఱకెంత క్లేశము ననుభవించితివి? జగన్మాతయు ఈ కటికరానేలపై పవ్వళించి యెంతవంతనందెనో? నీదయ యింతయని వర్ణింప పరిమితిలేదుకదా! మిమ్ము సామాన్యమగు బోయదంపతులుగా తలంచితినేకాని, శ్రీ శ్రియః పతులని తలంపనైతి. నీ మాయ నెఱుంగ నే నెంతటి వాడను? బ్రహ్మదిదేవతలకే నీ మాయ నెఱుంగ శక్యము కాదుకదా! బ్రహ్మండముల మార్చు నీకు నన్ను వింధ్యాద్రి నుండి కరిగిరికి తెచ్చుటయొక లెక్కలోనిదికాదు. నీటిమీద రాలు తేలించిన మేటి కసాధ్యము లుండునా?'' అని దైవమాయ కబ్బురంబందుచు గృహంబున కేతెంచి, జరిగిన వృత్తాంత మంతయు తల్లికి నివేదింపగా ఆమె ఆశ్చర్య హర్ష ప్రపుల్ల వదనయై కుమారునింజూచి ''తండ్రీ! నీకు లభించిన విద్య చాలును. ఇక నీవు యాదవుని యొద్దకు పోవలదు. దైవానుగ్రహమున జీవించి వచ్చితి వంతియే చాలును'' అని ప్రేమమీర పుత్రుని కౌగిలించుకొనియెను.

ఈ వార్త కర్ణాకర్ణికగా ఆదేశవాసు లందఱకు తెలిసెను. కొందఱు లక్ష్మణుని యింటికి పెళ్ళి యాతనిని పరామర్శించి, జరిగిన కథయంతయు నాయన ముఖముననే విని ''ఔరా! యాదవు డెంతటి దుశ్చేష్టితమునకు పాల్పడెను.

మహాపురుషుడగు ఈ రామానుజుని వింధ్యారణ్యమున విడిచిపోగా సర్వేశ్వరుడు వ్యాధరూపియై రక్షించెనట. 'నహికల్యాణకృత్ కశ్చిత్ దుర్గతిమ్ తాతగచ్ఛతి' మంచి చేసినవాడు ఎవడును దుర్గతిని పొందడు. అను భగవద్వాక్యమున కన్య థాత్వము సిద్ధించునా? భగవంతుడు భక్తపరాధీనుండుకాడా? భక్తుల నెల్లప్పుడు వెన్నంటి రక్షించుచుండడా? కుల మత ద్వేషము లెంతటి ఘోరకృత్యములకు దారితీయుచున్నవి?" అని యాదవుని దుర్బుద్ధిని రామానుజుని మాహాత్మ్యమును చెప్పుకొనుచు తమ తమ త్రోవలంబోయిరి.

అంత నొకనాడు కాంతిమతీదేవి కుమారుని కన్గొని "నాయనా! ఈ గ్రామమున తుర్యకుల సంభవుండును, భగవత్సాక్షాత్కారము కలవాడును, కాంచీపూర్ణనామధేయుండునగు మహాపురుషుం డొకండుకలడు. నీవతని యొద్దకు పోయి జరిగిన కథయంతయు నాతనికి విన్నవించి, ఆతని ఆజ్ఞానుసారము నడచు కొమ్ము" అని ఆదేశించెను.

అంత రామానుజుడు తల్లి వాక్యంబుల కలరి తిరుక్కచ్చినంబి (కాంచీపూర్ణులు) గారి మఠమునకేగి, ఆయన పాదపద్మములకు కైమోడ్పుగావింప, ఆతండు లక్ష్మణసూరిని లేవదీసి, బిగియార కౌగిలించుకొని, అర్ఘ్యపాద్యాది విధుల పూజించి, ఆసనమున కూర్చుండ నియోగించి, కుశలమడిగి "స్వామీ! ఏమిపని మీద వచ్చితివోచెప్పు" మనియెను. లక్ష్మణుండు తనకు వింధ్యారణ్యమ్మున జరిగిన కథయంతయు వివరించి, "గురువర్యా! నాకు విద్యాపూర్తి యైనది. ఇప్పు డేదియైన భగవత్కైంకర్యము చేయవలయునని యున్నది. మీ యాజ్ఞానుసారము ప్రవర్తింప వలసినదని మా మాతాజ్ఞ. భగవత్కైంకర్య మేదైన చేయవలసినదని నన్నాజ్ఞాపింపుడు" అని విన్నవించుకొనెను. అంత నా కాంచీపూర్ణదేశికుండు లక్ష్మణునిం జూచి "వత్సా! నీ కొకరి యాజ్ఞ పాటింపవలసిన అవసరములేదు. వరదుడే ఆదేశించినాడు. ఏమందువా, వన మధ్యమ్మున వ్యాధరూపియై నీరమునుకొని రమ్మనియె కదా! నీచేత కొనిరాబడిన తీర్థమును గ్రహింపవలయునని భగవదిచ్ఛ. ఈ గ్రామమున 'శాలక్కిణరు' అను బావికలదు. నీవు ప్రతి నిత్యము ఉషః కాలము, ఆకూపోదకమును కొనివచ్చి ఆ నాగాద్రి వాసునకు సమర్పింపుము." అని ఆదేశించెను.

లక్ష్మణుండు వల్లెయని నంబిగారికి నమస్కరించి సెలవుగైకొని, యింటికివచ్చి తల్లితో ఆ వృత్తాంతమంతయు చెప్పి ప్రతి దినమును శాలకూప తీర్థమును కరిగిరినిలయున కర్పించుచుండెను.

ఇది యిట్లుండ యాదవ ప్రకాశుడు ప్రయాగకుపోయి, అందున శిష్యుడై స్నానమొనరించుచుండ, గోవింద భట్టరు చేతిలోనికి లింగరూపముగల, శ్వేతశిల యొండువచ్చెను. దానిని గురువునకు చూపింపగా నాతడు "గోవిందా! నీ భక్తికి మెచ్చి పరమశివుడు నీకు ప్రసన్నుడాయెను. దీనిని నీవు పూజించు కొంటివా, కృతార్థుడవగుదు" వని చెప్పెను.

ఆ మాటలు విని గోవిందభట్టరు శైవమతావలంబియై శరీరమునం దంతయు భస్మము నలంది, మెడలో రుద్రాక్షలు ధరించి, గంగాయాత్ర పూర్తి చేసి, యాదవునితోపాటు తిరిగివచ్చి, దొరకిన లింగమును, తన స్వగ్రామమగు మళలమంగళమను గ్రామమున ప్రతిష్ఠించి పూజించుచు, కాళహస్తీశ్వరు నాజ్ఞచే కాళహస్తికి వచ్చి హైమవతీనాథుని పూజించుచుండెను.

యాదవ ప్రకాశుడును, గంగా యాత్రను పరిపూర్ణ మొనరించి, తిరిగి సత్యవ్రత క్షేత్రమునకు వచ్చుచు, మధ్యేమార్గమున లక్ష్మణుని వృత్తాంతంబు నెఱింగి, ఆశ్చర్య, భయ, సంభ్రమ కలితుండై "లక్ష్మణసూరి దైవాంశసంభవుండు. వానితో కలహించినచో నా యునికికే ప్రమాదము కలుగవచ్చు"నని యెంచి, తానొనర్పదలచిన అకార్యమునకు పశ్చాత్తప్తుడై, తన మఠమునకు వచ్చి, మార్గాయాసమును బోగొట్టుకొని, శిష్యసమేతుడై రామానుజుని యింటికేగెను.

రామానుజుండు గురువుగారి కెదురువచ్చి, నమస్కరించి మర్యాద చేసెను. అపుడా యేకదండి లక్ష్మణునితో "నాయనా! నీ వెచ్చట తప్పుకొంటివి? నిన్ను కానక కానలో చాల తడవు వెదకి వెదకి వేసారిపోయితిమి. యాత్రచేయు చుంటినేగాని, మనస్సంతయు నీపైనే యున్నది. ఒంటరిగా నీవేమైపోయితివో అని నేను పొందిన బాధ ఎంతటిదో ఆ దైవమునకే యెఱుక. నీవు సలక్షణముగా ఇంటికి చేరుకొంటివి. అదియే పదివేలు. నా బాధకేమి? నిన్ను చూచిన తదుపరి నేను మనుష్యుండ నైతిని. మిగిలిన విద్య బోధించెదను రమ్ము" అని లక్ష్మణుని తల్లి నొప్పించి, తన మఠమునకుం గొంపోయి విద్య గఱపుచుండెను.

వీరి చరితమిట్లున్నది. శ్రీరంగమున సమస్త విద్యాపారంగతుం డును, పరవాది మత్తేభ హర్యక్షుండును, సర్వేశ్వర సింహాసనాంశ సంభూ తుండును, సకల వైష్ణవమత పీఠాధిపతియు, యోగికులా లంకారుండును, యామునాచార్యుండను నామధేయముగల యోగిసత్తముండొకం డుండెను. బాల్యముననే సర్వవిద్వజ్జన కోలాహలుని జయించుటచే పండిత ప్రకాండు లందఱు, ఆతని "విద్వజ్జన శేఖరుం"డని కొనియాడిరి. శఠారాతి రచించిన సహస్రగీతికి, యామునుం డొకా నొకనాడు శిష్యుల కర్థమును వివరించుచు, కొంతసేపు నిమీలిత నేత్రుడై ధ్యాన నిమగ్నుం డయ్యెను. అది గాంచి శిష్యులు "స్వామీ! ఇట్టి తఱి మీ ధ్యానంబునకు నిమిత్తంబేమి?" అని ప్రశ్నించిరి. అందులకాతడు "శిష్యులారా। ఈ సహస్ర గీతియందు నమ్మాళ్వారు, కలియుగము నాల్గువేల యేండ్లు గడచిన పిదప, పశు పక్షి మృగాదులకెల్ల మోక్షం బొసంగ జాలు మహానీయుండొక డుద్భవింప గలండు. అట్టి భవిష్య దాచార్యులను నేను చూచితినని వచించుచున్నారు. అట్టి దివ్యపురుషుడు జన్మించెనా? లేదా యని ఆ పురుషుని తలంచి యానందించుచుంటి" నని ప్రత్యుత్తర మొసంగెను.

అపుడు శిష్యులు "గురుదేవా! ఆ దివ్యపురుషులు మీరలే నేమో?" యని సంశయింప" మేముకాదు. అట్టివాడు దివ్యలక్షణల క్షితుండై యుండు" నని పల్కి గురుండు జనింపబోవు మహాత్ముని గుణగణంబుల నెల్ల వర్ణించెను. అంత నా అంతేవాసులు "అయ్యా! మీర లావతిచ్చిన దివ్యలక్షణములు గలుగు పురుషసత్తముండు సత్యవ్రత క్షేత్రమ్మున యాదవ ప్రకాశులవద్ద భాష్యాది గ్రంథ ముల పఠించు చున్నవాడు. అదిగాక ఆ యేకదండి, ఆతనిని వింధ్యాటవీమధ్య మ్మున విడిచిపోగా కరిగిరి వరదుండు కిరాత రూపమున, నేక రాత్రమున, అశ్ర మమ్మున నాతనిని కాంచీనగరమ్మునకు చేర్చెనని ఆ దేశవాసులు, చిత్ర విచిత్ర ముగా చెప్పుకొనుచున్నారు. అదిగాక ఆ అద్వైత సన్యాసికిని, ఆ అంతేవాసికిని నిరంతరము, మతసంబంధ వైషమ్యము లభివృద్ధిచెందుచున్నవని వినుచున్నారము. మీరు చెప్పిన లక్షణములనుబట్టి "ఈతడే ఆ మహాపురుషుడై యుండ నోపునని భావించుచున్నాము. మీ రాతనిం జూచినచో సత్యము తేటతెల్లము కాగలదు" అని విన్నవించిరి.

యామునదేశికుండా బాలకుం జూడదలంచి, అనేక శిష్య పరంపరా సహితుండై రంగరాజాజ్ఞ గైకొని, సత్యవ్రత క్షేత్రమునకువచ్చి ఉపవనమునం

యాలింగినవాడై కాంచీపూర్ణుడు వరదుని మంగళ
ముపవసించెను. గురుని రాక
వాద్యములను, శఠగోపమును, ఛత్రచామరములను, సర్వేశ్వర నిర్మాల్యములను
గ్రహించి అభ్యుత్థానం బాచరించి గురుని పాదపద్మంబులకు ప్రణమిల్లెను.
యామునముని, అతనిని గ్రుచ్చియెత్తి కౌగిలించుకొని, దీవించి, భగవత్పాదారవిం
దమ్ములకు సాష్టాంగ వందన ప్రణామంబు లాచరించెను. అర్చకులు నిర్మా
ల్యముల నొసంగిరి. యామునుండు ధన్యోఽస్మియని వానిని స్వీకరించెను. వాద్య
బృందములు ధ్వనించుచు, ముందు నడచుచుండెను. కాంచీపుర వైష్ణవులు
సేవించుచు, వెంట వచ్చుచుండిరి. ఇట్లు యామునుండు తన్నగరమును
ప్రవేశించెను. అశేష జనసందోహము నీరాజనము లొసంగి దండప్ర
ణామంబు లాచరించు చుండెను. వాని నన్నింటిని స్వీకరించుచు, వారి యోగ
క్షేమంబు లారయుచు, కరిగిరిని సమీపించి, బలిపీఠమునొద్ద నమస్కరించి, ధ్వజ
స్తంభమునకు జోహారులిడి, గరుడినిం గొనియాడి, జయ విజయులకు వినతు
లొనర్చి శ్రీ భూనీళాది దివ్యమహిషీ పరిసేవితుండై శంఖ చక్ర గదా దివ్యాయుధ
ధరుండై, పీతాంబర కటిస్థలుండై, మాణిక్య నాభీస్థానుండై, కోటిసూర్య ప్రభా
భాసమానుండై వేంచేసియున్న హస్తిగిరి నాధునిం జూచి, ఆ సర్వేశ్వరుని దివ్య
మంగళ విగ్రహం బాపాదమస్తకం బనుభవించి. "సృష్టిస్థితి లయములే లీలలుగా
గలుగు వాడా! సమస్త చేతనావనబద్ధదీక్షాకంకణా! వైకుంఠవాసా! శ్రీనివాసా!
నీకు మంగళంబగుంగాక" అని సర్వావయవంబులకు మంగళముసేసి, స్వామికి
ప్రదక్షిణించి, దివ్యాలయ మంటపంబున శిష్యసహితుండై అనేక నక్షత్రమధ్య
భాగ విరాజిత మృగలాంఛనునిరీతి నధివసించి యుండెను.

అట్టి సమయమ్మున యాదవుండు తన శిష్యులతో కూడి వరదరాజ
స్వామి దేవాలయమునకు ప్రదక్షిణ మాచరించుచుండెను. యామున మునియు
అతనిం జూచి కాంచీపూర్ణులను పిలిచి "వత్సా! యీ ప్రదక్షిణమాచరించుచున్న
యేకదండి పేరేమి? అతడెట్టివాడు? మన రామానుజు లధ్యయనించుచున్న దీతని
యొద్దనే కదా! వీరిలో మన రామానుజుండు కలడా? సవిస్తరముగా వచింపు"
మని పలికెను.

ఆ కాంచీపూర్ణు సవినయముగా గురుని మోమును పరికించి, "గురువరా!
ప్రదక్షిణ మొనర్చుచున్న యీతండు యాదవుండు. పరివేష్టించియున్న వీరందఱు
నాతని శిష్యపుంగవులు. తిర్యక్పుండ్రములను ధరించి వచ్చుచున్న వీరి నందఱ

వీక్షింపుడు. అదిగో, ఆ మధ్యభాగమున, చంద్రముఖుండును, విశాల వక్షస్థ లుండును, ఆజానుబాహుండునునై, శుభ్రవసనములు దాల్చి, తులసీ నలినాక్ష మాలలు గళసీమ వ్రేలుచుండ, ద్వాదశోర్ధ్వ పుండ్రములతో ప్రకాశించు ఆ దివ్య పురుషుడే రామానుజుడు'' అని చూపి చెప్పెను. అంత యామునమౌని, ఆతనిం గాంచి, వకుళాభరణులు సహస్ర గీతియందు అభివర్ణించిన మహాపురుషుండీతడే కదా, యని తలంచి, ఆనందించి, వరదునిగూర్చి యిట్లు ప్రపత్తి యొనర్చెను.

''యస్య ప్రసాద కలయా బధిర శ్రుణోతి,
పంగుః ప్రధావతి జవేన, చవక్తిమూకః,
అంధః ప్రపశ్యతి సుతం లభతేచ వంధ్యా
తం దేవమేవ వరదం శరణం గతోఽస్మి''

ఎవ్వని అనుగ్రహమున చెవిటివాడు వినగల్గుచున్నాడో, పిచ్చి కుంటివాడు పరువిడగల్గుచున్నాడో, మూగ గొప్పవక్త కాగలుగుచున్నాడో, పుట్టు గ్రుడ్డివాడు చూడగల్గుచున్నాడో, గొడ్రాలు సంతానవతి యగుచున్నదో, అట్టి వరదరాజస్వామినిం గూర్చి శరణు పొందుచున్నాను. ఈ విధముగా వరదరాజ స్వామిని ప్రార్థించి, ''ఓ దయామయా! ఈ లక్ష్మణాచార్యుని మా మతమునకు కర్తగా అనుగ్రహింపవలయును'' అనెను.

అంత కరిగిరినుండి, ''నీ ప్రార్థనమును పరిపూర్ణముగా ననుగ్రహించి తిమి'' అను దివ్యధ్వని యామునమునికి విన్పించెను. అందులకు యామునుండు సంతసించి, కాంచీపూర్ణులను జూచి ''వత్సా! ఈ లక్ష్మణునితో నేను సంభా షించుట తగదు. ఒకవేళ నే నాతనితో మాటాడితినేని, ఆతండు ఈ యాదవ ప్రకాశునియొద్ద అద్వైత భాష్యమును పఠింపడు, చదువనిచో ప్రయోజనములేదు. భగవదాజ్ఞ మా కింతవఱకే యున్నది'' అని వచించి శ్రీరంగమునకు మరలి పోయెను.

లక్ష్మణసూరి యాదవ ప్రకాశునియొద్ద విద్య నభ్యసించుచు, నొకా నొక దినమ్మున గురువుగారికి తలంటు స్నానమును చేయించు చుండెను. అపుడు ప్రసంగ వశమున వారి సంభాషణములో శ్రుతివాక్య మొకటి వచ్చెను. దానిని

వివరింపుడని శిష్యుడుకోర, యాదవ ప్రకాశుడు దానికి నీచార్థము నొక్కటి సెల విచ్చెను. ఆ అర్థమునకు లక్ష్మణుని కనుగొలకుల నీరు క్రమ్మి ఆ కదుష్ణజలము గురుదేవుని తొడపై జొటజొట రాలెను. అందులకు గురువు నీ వేల దుఃఖిం చెదవు ? ఈ కన్నీరేమి ? అని ప్రశ్నించెను.

ఆ మాటలకు లక్ష్మణుడు "గురూత్తమా ! తాము కప్యాస పుండరీ కాక్ష" అను శ్రుతివాక్యమునకు "కోతిముడ్డిని పోలిన పుండరీకమువంటి కన్నులు గలవాడు, సర్వేశ్వరుడు" అని వివరించితిరి. ఇది ఉపమితోపమయగుటయేగాక నీచోపమానముకూడ. సర్వేశ్వరుని కన్నులకు నీచ వస్తువును సామ్యము చెప్పు చున్నారు. ఇంత హీనముగా చెప్పుట సరికాదు. కపిపదమునకు సూర్యుడు "కంపిబతీతి కపిః" లేత పూడు అను నర్థద్వయము కలదు. సూర్యునిచే వికసించు చున్నతామరలవంటి నేత్రములుగలవా డీశ్వరుడనిగాని, గంభీరాంభస్సముద్భూత మృణాళ స్థితారవింద సుందర నేత్రుడని గాని చెప్పవచ్చును. దీని యథార్థా మిట్లుండ మీరు నీచార్థమును కల్పించి చెప్పితిరి. ఆ కారణముచేత నాకు దుఃఖము కలిగినది" అని సమాధాన మొసంగెను.

ఆ మాటలువిని యాదవ ప్రకాశులు "ఏమి నీ పాండిత్య ప్రకర్ష. మా సంప్రదాయార్థములు గూడ ఖండించునంతటి ప్రజ్ఞావంతుడవైతివా ? ఇక నీకును నాకును పొత్తుకుదురదు. నీ ప్రవర్తన మెల్ల విపరీతముగా నున్నది నీవంటివానికి విద్య గఱపుట మాదే పొరపాటు. ఇక నా యెదుట నిలువక పొమ్ము." అని హూంకరించెను.

లక్ష్మణుండు విద్యను వానియొద్ద నభ్యసించుట విరమించి, గృహమ్మున కేగెను. అప్పటినుండి కరిశైలనాథునకు తీర్థకైంకర్యము సేయుచు, కాంచీ పూర్ణుల సంగాతమును కలిగియుండెను. ఒకనాడు లక్ష్మణసూరి కాంచీపూర్ణుని కడకేగి "స్వామీ ! నాకు పంచసంస్కార మొనరింపుడు" అని యాచించెను. అపుడు కాంచీపూర్ణులు విచారించి, "ఆర్యా ! మీరుత్తమ కులజులరు. నేను శూద్రుండను. నేను నీకు పంచసంస్కారము చేయతగదు." అని ప్రత్యుత్తర మిచ్చెను.

అపుడు లక్ష్మణసూరి "స్వామీ ! మీకు వరదరాజస్వామి ప్రత్యక్షమగును కదా ! వారినడిగి నా ఆరుప్రశ్నలకు సమాధానము తీయవలయు 1. సర్వవిశ్వ హేతుభూతుండగు బ్రహ్మ మెవ్వడు ? 2. జీవేశ్వరులు భిన్నులా ? అభిన్నులా ? 3. మోక్షార్థులకు ఉపాయమెయ్యది ? 4. భగవద్భక్తులకు అవసానదశయందు భగవత్స్మృతి ఉండవలయునా ? వలదా ? 5. మోక్షమనునది యెప్పుడు ? 6. నాకు గురువెవ్వరు ? ఈ ఆరు ప్రశ్నలకును స్వామినుండి సమాధానములు తెలిసి కొనుడు" అని అర్థించెను.

కాంచీపూర్ణులు ప్రతిదినమును కోవెలకేగి, వరదుడు ప్రత్యక్షము కాగా, అమందానందచిత్తుడై, దేహేంద్రియ ప్రపంచముల విస్మరించి, వారితో మాట్లాడు చుండెను. ఆ సమయమున ఆయనకు రామానుజుల వృత్తాంతము జ్ఞప్తికి వచ్చెడిది కాదు. ప్రతి సాయంకాలము లక్ష్మణసూరి కాంచీపూర్ణుని దరిజేరి, "వరదుని నా ప్రశ్నలడిగితిరా ? అతడేమి ప్రత్యుత్తర మొసంగెను ?" అని మిగుల కుతూహలముతో అడుగుచుండెను. అందులకు కాంచీపూర్ణులెంతయో నొచ్చుకొని "అయ్యో ! నా మతిమరుపున కెవ్వరిని నిందింతును. స్వామిని చూడగనే ప్రపంచమునే విస్మరించుచుంటిని. ఈ దినమున తప్పక అడిగెదను." అని లక్ష్మణుని పంపించుచుండెను.

ఈ విధముగా ఆరుమాసములు దొరలిపోయెను. ఒకనాడు కాంచీపూర్ణులు తప్పక లక్ష్మణసూరి విషయము నా దినమున నడుగదలంచి గుర్తుగా తన ఉత్తరీయపు కొన ముడివైచుకొని పోయెను. స్వామితో సంతోషముతో సంభాషించి, ప్రశ్నలడుగుట మరచిపోయి గృహోన్ముఖుండయ్యెను. భక్తమందారుండగు వరదుండు మృదుమధుర మందస్మిత సుందరవదనుండై "నంబీ ! నాకేదియో బహుమానమును కొంగున ముడివైచి తెచ్చి నాకీయకుండగనే వెడలిపోవుచుంటి వేమి ?" అని ప్రశ్నించెను.

అందులకు కాంచీపూర్ణులునవ్వి, "అవాప్తసమస్తకాముండవగునీకు, నిత్య దరిద్రుండనగు నేనేమి కానుక లందీయగలను ? ఆరునెలల నుండి తపించుచున్న నాకు ఈరోజు బాధానివారణంబు కావించితిరి. లక్ష్మణసూరి మిమ్మడిగి సమాధాన

ములు రాబట్టవలసినదని ఆరుప్రశ్నలిచ్చినాడు.'' అని లక్ష్మణసూరి యిచ్చిన ప్రశ్నల నివేదించెను. వరదుం డీవిధముగా ఆ ప్రశ్నలకు ప్రత్యుత్తరముల నొసంగెను. 1. సర్వజగద్ధేతుభూతంబగు పరబ్రహ్మమును నేనే. 2. జీవేశ్వరులు భిన్నులే. 3. మోక్షార్థులకు శరణాగతియే ఉపాయము. 4. నా భక్తులకు అవసాన దశయందు నాస్మృతి అవసరములేదు. 5. శరీరమును వదలగనే మోక్షము. 6. మహాపూర్ణులే రామానుజులకు గురువు. ఆ సాయంకాలము లక్ష్మణసూరికి కాంచీపూర్ణులు వరదునిచే చెప్పబడిన సమాధానములను వివరింపగా లక్ష్మణసూరి మహానందిత స్వాంతుడయ్యెను.

శ్రీరంగమున యామునమునికి (ఆళవందారునకు) అవసానదశ సంప్రాప్తించెను. అపుడు పెద్దశిష్యులగు మహాపూర్ణులను పిలిచి, ''నీవు సత్యవ్రత క్షేత్రమునకేగి, వరదరాజాజ్ఞచే లక్ష్మణసూరిని ఇచ్చటకు తోకొనిరమ్ము. ఈ వైష్ణవ సిద్ధాంత సామ్రాజ్యమున కాతని పట్టాభిషిక్తునిగావించి, కొన్ని విషయము లాతనితో ముచ్చటించి నేను నిత్య విభూతికి పోవలయును.'' అని పలికెను.

అంత మహాపూర్ణులు గుర్వాజ్ఞబద్ధులై శ్రీరంగమునుండి వెడలి సత్యవ్రత క్షేత్రమ్మునకు వచ్చుచుండెను. మధ్యలో మధురాంతకమున విడిసిరి. ఇటు రామానుజులును, మహాపూర్ణుల విషయమును కాంచీపూర్ణులవలన సవిస్తరముగా తెలిసికొనినవాడై పంచసంస్కార నిమిత్తమై శ్రీరంగమునకు మధ్యే మార్గంబున మధురాంతకమునుండి ప్రయాణించు చుండెను. ఆ సమయమున మహాపూర్ణులు మధురాంతకమ్మున గల మహాసరస్సున స్నానంబాడి, స్తోత్రరత్నము నందలి మధుర శ్లోకములు పఠించుచుండెను. ఆ సమయమున నటకేతెంచిన లక్ష్మణసూరి మంద్రగంభీర కంఠమునుండి వెలువడిన ఆ శ్లోకార్థములకు, దైవభక్తికి, ప్రౌఢిమకు కవితాధారకు మురిసిపోయిన వాడై మహాపూర్ణులను సమీపించి, ''స్వామీ! తమరెవ్వరు? మీ జన్మముచే పవిత్రీభూతంబైన దివ్యధరిత్రీతలంబెయ్యది? మీరెటనుండి యెచ్చటి కేగుచున్నారు? మీ రిప్పుడు చదివిన శ్లోకరత్నము లెవ్వరిచే రచింపబడినవి? ఆ శ్లోకము లేగ్రంథరాజము లోనివి? అవకాశంబున్నచో ఆ శ్లోకములను వ్రాసియిత్తురా?'' అని వినయ వినమితగాత్రుడై విన్నవించెను.

అపుడు మహాపూర్ణులు "నాయనా! మాది శ్రీరంగము. నన్ను జనులు మహాపూర్ణుడని పిలుతురు. యామున మునీంద్రుడు మా గురుచంద్రుడు. నేనిపుడు చదివిన మధురశ్లోకములు మద్గురుకృత స్తోత్రరత్నము నందలివి. నేను మా గురు దేవుని ఆనతిచే సత్యవ్రత క్షేత్రమున వసియించుచున్న లక్ష్మణసూరిని తోడ్కొని వచ్చుటకై యేగుచుంటిని. మా ఆచార్యులు పరిపూర్ణవృద్ధులు. వారికి అవసాన దశ సమీపించినది. ఈ వైష్ణవసిద్ధాంత సామ్రాజ్య పట్టమును రామానుజున కొసగి తాము నిత్యవిభూతి నలంకరింప తొందరించుచున్నారు. అందువలన నేను కాంచీ పురమున కరుగుచుంటిని" అని వివరించెను.

ఆ మాటలకు ఆనందితస్వాంతుడై లక్ష్మణసూరి మహాపూర్ణుల పాదమ్ము లకు సాష్టాంగ నమస్కార మాచరించి "స్వామీ! మీరు వచించిన లక్ష్మణదాసుం డను నేనే. మీరే నాకు గురువులని వరదుడు కాంచీపూర్ణుల ముఖమున ఆదే శింపగా, నేనే తమకొఱకు శ్రీరంగక్షేత్రమునకు బయలుదేరితిని. ఆడబోయిన తీర్థమెదురైన భంగి తామే నాకొఱకు వచ్చుచుంటిరి. ఆహా! దైవవిధి. నాకు తా మిచ్చటనే పంచసంస్కారవిధిని నిర్వర్తించి నన్ను కృతార్థుని చేయు" మని వేడుకొనియెను.

అపుడు మహాపూర్ణులు "వత్సా! పంచ సంస్కార విధికి దివ్యదేశం బులు తగియుండు. ఇటు సత్యవ్రత క్షేత్రమో, అటు శ్రీరంగ పుణ్యధామమో ఐనచో కడుంగడు లెస్స. మార్గమధ్యమున నిట్టి సామాన్య ప్రదేశమునందు, ఆ మహా కార్యము నిర్వహింప, నంత తొందరయేమి? శ్రీరంగ ధామమును చేరిన తదుపరి నీ యిష్టానుసార మట్లే చేయుదును. అదియుగాక మా గురు చంద్రుల కవసానము సమీపించి యున్నది. ఆయన కడసారి దర్శనమైన మనకు లభిం చునో? లేదో? ఆయన దర్శనభాగ్యము లభింపనిచో, గుర్వాజ్ఞ నిర్వర్తింపలేక పోయితినే యను మనః క్లేశము జీవితాంత మనుభవింపవలసి వచ్చును. కావున త్వర పడుము" అని తొందరించెను.

ఆ మాటలు విని లక్ష్మణసూరి "మీ వచనము లక్షర సత్యములు. శరీరము లనిత్యములు. బుద్బుద ప్రతిమంబులు. మనస్సు లతి చంచలంబులు. క్షణ భంగురంబులగు తనువుల విశ్వసించినచో దేవతోపాసన చేయ వచ్చునే?

నేను తమ వెంట శ్రీరంగమునకు వచ్చువరకు, ఈ కాయము నిలుచునో? నిలువదో? ఎట్లు చెప్పవచ్చును? తనవు నిలిచినను, బుద్ధి నిలుకడ తప్పకూడదా? అట్లైనచో మీ వలన పొందనగు మంత్రశ్రేష్ఠము నాకు సిద్ధింపదుకదా! మీరు స్థిరులు. మే మస్థిరులము. మీ స్థితినిబట్టి మా పరిస్థితుల నూహించుట సమంజసమా? అదికాక దివ్యమంత్ర ప్రాప్తికి, దేశ, జాతి, కుల నియమమ్ములు లేవని మీవంటి పెద్దలందురు. కావున నిచ్చటనే, ఇప్పుడే తత్పవిత్రకర్మ మాచరింపుడు''. అని వినయగర్భిత వాక్యమ్ముల బలవంత మొనర్చెను.

అందులకు మహాపూర్ణులానందమ్మున నంగీకరించి, సవిధ ప్రదేశమున నెందైన అగ్నిహోత్రమును కొనిరమ్మని ఆదేశించెను.

రామానుజులు చుట్టును పరికించి సమీపమందలి గొల్లల మందకడ కేగి, అచ్చటగల అగ్నిహోత్రమును కొనిరాగా మహాపూర్ణులా అగ్నిని ప్రజ్వరిల్లజేసి, సుదర్శన పాంచజన్యమ్ముల తప్త మొనర్చి రామానుజుని భుజములపై నుంచి, మంత్ర మంత్రార్ధముల నుపదేశించెను.

ఆ తరువాత మహాపూర్ణులు లక్ష్మణసూరితో ''వత్సా! త్వరిత గమనమ్మున శ్రీరంగమునకు పోవుదము. రమ్ము'' అని వెంటబెట్టుకొని, ఆ దివ్య దేశమును చేరవచ్చెను.

అంతలో యామునముని, సమీపవర్తులగు శిష్యులనుగాంచి, ''పెరియ నంబి కంచికిపోయి చాల దినములైనది. ఇంతదనుక లక్ష్మణసూరిని తోడ్కొని రాదయ్యెను. ఈ జన్మమున లక్ష్మణసూరితో సంభాషించు నదృష్టములేదు. శ్రీరంగ రాజాజ్ఞ ఈ విధినుండ నేనేమి సేయుదు?'' అని వచించుచు తన వైభవమును చాలించెను. శిష్యులందఱును గురుని వియోగ భారమును భరింపజాలక గోడు గోడున విలపించిరి. గురువునకు బ్రహ్మమేధము చేయదలంచి, ఆ కార్యములన్నియు నిర్వహించిన వారై గురుని చరమ విగ్రహమును, దివ్య విమానమ్మునందుంచి, బ్రహ్మవేత్తలందఱును వహించి, ఉద్యానవనమునకు పోవుచుండిరి. ఆళవందారుల పరలోక యాత్రా వృత్తాంతమును విని రంగవాసులెల్ల రేతెంచిరి. భక్తి ప్రపత్తులతో కడసారి అంజలించిరి. పటహ కాహళాది మృదంగాది వాద్య

ములు ముందఱ చనుచుండెను. వారి నారీజనమ్ము లాటపాటలతో వారి పిఱుంద నేగుచుండిరి. పురుష సూక్తము, భృగువల్లి ఉపనిషత్తులు మొదలగు నవి అధ్యయనించుచు, కొందఱు పయనించుచుండిరి. తిరువాయ్మొళి మొదలగు దివ్య ప్రబంధము లాలపించుచు కొందఱు నడచుచుండిరి. ఆళవందారుల దివ్య చేష్టితముల నభివర్ణించుచు కొంద రేగుచుండిరి. ఇట్లు లెక్కకు మిక్కుటముగా యాముళముల పరివేష్టించి, ఉద్యానవనమును చేరి, ఆ దివ్య కళేబరమును శిబికనుండి క్రిందకు దించి బ్రహ్మమేధము నొనర్ప సంసిద్ధులై యుండిరి.

ఆ సమయమున పెరియనంబి ఉద్యానవనమునందలి మహాజనమును పారజూచి లక్ష్మణసూరితో "తండ్రీ! ఎవ్వని ఆజ్ఞానుసారము నేను నీకడ కరుగుదెంచితినో? ఎవని దర్శింప నీవు కుతూహలపడుచుంటివో? ఎవ్వని గాంచిన పరమత మతవాదులు, సింగంబును గాంచిన కురంగంబులవలె తల్లడిల్లి పోవుదురో? ఎవ్వడీ వైష్ణవమత సిద్ధాంత సామ్రాజ్యమును సంస్కరించి పాలించెనో, ఎవ్వడు లోక వందితమగు స్తోత్రరత్నమను మధుర భక్తిరసపూరిత స్తోత్రంబును రచించెనో? ఎవ్వడీ జగతీతల పండితులనెల్ల సర్వ విద్వజ్జన కోలాహలుని బారినుండి రక్షించెనో? ఎవ్వని యునికి శ్రీరంగధామమునకు నిత్యో త్తేజప్రదమో? అట్టి మహనీయుండగు యామునార్యుండు నిత్యవిభూతి నలంక రించెను. చూడుము. అదే మహాజనము. ఉద్యానవనమున నిండియున్నది. గురువు గారికి బ్రహ్మమేధము నొనర్పబోవుచున్నారు. పెద్దలను సంస్కరించు దివ్య స్థల మద్దియేసుమా! లేనిచో నిచ్చోటికింతమంది యేల వత్తురు?" అని వచించుచు, విచారభారంబున సమీపించెను. అటనున్న వైష్ణవులందరును, వారిరువురంగాంచి బోరన విలపించిరి. పెరియనంబి గురుని దేహముపైబడి, పదమ్ములకు వందన మ్మిడి, చాలసేపు ఒడలుతెలియక రోదించెను లక్ష్మణసూరియు యామునమౌని శుభ్రకళేబరముపైబడి పెద్దపెట్టున శోకింపదొడంగె. కొంతసేపటికి పెరియ నంబియు మొదలగు పెద్దలు తమ్ముతాము సంబాళించుకొన్నవారై దుఃఖమునుండి తేరుకొని లక్ష్మణసూరింజూచి "వత్సా! మీరిరువురును కలిసి ముచ్చటించు కొనెడి అదృష్టమీలోకమునకు లేదు. వారు నిన్నుగూర్చి అనేక విధమ్ముల చెప్పు చుండెడివారు. నీతో సంభాషించి లీలావిభూతినుండి నిత్యవిభూతికొక నిశ్రేణిని నిర్మింప తలంచియుండెడివారు. అట్టి భాగ్యమున కీలోకము నోచుకొనలేదు.

నీకి గురుని దివ్యదేహమును దర్శించు నదృష్టముమాత్రమున్నది. దానికే నీవు సంతసింపవలయు, లెమ్ము. కాలాతీతమగుచున్నది. కర్తవ్యమును నిర్వర్తింప వలయును'' అని ఓదార్చి లేవదీసిరి.

లక్ష్మణసూరి దుఃఖము నడంచుకొని, పైకిలేచి యామునుల కళేబరము నాపాదమస్తకము నొక్కసారి పరిశీలించి, చుట్టునున్న పెద్దలతో నిట్లు పలికెను. ''సాధు పుంగవులారా! యామునాచార్యుల కుడిచేతి వ్రేళ్ళు మూడు ముడుచుకొని యున్నవి. వారి మనస్సునందేవియో మూడు విషయంబులు ప్రగాఢంబుగా, అలముకొని యున్నట్లు తోచెడిని. ప్రసంగవశమున నేమియైన ప్రస్తావించెడి వారా?''

ఆ మాటలను విని కొందఱు ''చచ్చినవారిలో కొందఱికి చేతి వ్రేళ్ళిట్లే యుండుననిరి. వీరికి అంగుళులు మాత్రమే ముడుచుకొని పోయినవి, మఱికొందఱికి దేహాంగములనియు బిగుసుకొని పోవును. అని మరికొందఱు వచించిరి. నీవు చిన్నవాడవు. శవములను జూచియుండవు. నీకిది విచిత్రంబుగా నోపు. త్వరగా సంస్కరింపుడు. భోజనవేళ అతిక్రమించుచున్నదని కొందఱు వక్కాణించిరి.

ఆ వాక్యములన్నియు ఆలకించి లక్ష్మణసూరి ''ఆర్యులారా! ఈమహాపురుషుని ప్రాకృత మనుజుని యట్లు తలపోయుచున్నారు. వీరిని ఇంతకు ముందెన్నండును దర్శింపనప్పటికిని, వారి అభిప్రాయముల నవగతము కావించుకొనగలవాడ'' నని యామునముని చెవియొద్ద నేవియో రహస్యముగా వివరించెను. అంత సర్వజనులును సాక్షీభూతులుకాగా దేశికుని వ్రేళులు సక్రమముగావచ్చెను. అదిచూచి అటనున్నవారెల్ల ప్రభూతాశ్చర్యులై ''ఓ సర్వజ్ఞ శేఖరా! మీరు వారి చెవియొద్ద చెప్పిన రహస్యములు మేము వినదగినవారమని మీ దివ్యచిత్తంబున తలంచిన వానిని వినిపించి మమ్ముల ధన్యులకావింపుడు'' అని వేడుకొన లక్ష్మణసూరి వారిం జూచి ''ఆళవందారు మనస్సున మూడుకోరికలు పాదుకొన్నవి. లోకమంతయును సంచరించి, బద్ధచేతనుల నుద్ధరింప వలయుననునది వారి ప్రథమ వాంఛ. బ్రహ్మసూత్ర, భగవద్గీతా, దశోపనిషత్తులకు భాష్యము వ్రాయవలయునను నది వారి రెండవ కోరిక. వైష్ణవ సిద్ధాంతమును వృద్ధిపఱచినవారు, పరాశర

పారాశర్యులు కావున, ఉన్నతవంశ సంజాతులైన వారి కేరికైన ఆ పేరులు పెట్టవలయుననునది వారి తృతీయకాంక్ష. వారి చెవికడజేరి "స్వామీ। మీరు మీ పరిపూర్ణ కృపాకటాక్షములను, నాపై ప్రసరింపజేసినచో, ఈ దాసుడు ఆ మూడు కార్యములను, పూర్తిచేయగలడు" అని విన్నవించుకొంటిని. వెంటనే వారు అంగుళీమోచనము గావించుట మీరెల్లరారసినదియే కదా !" అని నిర్ధారించెను.

అచ్చట నున్నవారందఱును, లక్ష్మణదేశికుల దివ్యతేజస్సును, వారి అవయవ సౌష్ఠవమ్మును, ముఖ వైలక్షణ్యమును, గమన విధియు, అలౌకిక ప్రజ్ఞయుజూచి "ఔరా ! ఈ పోయిన యామునదేశికులును, లక్ష్మణసూరియు ఒకే దివ్యతేజస్సంపన్నులు. ఒకే దివ్యతేజము రెండుగా విభజింపబడి, తొలుత యామున మునీంద్రుని రూపమ్మున భూమికి వచ్చినది. ఇపుడీ లక్ష్మణసూరి ఆకారమున పృథ్వికవతరించినది. ఇది సహజమే. లోకమున నిద్దఱు సూర్యులొకేసారి యుద్భవింపరుకదా ! మనమిక విచారింపం బనిలేదు. యామున మునీంద్రుడు లేని లోపము నీ లక్ష్మణసూరి తీర్పగలడు" అని సంతసించి లక్ష్మణసూరింగాంచి "మీరు వచించిన ఈమూడు విషయములును మా గురువుగారెప్పుడును మాతో చెప్పుచుండెడివారు. వారు ప్రేశబు ముడిచిన విషయమునే మేము తొలుత గమనింప మైతిమి. సర్వజ్ఞులగు తమరు ఆ విశేషమును వెంటనే ఆకళించితిరి. "అని ప్రస్తుతించి యామున మునీంద్రులకు బ్రహ్మమేధము నొనర్చిరి.

ఆ తరువాత మహాపూర్ణులు, శిష్యుండగు లక్ష్మణసూరిం బిలిచి "వత్సా! రంగధామమునకు వచ్చి శ్రీరంగేశుల దర్శించి పెక్కుదువుగాని రమ్ము" అని ఆహ్వానించెను. లక్ష్మణుండు గురు ముఖారవిందమ్మున దృష్టిసారించి "మహాత్మా! గుహలోని పులినైనను, పొదలోని పామునైనను చూడవచ్చునుగాని, ఈ రంగ ధాముని మొగము జూడరాదు. యామునులను దర్శించి, వారితో భాషించి, వారి నుండి ఎన్నియో దివ్యవిషయమ్ముల నెఱుంగవలయునని నామనమ్మున ఆస గలదు. దానిని వమ్ము చేసినాడు. నేను వచ్చి యామునాచార్యుని సందర్శించువఱకు, వారి నీలోకమున నిల్పగలశక్తి తనకు లేకయుండెనా ?" అని పలికి, గురు వెంతచెప్పినను, వినక సత్యవ్రత క్షేత్రమునకు మరలివచ్చి. ఆ వృత్తాంతమును కాంచీపూర్ణులకు విన్పించెను.

ఈ విషయమును విని కాంచీపూర్ణులు అతి విచారపూరితుండై విలపించి స్నానము చేసెను. గురువున కొనర్పవలసిన విధులన్నియు నిర్వహించెను. లక్ష్మణసూరి వరదరాజస్వామిని దర్శించి, యామునార్యుని దర్శింపలేక పోయి నందులకు కలిగిన దుఃఖమునువీడి, యథాప్రకారము, భగవంతునకు తీర్థ కైంక ర్యము చేయుచుండెను.

ఒకానొక దినమున లక్ష్మణసూరి కాంచీపూర్ణుల ఉచ్ఛిష్టమును భుజింప నిచ్ఛించి, వారి మఠమునకుబోయి ''స్వామీ! మీరు మాయింట భోజనమునకు రావలయు'' నని అర్థించెను. కాంచీపూర్ణులు రామానుజుని మనోభిప్రాయ మును పసిగట్టి, రేపు మాపని జరుపుచుండెనేగాని, భోజనమునకు పోవడయ్యెను. ఇట్లు కొంతకాలము గడచెను. తదుపరి యొకనాడు లక్ష్మణుడు కాంచీపూర్ణులకడ కరిగి ''స్వామీ! ఎన్ని దినంబులనుండి ప్రార్థించినను, మీరు నా అభిలాషను తీర్పకున్నారు. కారణం బేమియో ఎఱుంగ, తప్పక ఈరోజు మా గృహంబునకు భోజనంబునకు తమరు విచ్చేయ వలయును'' అని బలవంత పరచెను. అందులకు కాంచీపూర్ణులు ''మీరింత పట్టు పట్టుటకు కారణమేమియో తెలియకున్నది. మీరు రమ్మన్నచో నేను రానందునా? అట్లే యేర్పాటు కావింపుడు. ఈనాడు మీయింటికి భోజనమునకు వత్తును'' అని అంగీకరించెను.

లక్ష్మణసూరి హర్షప్రఫుల్ల హృదయసరోజుడై ఇంటి కేతెంచి, అర్ధాంగిం గాంచి, ''తన్వీ! సమస్త పదార్థములు రుచిగా, శుచిగా, సిద్ధము చేయ వలయు.'' అనితెలిపి, పిండివంటలు, అనేకములగు కూరలను చేయించి, కాంచీ పూర్ణులకొఱకు కరిగిరి ప్రదక్షిణముగా, ఆయన మఠమునకు వెడలెను. అది యెఱింగి తిరుక్కచ్చినంబి (కాంచీపూర్ణుల ద్రావిడ నామము) యు హస్తగిరికి ప్రదక్షిణముగా రామానుజుల గృహమునకుబోయి, ఆయన భార్యతో ''అమ్మా! రామానుజులవా రేమియైరి? నా కీవేళ వరదరాజస్వామివారి సేవగలదు. వేళ యగుచున్నది. త్వరగా నాకింత అన్నమిడినచో తినిపోయెద'' నని పలికెను.

ఆమె మూర్ఖురాలు. భర్త అభీష్టము నెఱుంగదు. అందుచే నింటిపంచ తిన్నెయం దొకమూల, విస్తరి వైచి, సమస్త పదార్థములు వడ్డింపగా, కాంచీపూర్ణులు త్వర త్వరగా ఆ పదార్థముల నన్నింటిని భుజించి, ఆకుతీసి వీధిలో పారవైచి,

కాలుసేతులు కడుగుకొని, హస్తిగిరికి ప్రదక్షిణముగా తన మఠమునకు తిరిగి పోయిరి.

రామానుజులు కాంచీపూర్ణుల ఆశ్రమమునకేగి వారు తనయింటికే భోజనమునకు పోయిరని విని, యింటికివచ్చి చూచెను. ఇంటిపంచతిన్నె అలుకబడి యుండెను. భార్య స్నానమాచరించుచుండెను. అదిచూచి లక్ష్మణసూరి "ఇపుడు నీ స్నానమునకు కారణమేమి"? అని అడిగెను. అందులకా యిల్లాలు భర్తతో "స్వామీ! తిరుక్కచ్చినంబి వచ్చి భోజనముచేసి వెడలినాడు. ఆతడు శూద్రుడు. శూద్రుడు తినిన వెనుక ఆ యుచ్ఛిష్టమును బ్రాహ్మణులమగు మనము భుజింపరాదు. కావున పదార్థములన్నియు బిచ్చగాండ్రకు పారవైచితిని. గృహమును గోమయ శుద్ధికావించి నేను, నిమజ్జనం బాడుచున్నదాన. వంట త్వరగాచేసెద. మీకు భోజనమునకు ప్రొద్దెక్కుచున్నదని పొక్కుచున్నదాన. మీరు భుజించిన వెనుక, ఆతనికి పెట్టినచో నాకీ బాధయుండెడిదికాదు. ఆతడు మిక్కిలి త్వరపడినాడు. తప్పనిసరియై పెట్టితిని." అని చెప్పెను. ఆ మాటలకు లక్ష్మణసూరి నిశ్చేష్టితుండై కొంతవడికి తెలిసి, భార్య చేసిన భాగవతాపచారమునకు అత్యంత క్లేశము ననుభవించి, తానొనర్చిన పని, పడిన ప్రయాసయు వ్యర్థమైనందులకు దుఃఖించి మిన్నకుండెను.

శ్రీరంగమున యామునదేశికుండు పరమపదించిన తర్వాత దర్శనస్థాపకు లెవ్వరును లేనందున, రంగవాసులు కొందఱు పెరియనంబి (మహాపూర్ణుల ద్రావిడనామము) గారిని దర్శించి, "ఆర్యా! మీరు సత్యవ్రత క్షేత్రమునకేగి, సంప్రదాయ గ్రంథములు లక్ష్మణసూరికి తెల్పి మీ ఆజ్ఞాబలముచే నాతని నిచ్చటకు తోడుకొనిరండు. యామునముని లేనికారణమున, చంద్రహీనంబైన రాత్రి వలె శ్రీరంగము శోభావిహీనమై యున్నది. లక్ష్మణసూరి రాకచేకాని, అర్కసన్నిహితంబగు నుత్తర దిక్కువోలె భాసింపదు." అని పలికిరి. పూర్ణార్యులు "అదియే నేనును తలంచుచున్నాను. అచ్లేపోయి ఆతనిని తోడ్కొని వచ్చెద"నని చెప్పి సకుటుంబముగా సత్యవ్రతక్షేత్రమునకు వెడలెను. లక్ష్మణసూరి గురుచంద్రుని రాక విని ఎదురుపోయి పాదములపై బడి నమస్కరించి, "మీ రాకచే

నేను కృతార్థుడనైతి'' నని వారిని తీసికొనిపోయి, కాంచీపురమ్మున నొక గృహ మ్మున నుంచి, వారికి సకలపరిచర్య లాచరించుచుండెను. పెరియనంబి, ద్రావిడ గ్రంథములను, సంప్రదాయ గ్రంథముల విశేషములు బోధించుచుండెను.

ఈరీతి కాలము గడచుచుండెను. ఒకానొక దినమున పెరియనంబి గారి భార్యకును, లక్ష్మణసూరిగారి భార్యకును, బావియొద్ద నీరుతోడుకొను విషయ మున కలహము సంభవించెను. వారిరువురు ఒకరి నొకరు నిందించుకొనుచు, చేతులు కలుపుటకు సంసిద్ధమైరి. చుట్టుచేరి చూచువారందరును, ''ఇదియేమి? గురు శిష్యుల భార్య లీరీతి పోట్లాడుకొన వచ్చునా? వైష్ణవులగువా రిటులుండ వలయునా? ఏమి? అని వారి నిరువురను మందలించి, వారించి, పంపించిరి. మహాపూర్ణు లీవిషయము నెఱింగి భార్యతో ''వెఱ్ఱిదానా! ఎంతపని చేసితివి? లక్ష్మణసూరి అర్థాంగి మూర్ఖురాలు. ఆమెతో నీవు కలహించితివన, ఇక నీ వివేక మెంతని వర్ణింప వలయును? నీవును ఆమెతో సమానవైతివి. ఈ విషయమును శిష్యుడు తెలిసికొనినచో, ఆతడు భార్యను విడచిపెట్టును. ఇక మనమిచట వసిం చుట మంచిదికాదు.'' అని వచించి, భార్యతోను పిల్లలతోను, అర్ధరాత్రమున లేచి, రామానుజునకు చెప్పకయే శ్రీరంగమునకు వెడలిపోయెను.

ఆ రెండవ రోజున లక్ష్మణసూరి, యథాప్రకారము పెరియనంబిగారి యింటికేగెను. ఎవ్వరును అందు కన్పింపరైరి. గృహము శూన్యమై శోభావిహీ నమై వెలవెల బోవుచుండెను. ఆయింటి చుట్టుపట్టుల విచారింపగా, ఆ క్రిందటి దినమున జరిగిన విషయమునంతయు విన్పించిరి. లక్ష్మణసూరి నివ్వెరపడి చాల నిర్వేదముతో నింటికి వచ్చుచు ''న సంసారాత్ పరోరిపుః'' సంసారమునకు మించిన పగవాడులేడు. ఐహికాముష్మికములు రెండును సమానములే. విరోధము లేనిచో రెండింటిని చూచుకొనవచ్చును. అది వచ్చెనా, ఐహికమును వదలి ఆముష్మి కమును ఆరాధింప వలయును. ఈ సంసారమునందలివారెల్ల ఆభాసబాంధవులు. నదీ ప్రవాహమున కొట్టుకొనివచ్చు కట్టెలు సుడిగుండమునందు కలియును. మరల సుడివిడిపోయినంత దేనిత్రోవ నదియే కొట్టుకొనిపోవును. అట్లే పుత్ర మిత్ర కళత్రాదులందఱును, ఈ భవ భ్రమమునందు కలియుచున్నారు. తరువాత నెవరి త్రోవను వారు పోవుచున్నారు. భగవద్విషయమునం దనుకూలు రయ్యెనా, అంద

ఱును కలిసి గోపికాబృందమువలె తరింప వచ్చును. ప్రతికూలు రయ్యెనా ప్రహ్లాద విభీషణాదులవలె సర్వబాంధవుల వీడి తరింపవచ్చును. ఎట్లైనను, భగవదనుభవ మునకు హాని వాటిల్లరాదు. ఇపుడీ సంసారమును, భార్యను వీడి తుర్యాశ్రమ స్వీకారము చేయవలసి యున్నది. ఈ విషయము తెలిసినచో నాభార్య అంగీకరింపదు. ఉపాయముచే నీమెను పుట్టినింటి కంపించి సన్యసించెదగాక'' అని చింతించెను.

ఆ తరువాత తన భార్య పుట్టినింటికడనుండి వచ్చినట్టు లొక ఉత్తర మును సృష్టించి, చీరెయు, రవికయు, పసుపు కుంకుములు తెప్పించి, యింటికి పంపించి, తదుపరి తా నింటికేగెను. భార్య ఆ వస్తువులు తిలకించి భర్తతో ''స్వామీ! ఏమి యీ వస్తువులు? ఎచటనుండి వచ్చినవి? ఎవరు పంపించిరి?'' అని ప్రశ్నించెను. అందులకు లక్ష్మణసూరి దేవీ! నీవీ యుత్తరమును చూడనే లేదా? నీ పుట్టినింటివారి యొద్దనుండి వచ్చినది. మీ చిన్నతమ్ముని వివాహమట. లగ్ననిశ్చయమైన తదుపరి మనకీ లేఖ వ్రాసిరి. లగ్నము సమీపించినది. నేను పనులుచూచుకొని, రెండు దినములలో వత్తును. నీ వీదినమే బయలుదేరిపొమ్ము. అందులకే యీ చీరయు, రవికయు తెప్పించితిని. ఇదిగో ఈ బాలకుడు నీ వెంట రాగలడు. నీవు భద్రముగా పుట్టినింటికి చేరిన తదుపరి, ఈ పిల్లవానిని త్రిప్పి పంపుము.'' అని చెప్పి ఆమెను ప్రయాణము చేయించి పంపించెను.

ఇట్లు లక్ష్మణసూరి సంసారమును విసర్జించి, శుభవాసరమున గజశైల నాథుని సన్నిధికిబోయి, వారి దివ్యాజ్ఞగైకొని, కాషాయ వస్త్రములు, త్రిదండము మొదలగు వస్తువుల సంపాదించి, యామునమునుల పాదారవిందంబులు ధ్యానించుచు, తురీయాశ్రమ మగు సన్న్యాసమును స్వీకరించెను. ఆ సమయమున దివి యందు దేవదుందుభులు మ్రోసెను. కలి విజృంభమాణ మడంగెను. సత్పురుష చిత్తంబులు నిర్మలంబులయ్యెను. చల్లని వాయువులు మెల్లగా నడయాడెను. ఆకసము నిర్మలత్వము వహించెను. పాపంబు పయనము గట్టెను. ధర్మదేవత నాల్గుపాదములతో సంచరింప దొడంగెను, అర్చిరాజమార్గమంతయు నలంకరింప బడెను. ఆదివాహకులకు సంభ్రమము కలిగెను. త్రిపాద్విభూతియందలి నిత్య సూరులకు మోదము కలిగెను. ఆ సమయమున వరదరాజస్వామి కాంచీపూర్ణులను పిలిచి, ''నీవు నా దివ్యవాహనమును, నా దివ్యవాద్యములను తీసికొనిపోయి,

ఆవాహనమ్మునందు రామానుజుల నధిరోహింపజేసి, సమస్త వాద్యఘోషములతో నా సన్నిధికి కొనిరమ్ము" అని ఆజ్ఞాపించెను.

కాంచీపూర్ణులును "ధన్యోఽస్మి-కృతకృత్యోఽస్మి" అని పలికి సర్వేశ్వరాజ్ఞానుసారముగా సమస్త పరివారముతో రామానుజుని కడకేగి, భగవదాజ్ఞ నివేదించి, ఆతనిని దివ్యవాహనాధిష్ఠితునిజేసి, వాద్యధ్వనులు చెలంగ, బ్రహ్మవేత్తల వేదాధ్యయనము లతిశయింప, కాంచీపుర పౌరులు పరివేష్టించి నడువ తీసికొనివచ్చి కరిశైల నాథుని ప్రోలి దించెను.

లక్ష్మణసూరి వరదరాజస్వామి సన్నిధికేగి, వారి శ్రీ పాదములకు వందనం బాచరించెను. వరదరాజులు సంతోషించి, శఠగోపమును, తీర్థప్రసాదముల నిప్పించి, వెంట వచ్చినవారందరును వినుచుండ, లక్ష్మణునితో "వత్సా! నీవు యతిలోక సార్వభౌముడవై దిగ్విజయముచేసి బద్ధ జీవుల నుద్ధరింపుము." అని ఆశీర్వదించెను. ఆ వాక్యములాలకించి, కాంచీపూర్ణాది మహాపురుషులందరును, జయజయ ధ్వానము లొనర్చి సంతసించిరి. ఆధ్వనికి కరిగిరి ప్రతిధ్వనించెను. అపుడు వరదుడు కాంచీపూర్ణులను జూచి, "ఈతని నొక తగిన మఠమునందు ప్రవేశపెట్టు" మనెను. కాంచీపూర్ణులు రామానుజుని నొక మఠమున ప్రవేశింపజేసెను. యతిరాజులు వరదరాజును సేవించుచు, భగవద్విషయముల వెదజల్లుచు కాంచీపురమున వసించుచుండెను.

యతిరాజునకు భాగినేయుండును, మహాపండితుండును, దాశరథి నామధేయుండును అగు ఒక మహాపురుషుండు రామానుజులకు ప్రథమ శిష్యుండాయెను. హారీతగోత్రసంభవుండగు కూరేశుడు ద్వితీయ శిష్యుడయ్యెను. తదుపరి అనేకులు వచ్చి వారిపదమ్ముల నాశ్రయించుచుండిరి. వారి ప్రభావము మహావైభవోపేతమై దశదిశల కీర్తి చంద్రికల వ్యాపింపజేయుచుండెను. అది అంతయుగాంచి, యాదవ ప్రకాశులు తన మనంబున "ఔరా! ఈ రామానుజుని ప్రభావము అద్వితీయము. అద్వైతమునందు జీవేశ్వరులకు వ్యావహారికమున, సత్యము, పారమార్థికమునం దసత్యము వచించుటకన్న రామానుజులు ప్రతిపాదించుచున్న నిత్యభిన్నత్వమే సమంజసమని తోచుచున్నది. రామానుజుడు ప్రతిపాదించిన విషయ మసత్యమైనచో, ఇంతటి మేధావులు, మహాపండిత ప్రకాండులు, ఆయన అను

యాయులగుట యెట్లు తటస్థించును? కావున నేనుకూడ పోయి, ఆయననే ఆశ్ర యించుట మేలగునేమో?'' అని యోజించి, యొకానొక దినమున యతిరాజు సన్నిధికి నేగెను.

యతీంద్రు డాయనను జూచి సత్కరించి, నమస్కరించి ''గురు చంద్రమా! ఏమికార్యముపై తమ రిట కేతెంచితిరి?'' అని ప్రశ్నించెను. అపుడు యాదవ ప్రకాశులు, ''యతీంద్రా! విశిష్టాద్వైత మతమునకు సంబంధించిన, పంచ సంస్కారమునకు, మీ సాంప్రదాయమునకును, వేదప్రమాణమేమైనం గలదా?'' అని పృచ్ఛించెను. అందులకు యతిరాజు ''మనస్వీ! మీకెన్ని ప్రమాణములు వలయునో, అన్నిప్రమాణములు చూపించెద. వినుడు.'' అనిపలికి శ్రుతిస్మృతీతి హాసములందుగల బలవత్ప్రమాణముల వరుసగా గంభీరముగా నుపన్యసించెను. యాదవ ప్రకాశుడు వానినన్నింటి నాలకించి, ఆశ్చర్యధుర్యుడై ''యతివరా! మీ రుపన్యసించిన విషయములన్నియు యథార్థములు. నేనును అద్వైతమును విడనాడి, మిమ్మాశ్రయించి, మీ శిష్యకోటిలో చేరవలయునని యేతెంచితిని. అందుల కంగీకరింపుము'' అని వినయమున పలికెను.

యతి సత్తముండు ''బ్రాహ్మణవర్యా! మీర లద్వైత సన్న్యాసులు. తన్మతానుసారము, శిఖా, యజ్ఞోపవీతములు పరిత్యజించితిరి. అవి తీసివైచిన విప్రునకు బ్రహ్మత్వము నిలువదనియు, దానికై ప్రాయశ్చిత్తముగా భూప్రదక్షిణ మాచరింప వలయుననియు, శాస్త్రములు ఘోషించుచున్నవి. మీరలా వృద్ధులు, మీరా కార్యమొనర్ప సమర్థులుకారు. ఎట్లు?'' అని సందేహించెను.

యాదవప్రకాశు లావాక్యములను విని, ''యతీశ్వరా! మీ మాటలు సత్యబద్ధములు. కాని, ఎవ్వవి ఫణామండలాగ్రంబున, ఈ అఖండ భూమండ లమ్ము ఆవగింజవలెనుండెనో? అట్టి శేషావతారుండవగు నీకు ప్రదక్షిణించెద. అట్లొనర్చిన భూప్రదక్షిణ మాచరించినట్లేకద'', అని వచించి, యతి మూర్ధన్యుని చుట్టును తిరిగి, జోతలిడి కూర్చుండెను. యతిసత్తము డది చూచి, ''ఈయన మనస్సు పరిపక్వదశకు వచ్చినది. ఈతనిని గ్రహింపవచ్చును'' అని తలంచి, యొక శుభదినమున, పంచసంస్కారాది హితములన్నియు నాచరించి, శిఖాయజ్ఞోప వీతములనుంచి, గోవింద దాసనెడి దాస్యనామముంచి, యీ మతానుసారముగా

నొక గ్రంథమును రచింపుమని కోరెను. అందుల కాత డంగీకరించి విశిష్టాద్వైత మతానుసారముగా నొక లక్షణ గ్రంథమును రచించి కృతకృత్యుడయ్యెను.

శ్రీరంగమునందు రంగవాసులంద ఱాలోచించి "మహాపూర్ణులు కాంచీనగరమ్మున కొంతకాల ముండియు, యతిరాజును తీసికొని రాజాల డయ్యెను. ఏ యుపాయముచే నాతని నిచ్చటకు రప్పింపగలము ?" అని చింతించి, యామున మునికుమారుండగు వరరంగ గురునిజూచి "ఆర్యా! మీరు సత్యవ్రత క్షేత్రమునకు పొండు. మీ స్తుతిగానముచే వరదరాజును మెప్పింపుడు. వారి యాజ్ఞతో యతిచంద్రు నిటకు తోడుకొనిరండు" అని చెప్పి యొప్పించి పంపించిరి. వరరంగార్యుండు వల్లెయని కాంచీనగరమ్మున కరుగుదెంచి, తిరుక్కచ్చినంబి గారిని కలిసికొని, దేవరాజస్వామి సన్నిధికిపోయి, అనేక విధములగు నాట్యాభినయములతో, దేవతాగాన మాచరించెను. వరదుడు సంతసించి, "ఒరే వరరంగా! నీ గానాదులకు సంతసించితి. అభీష్టమును వేడుకొనుము" అని ఆదేశించెను. వరరంగ గురుడు సంతోషించి "స్వామీ! దేవర వారికి పరితోషము కల్గించుట కన్న వేఱొండు వరము నాకేమివలయు? ఐనను కోరుమనినపుడు, మీదాసుడు వేడకుండుట, స్వరూపహానికనుక వేడుకొనుచుంటి. యతిరాజును నావెంట శ్రీరంగమునకు పంపుడు" అని ప్రార్థించెను.

వరదు డావాక్యములను విని, "రంగా! నాకు రెండు విభూతులున్నవి. ఉభయ విభూతులయందలి యే దివ్యమును వాంఛింపక, నా ప్రాణ భూతుండగు రామానుజుని కాంక్షించితివి. ఇచ్చుట కిచ్చలేకున్నను, మాట తప్పరాదు. అట్లే కొనిపొమ్ము" అని ఆనతిచ్చెను. రామానుజుని రావించి వరదుడు "వత్సా! శ్రీరంగమునకు పోయిరమ్ము. రంగవాసు లెల్లరు నీ రాకకై వేచియున్నారు." నుడివెను. వరదుని ఆనతి తలదాల్చి వరరంగనివెంట రామానుజులు శ్రీరంగమునకు బయలుదేరెను.

రామానుజులు రాత్రింబవళ్ళు నడచిరి. శ్రీరంగమును సమీపించి కావేరీ నీరమ్ముల స్నానమూడిరి. ద్వాదశోర్ధ్వపుండ్రములు ధరించి, భగవచ్ఛాసనమును దీర్చుచు, పురోపకంఠోపవనియం దువసించిరి. వారి రాకను రంగవాసు లెఱింగి, అర్చక పరిచారికా, వాద్యబృంద సహితులై, శఠగోపమును, దివ్యయానమును

ముందుంచుకొని, యెదురువెళ్ళిరి. యతీంద్రులు భగవత్పాదారవిందంబులకు సాష్టాంగవందన ప్రణామంబు లాచరించిరి. పూజారులొసంగు భగవన్నిర్మాల్యము లను గ్రహించిరి. వారందఱును తన్ను పరివేష్టించి రాగా, యతీంద్రులు శ్రీరంగ మును ప్రవేశించిరి.

పరకాల మునీంద్ర నిర్మిత సప్తప్రాకారములనుదాటి, దివ్యగోపురము లను, ధర్మమయ మంటపములను వీక్షించుచు లోన ప్రవేశించి, బృహన్మూర్తి వేంచేసియున్న వేదస్వరూపుండగు గరుడునకు నమస్కరించి, బలిపీఠముకడ శిరంబువంచి, ధ్వజమ్మున కంజలించి, ప్రణవ విమానమ్మునకు ప్రదక్షిణించి, ద్వారపాలకులగు జయవిజయులం గొనియాడి, గర్భమందిరమును జొచ్చి, అందు కోటిసూర్యప్రభాభాసమానుండై హారకేయూర కిరీట కాంచీనూపురాది దివ్యభూషణ విభూషితుండై శ్రీవత్స కౌస్తుభ విరాజమాన విశాలపీనవక్షస్స్థలుండై, దివ్యాంబర పరిష్కృతుండై, శ్రీ భూనీళాది దివ్యమహిషీ సంవేష్టితుండై, దివ్యపాదసరోజ యుగ్మంబుసాచి, సవ్యహస్తము నుపధానముగా తలక్రింద నిడుకొని, వామహస్త మును, బద్ధచేతనులగు మీకు నా పదపద్మంబుల నాశ్రయించుట తక్క వేరు మార్గంబు లేదని లోకస్థులకు తెలుపుచున్నకైవడి చాచి, సహస్రచంద్ర సదృశ ధవళ ఫణామండల మండితశేష పర్యంకంబున దక్షిణాభిముఖుండై శయనించి యున్న రంగధాముని కనులార గాంచెను.

ఆ విధి రంగధామునిగాంచి, పులకించి, వేదాంత సూక్తుల స్తుతించి, సర్వేశ్వర దివ్యావయవములకు మంగళా శాసనము ననుసంధించుచు, వినయ వినమిత గాత్రుడై నిలిచియుండెను. అట్లు నిలిచియున్న యతిలోక సార్వభౌముని, అదర కరుణాకటాక్ష వీక్షణ సుధాలహరుల తేలించి "వత్సా! నీవీ రంగధామమ్ము నందు కలకాలము మా విజయధ్వజీభూతుండవై నిలిచి, యుండుము. పంచభూత మ్ముల సాక్షిగా నీకు విభూతిద్వయముపై సర్వాధికార మొసంగితిని. పరిపూర్ణా యువు ననుభవించుచు, అప్రతిహత ప్రజ్ఞావిశారదుండవై విరాజిల్లుము" అని "ఈ రంగభర్త దీవించి, తీర్థ ప్రసాదముల నిప్పించి, ఆలయాధికారిం బిలిపించి" ఈ యతిరాజున్కని ఒక మహా మంటపంబున విడియింపుము " అని ఆజ్ఞాపించెను. ఆలయాధికారి యతీంద్రు నొక విశాలమంటపంబున విడిది చేయించి, భక్తితత్పర తతో సేవించుచుండెను.

యతీంద్రులు, తన గురు చంద్రులగు మహాపూర్ణులను దర్శించి సాష్టాంగము నెరపెను. వారు యతీంద్రు నాశీర్వదించిరి. తిరుమంగ యాళ్వారు కట్టించిన సప్త ప్రాకారములు, భవ్యమంటపములు, ఉన్నత గోపురంబులు, దివ్యవిమానములు, సౌధములు అన్నింటిని శిష్యునకు చూపించి, వర్ణించి చెప్పిరి. యతీంద్రులు ఆనంద పూర్ణులై రంగేశ్వరు నర్చక పరిచారికా, పరిచారక, శైలూషలేఖక, మాలాకార, వాహకాది పరివారము నంతయును పిలిపించి, "రంగనాధున కేయే వేళల, ఏయే కైంకర్య నిమిత్త, మేయే వ్యక్తులు నియమింపబడిరో, వా రా యా వేళల, ఆయా కైంకర్యముల, నాయా వ్యక్తు లప్రమత్తతతో నిర్వహింప వలయును. లేదా, తీవ్ర దండనార్హులగుదురు" అని శాసించెను. సంవత్సర, అయన, ఋతు, మాస, పక్ష, వార, దిన, పవిత్ర బ్రహ్మోత్సవ వసంతోత్సవాద్యుత్సవంబుల నన్నింటిని నిర్దిష్టకాలంబుల నెరపించుచు, రంగధామమున నివసించి యుండిరి.

శ్రీశైల పూర్ణులు అంజనాద్రీశ్వరుండైన శ్రీనివాసునకు కైంకర్యములు చేయుచుండిరి. ఆయన మేనల్లుడు గోవిందభట్టరు శైవమతావలంబియై కాళహస్తియందు హైమవతీశ్వరు నారాధించు చుండెను. ఆ విషయమును తెలిసికొనిన శ్రీశైలపూర్ణులు, భాగినేయుని మరల వైష్ణవుని చేయందలంచి, కొంతమంది శిష్యులను తీసికొని, తిరుమలనుండి కాళహస్తికి పోయి, పురబాహ్యోద్యానమున విశ్రమించి శిష్యులకు భగవద్విషయము బోధించుచుండిరి.

ఆ సమయమున గోవిందభట్టరు శివపూజార్థమై పుష్పములు సంగ్రహించుకొని పోవుటకు వచ్చుచు, మేనమామయగు తిరుమలనంబి (శ్రీశైలపూర్ణుల ద్రావిడనామము) ని చూచియు పలుకరింపక, అప్రదక్షిణముగా వచ్చి పూవులను కోసికొనిపోయెను. తిరుమలనంబి వాని నొక్కసారి కటాక్షించి, సర్వశేషి యను గ్రహమీ జీవునియం దిట్లుండ నేనేమి సేయగలవాడ? నాతో సంభాషించుటకే నియు నీతని కిష్టములేక యుండెకదా, యని చింతించి, తిరుమలకు తిరిగిపోయెను.

కొంతకాలము గడచెను. మరల తిరుమలనంబి "నా మేనల్లుండిట్లు శైవుండగునని కలలోనైన తలంపనైన తలంపనైతి. మరల కాళహస్తికిపోయి యత్నించెద" నని భావించి, శిష్యులను కొందఱి వెంటతీసికొని, శ్రీకాళహస్తి కేగి, సువర్ణముఖరీ తీరారామమ్మున ఉపవసించి యుండెను. గోవింద మిత్రులు

శివపూజార్థమై పూపులకొఱకు వచ్చుచుండెను. అట్టివేళ తిరుమలనంబి, యామునముని ప్రణీతంబైన స్తోత్రరత్నమునందలి "స్వాభావికానవధికాతిశయేశితృత్వమ్, నారాయణత్వయి నమృష్యతి వైదికఃకః. బ్రహ్మశివశ్శతమఖః పరమస్స్వరా, డిత్యేపితేయస్యమహిమార్ణవ విప్రుషస్తే." అను శ్లోకమును, ఒక పత్రముపై వ్రాయించి, గోవిందభట్టరు వచ్చు త్రోవలో పడవేయించెను.

గోవిందభట్టరు వచ్చుచు, ఆ పత్రమును తిలకించి, శ్లోకమును పఠియించి, "ఆహా! ఈ శ్లోకము నారాయణపర్వత్వమును ఎంత సొంపుగా ప్రతిపాదించుచున్నది." "నారాయణా! స్వభావసిద్ధమై అనవధికమై. అతిశయమై విరాజిల్లుచున్న ఈ విశ్వనియంత్రత్వమును వైదికుడైన వాడెవ్వడు విశ్వసింపడు? బ్రహ్మరుద్రేంద్రాదులందఱును నీ మహిమమను సముద్రమునందలి బిందువులే" అను అర్థముగల ఈ శ్లోక మెంతటి గంభీరమై యున్నది. ఇది యీ వైష్ణవుల చేతినుండి జారిపడి యుండవచ్చును." అని తలంచి తిరుమల నంబిగారిని సమీపించి "స్వామీ! ఈ పత్రము మీకు పనికి వచ్చును. ఈ శ్లోకము మీ దైవమగు విష్ణువున కతిశయమునుగూర్చుచు, పర్వత్వమును స్థాపించుచున్నది. భవానీధవ భక్తులమగు మాకిది నిరుపయోగము. తీసికొండు" అని చెప్పి పత్రము నొసంగిపోయెను. తిరుమలనంబి స్వామి నుద్దేశించి "శ్రీహరీ! ఈ జీవునందు కటాక్ష మింతవఱకు కలిగెనా? మొదటిసారి పల్లెత్తియు పలుకరింపలేదు. ఈసారి, ఈ పత్రము మీకు పనికివచ్చునని యిచ్చిపోయినాడు. మీ యనుగ్రహము లేకున్న నేనేమి చేయగలను?" అని తిరుమలకు మరలిపోయెను.

మరల కొంతకాలము గడచెను. భాగినేయుని విషయము జ్ఞప్తికి వచ్చి తిరుమలనంబి "మేధావియై యుండియు తెలివినంతయును వ్యర్థ మొనర్చుకొనుచు వ్యర్థుడైనాడు. విధికృత్యమును తప్పింప నెవరికి సాధ్యము?" అని నిర్వేదమునంది, మరల నొకపర్యాయము కాళహస్తికి బోయి వచ్చెదనని భావించి, శ్రీనివాస పెరుమాళ్ళనకు నమస్కరించి, "ఓ దయామయా! నామేనల్లుడిప్పుడు "మమమాయాదురత్యయ" అనునట్లు నీ మాయకులోబడి వ్యర్థుడైనాడు. సర్వశక్తుడవగు నీవు గ్రహించినచో, అశక్తులమగు మేమేమి చేయగలము? నీ మాయను తొలగించి నీ పాదసేవకునిగా అనుగ్రహింపుము. సముద్రమును ధరిత్రిగా పృథ్వినబ్ధిగా, మేరువును

మృత్కణికగా, మంటిగడ్డను పర్వతముగా, వజ్రమును తృణముగా, గడ్డిపరకను శతారముగా, సబలు నశక్తుగా, పామరుని మహావిద్వాంసునిగా చేయు నీ సమర్థతకు నమస్సులు. సర్వరూపమగు నీకనేకవందనములు. గోవిందమిశ్రుని నీలీలావిధేయుని చేయక, నీ పాదకింకరునిగా చేయుము. ప్రపత్తి చేయుచున్నాను." అని అనేకవిధముల కొనియాడి, సర్వేశ్వరునియందు శరన్యాసముచేసి, కొంతమంది వైష్ణవులతో కాళహస్తి నగరమునకేగి యొక యుద్యానమున కూర్చుండి, శఠగోపముని ప్రణీతం బగు సహస్రగీతియందలి యొక పాశురమున కిట్లు అర్థమును సెలవిచ్చుచుండెను.

"ఈ విశ్వమంతయు నశించి, జలమయము కాగా, ఆ ప్రళయకాల జలధియందు వటపత్రశాయియైయున్న శ్రీమన్నారాయణుండు, తన్నాభికమలమున చతుర్ముఖుని పుట్టించి, ఆతనివలన ఈ సమస్తసృష్టి కార్యమును నిర్వహించెను. అట్టి సర్వేశ్వరునకు తక్క ఇతరదేవతలకు పూజోత్సవాదులు తగవు. అట్లు చేయువారు వ్యర్థులు."

ఆ సమయమున గోవింద మిశ్రులు, శరీరమునందంతట భస్మమునలంది, రుద్రాక్షలు కొన్నింటిని కిరీటకముగా శీర్షంబున నలంకరించి, హస్తములకు వలయములుగను, కంఠమునకు హారములుగను, కటిప్రదేశమునకు మొలనూలుగను రుద్రాక్షమాలలు కొన్నింటిని చుట్టి లలాటమున తిర్యక్పుండ్రమును తీర్చిదిద్ది, పుటిక నొకదాని ధరించి, తిరుమలనంబిగారి కప్రదక్షిణముగా తిరిగివచ్చి, ఒక బిల్వవృక్షము నధిరోహించి, పంచాక్షరీస్ఫురితాధరుండై, మారేడు దళములు కోయుచుండెను.

శ్రీశైల పూర్ణుల వాక్యములు శ్రవణగోచరములు కాగా, అగ్ని సంపర్కమున కరుగు ఆజ్యమువలె, ఆ వాక్యములచే గోవిందమిశ్రుల మనస్సు మబ్బు విడిచిన ఆకాశమువలె స్వచ్ఛమై ప్రకాశించెను. అనిర్వచనీయానందము మనస్సున తాండవించెను. దానిచే చెట్టునుండి దిగివచ్చి శరీరమునందలి భస్మమునంతయు నార్ద్రవస్త్రముచే తుడిచివైచి, రుద్రాక్షమాలికలను దూరముగా విసరివైచి, తిరుమల నంబి పదపద్మములపై బడి నమస్కరించి, "ఆర్యా! మీరు వచించిన శాస్త్రవాక్యముల నటుండనిండు. మీ సంబధినగు నేనితరదేవతో పాసనచేసిన నందులకు సిగ్గునందుచున్నాను నా అజ్ఞానాంధకారము పటాపంచలైనది. అనుగ్రహింపుడు" అని వేడుకొనెను..

శ్రీశైల పూర్ణులావాక్యములకు సదుత్తర మొసంగక లేచినవాడై తిరుమలకు పోవుచుండెను. గోవింద మిశ్రులాయనను వెంబడించెను. ఇట్లు పోవుచున్న తిరుమలనంబిం జూచి, శైవులు కొందఱు, దండాయుధహస్తులై, "ఓయీ! వైష్ణవుడా! పారిపోకుము. ద్రవిడమంత్రోచ్చాటనముచేసి, మాగురుని తీసికొనిపోవుచున్నావు. అది నీకు తగదు. మా గురుని విడచిపొమ్ము. లేదా? నీకు దేహశుద్ధి జరుగగలదు" అని కేకలు వైచుచు, పరుపుపరుపున వెంటవచ్చుచుండిరి. ఆశైవుల పారజూచి తిరుమలనంబి, "ఓ శైవులారా: మీ గురునితోగాని, మీతోగాని మాకణుమాత్రమైన పనిలేదు. నేను వానిని తీసికొని పోవుటలేదు. మీ గురుని మీరే కొనిపొండు" అని చెప్పుచు పోవుచుండెను.

అపుడా శైవులు, గోవిందభట్టరుంజూచి, "గురూత్తమా. ఈ ద్రవిడవైష్ణవుని మాయకులోబడవలదు. భవానీపతియే సర్వస్మాత్పరుడనియు, శైవమే వేదవిహితమగు మతమనియు, నెన్నో పర్యాయములు, మీరే మాకు బోధించెడివారు. అట్టి మీరే వైష్ణవుల ననుసరించుట పాడిగాదు. తిరిగి రండు" అని వెంబడించిరి. గోవిందభట్టరు శిష్యులగు శైవులపారజూచి, "ఓ శిష్యులారా! ఈ తిరుమల నంబిగారు మాకు సర్వవిధబంధువు. దైవమును. ఈయన నన్ను రావలదని తిరస్కరించినను, నేనాయన యింటిపంచతిన్నెపైనెననుండెదగాని, మరలిరాను. మీరు నన్నుగూర్చి బాధపడవలదు. మీకును మాకును, మధ్యవచ్చిన బాదరాయణ సంబంధ మింతటితో సరి. తిరిగిపొండు" అనివారినిహారించి, తిరుమల నంబినివెన్నాడెను.

తిరుమలనంబి గోవిందుని వెంట నిడుకొని, తిరుమలకుపోయెను. అచ్చట గోవిందునకు పంచ సంస్కారాదిహితములన్నియు ప్రసాదించి, సాంప్రదాయగ్రంథములు చెప్పుచుండెను. గోవిందమిశ్రులు గురువు నన్నివిధముల సేవించుచుండెను.

శ్రీరంగమునందు యతిసార్వభౌములు, మహాపూర్ణుల యొద్ద ద్వయార్థమును, వ్యాససూత్రార్థములను, పాంచరాత్రమును, ఆగమ ప్రమాణ్యమును గ్రహించెను. అందులకు మహాపూర్ణులలరి "వత్సా! మాగురు చంద్రులగు యామునమునీంద్రులు, ఒక్కొక్కశిష్యునకు ఒక్కొక్క విషయమునే బోధించినారు. తిరుమంత్రార్థమును, తిరుక్కోట్యూరినంబికడగలదు. దానినిగూడ గ్రహింపుము" అని అదేశించెను.

ఆ ఆజ్ఞను శిరసావహించి యతిరాజు గోష్ఠీపురమున కేగెను. అందు వసించుచున్న తిరుక్కోట్యూరినంబిగారిని దరిసి, నమస్కరించి "స్వామీ! తిరుమంత్రార్థము నుపదేశింపుము" అని ప్రార్థించెను. గోష్ఠీపూర్ణులు రామానుజుని చూచి, "నాయనా! ఒక్కమాసము రోజులుపవాసముచేసి వచ్చినచో తెల్పెద, లేనిచో చెప్పజాలను" అని చెప్పెను.

రామానుజులు శ్రీరంగమునకు తిరిగివచ్చి మాసోపవాసవ్రతమును నిర్వర్తించి, నంబిగారియొద్ద కేగెను. మరల ఇంకొకమాసముపవసించి రమ్మని నంబి పలికెను. అట్లు పదునెనిమిదిమాసములు గడిపెను. ఎన్ని పర్యాయములు త్రిప్పినను, విసువు చెందక, మాసమున కొకనాడు భుజించుచు, పదునెనిమిదిమారులు తిరిగెను. పదునెనిమిదియవపర్యాయము గోష్ఠీపూర్ణులు (నంబిగారి సంస్కృతనామము) యతీంద్రులను సన్నిధికి పిలిచి," కలియందీమంత్రార్థమును వినుట కధికారి యెవ్వడును లేడని నిశ్చయించి, దీనిని నే నెవ్వరికిని చెప్పలేదు. నీవు నేను చెప్పినట్టు లాచరించితివి. కావున సంతసించితిని. నీకు చెప్పెదను. దానిని నీ వెవ్వరికిని తెలుపవలదు. దీనిని విన్నవారికందఱకు మోక్షప్రాప్తి. మా పూర్వులనుండి దీని నతిరహస్యముగా కాపాడితిమి. నీ వెవ్వరికి చెప్పనని ప్రమాణము చేసినచో నీకు బోధించెద"నని పలికెను.

రామానుజులు ప్రమాణము చేసెను. గోష్ఠిపూర్ణులు మంత్రోపదేశమును చేసెను. దానిని గ్రహించి యతి తల్లజుండు తన మనంబున నిట్లు తలంచెను. "ఈ మంత్రార్థముని గూఢముగానున్న ఈ లోకమున తరించువారెవ్వరు? ఈ కలియుగమున, ఈ విషయమును గ్రహించుటకు, మాసమున కొకతూరిమాత్రము భుజించుచు, పదునెనిమిది మాసములుపవాసము చేయు నోర్పుగలవారలెందఱు? దీనినిట్లే గుప్తముగా నుంచినఫలములేదు. లోకమునందలి సమస్త జనులకు అందుబాటులో నుండునట్లు చేయవలయును." అనివితర్కించి, ఆ యూరిలోని నరసింహస్వామి దేవాలయానికి పోయెను. నరసింహస్వామివారి కపుడు బ్రహ్మోత్సవము జరుగుచుండెను. ఆ ఉత్సవములను తిలకించుటకై వేలకొలది జనులేతెంచియుండిరి. ఇదే సమయమని తలంచి యతీంద్రులా దేవాలయ విమానము మీదికి నెక్కి ప్రజలనుచూచి "ప్రజాసమూహము లారా! అత్యంతకాలమునుండి, గోప్యముగా రక్షించబడిన తిరుమంత్రార్థము

నిపుడు చెప్పెద. దీనిని విన్నమాత్రమునననే జనులకు మోక్షము లభించును. శ్రద్ధకలిగి వినుడు" అని పలికి సర్వులు వినునట్లు బిగ్గరగా గొంతెత్తి మంత్రార్థమును చెప్పు చుండెను. జనులానంద బంధురులై శ్రద్ధగా వీనులవిందుగా, తన్మంత్రార్థామృతమును తనివితీర తమ శ్రవణపుటంబుల జుఱ్ఱుకొనుచుండిరి.

ఈ విషయము తిరుక్కోట్యూరినంబిగారి చెవి చేరినది. ఆయన రామానుజులను పిల్వనంపి, కోపఘూర్ణిత నేత్రకోణుడై మండిపడుచు, రామానుజులు రాగనే ఇట్లు ప్రశ్నించెను." గుర్వాజ్ఞ నతిక్రమించిన వారికేమిగతి?

ఆ ప్రశ్నను విని రామానుజులు "రౌరవాది మహానరకప్రాప్తి తప్ప వేరు గతిలేదు" అని విన్నవించెను.

ఆ సంగతి తెలిసియే యేలయిట్లు చేసితివి? గురువు గద్దించెను. అపుడు రామానుజుడుముకుళితకరసరోజుడై "స్వామి ! ఆ మంత్రార్థమును ఆకర్ణించినవారు మోక్షభాజనులగుదురని, కదా తాము సెలవిచ్చితిరి. నే నిపుడు చెప్పుచుండగా వేల కొలది జనులా అర్థము నాలకించిరి. వారందఱును మోక్షలోకమున పరమానందభరితు లౌదురు. నా కొక్కనికి మాత్రమే నరకలోకగమనము. అన్నిజీవుల నుద్ధరించు కొఱకు, ఈ ఒక్కజీవి, దుర్గతినందినను బాధలేదు. ఈ పరమార్థమును మనస్సున నిడు కొనియే నేను తమయానతిని దాట సాహసించితిని. క్షమింపుడు" అని పలికెను.

యతివరుని విశాలహృదయమునకు గురుదేవుండచ్చెరువొందెను. ఆతని ప్రేమతో బిగియార కౌగిలించుకొని "వత్సా ; నీ యుదారస్వభావము మాకు సిద్ధింప దయ్యె. స్వల్పబుద్ధులమగుటచే మా భావములు సంకుచిత పరిధిలోనే పరివర్తించినవి. అందులకే మే మీ మహామంత్రార్థము నెవ్వరికిని బోధింపక మోక్షగతులగుట కెవ్వరి కిని అవకాశము కల్గింపక, సంకుచిత మనస్తత్వముతో చరించితిమి. నీ విప్పుడీక్షణ మున, నెందఱిని మోక్ష గాములగావించితివో లెక్కింపశక్యముకాదు. ఇది నీకే తగును. ఇది అనితరసాధ్యము. పశుపక్షిమృగాదులకెల్ల ముక్తి నొసంగగల మహా చార్యులు భావికాలమున, రాగలరని మా గురువర్యులు సెలవిచ్చుచుండెడివారు. అది నిన్నుగూర్చియే యనెడి విషయ మిప్పుడర్థమైనది. నీ వొనర్చిన ఈ సత్కృతికి సంతసించితి. శ్రీరంగమునకు పోయిరమ్ము. యాడి ఎంబెరుమానారే" అని కొని యాడి వీడ్కొల్పెను.

యతిరాజులు శ్రీరంగమునకు విచ్చేసి మాలాధరనంబిగారి సన్నిధికేగి "ఆర్యా ! సహస్రగీతికి అర్థము సెలవిండు. తెలిసికొనవచ్చితిని" అని విన్నవించు కొనెను. మాలాధరనంబి సహస్రగీతి కర్థ ముపదేశించుచుండెను. ఒకానొకనాడు మాలాధరనంబి యొకపాశురమున కర్థము చెప్పెను. రామానుజులు వేరర్థమును ప్రతి పాదించెను. మాలాధరనంబికి కోపమువచ్చి "నేను నీకు చెప్పను పొమ్మ" అని కసరి పల్కెను. రామానుజులు 'చిత్తము' అని పల్కి యూరకుండెను.

ఒకానొక శుభవాసరమున, గోష్ఠిపూర్ణులు మాలాధరనంబి యింటికివచ్చిరి. మాలాధరనంబివారికి సమస్త సత్కారము లాచరించెను. మాటల సందర్భమున గోష్ఠి పూర్ణులు "మాలాధరా ! రామానుజులకు ద్రవిడవేదార్థమేలయుపదేశించుట లేదు" అని అడిగెను. అందులకు మాలాధరుడు "అయ్యా ! నేనొక అర్థమును వచించు చుండ దానికే తాను వేఱొక అర్థమును, కల్పించి వక్కాణించుచున్నవాడు. అది వైశ్వామిత్రముగా నున్నదేగాని, సంప్రదాయానుసారముగా లేదు. అందువలన బోధించుటలేదు." అని సమాధానమొసంగెను. అపుడు గోష్ఠిపూర్ణులు "మహాత్మా! మీరీవిషయమున చాలా పొరబడితిరి. మనము రామానుజులకు గురువుల మగుటమన అదృష్టము. రామకృష్ణులకు, వసిష్ఠసాందీపనులు, గురువులైరికదా! అట్టిదే మన సంబంధమును. ఆ పాశురమునకు రామానుజుడునుడివినదే సరియైన అర్థము. యామునమునులును తొలుత మీరు చెప్పిన అర్థమును విశదీకరించి, మరల రామాను జుడు చెప్పిన అర్థమును చెప్పి, రెండవదియే సరియైన అర్థమని నిర్ధారించిరి. ఆ అర్థ మును బోధించు వేళ తమరు గురుసన్నిధిని లేరు. మే మందరమును వింటిమి. మరల రామానుజుని ఆహ్వానించి బోధింపుడు" అని తెలిపి వెడలిపోయెను.

మాలాధరనంబి చాల విస్మయమందెను. రామానుజుని పిలిపించి ద్రవిడ వేదార్థమును సమగ్రముగా నుపదేశించెను. ఈ విధముగా సమస్త రహస్యార్థములను అవగత మొనర్చుకొని, వైష్ణవమత సిద్ధాంతపాలన మొనర్చుచుండ అనేకులాయన శ్రీ పాదములాశ్రయించుచుండిరి. స్త్రీలు సైతమాసిద్ధాంతానుయాయులై వైష్ణవ మతమున చేరుచుండిరి. వారి శిష్యసంఘములతోను, వారిమహిమలను విని దర్శింప చనుదెంచు జనసమాజములతోను, శ్రీరంగము మిక్కిలి జనసమ్మర్దము కలది యయ్యెను. లోకరక్షణార్థమై వైకుంఠగద్య, శ్రీరంగగద్య, శరణాగతగద్య అను

మూడు వచనగ్రంథములను రచించి, రంగనాథస్వామివారికి కైంకర్యములను యథా నిర్దిష్టముగా జరిపించుచు, మంత్ర తంత్రలోపములు తటస్థించిన, తత్కారకులగు నర్చకుల శిక్షించుచుండిరి. ఒక దురాత్ముడగు పూజారి, తచ్ఛిక్షకుసహింపక భార్యతో "ప్రతి దినమును, రామానుజులు భిక్షాటనమున కరుగుదెంచు. మనయింటిం వచ్చినపుడు విషపూరితాన్నము నొసంగుము. స్వామి పూజావిషయమ్మల మమ్మ మిక్కలి దండించుచున్నవాడు. నీవు నా వాక్యానుసారము చేయనిచో నేను నిన్ను హత మార్చెద"నని చెప్పి ప్రతిదినమును, రామానుజాగమనమునకై ప్రతీక్షించుచుండె,

ఒకనాటి మధ్యాహ్నకాలమున యతిరాజు భిక్షాటనమునకు పర్యటించుచు అదే అర్చకుని దేహళికరుదెంచెను. అర్చకుడొక బండనుగైకొని, భార్యను బెదరించి. తాను చెప్పినట్లు చేయుమని నిర్బంధించెను. ఆ మహాసాధ్వి రామానుజుల దివ్యప్రభావ నెఱుంగును కావున, విషాన్నమిడుటకిచ్ఛగింపక, భర్త తన్ను బాధించునను, భయముతో విశామిశ్రితసాదము నొకపాత్రమున తీసికొనివచ్చి, జోలెనందువైచి, దుఃఖించుచు, పాదాభివందనం బాచరించి, పాదముల పైనఖములతోనేదియో వ్రాసి ఇంటిలోనికి వెడలిపోయెను. సకల విషయవేదియగు యతిరాజు, ఆమె పరిస్థితినంతయును గమనించి, ఆ మహాసాధ్వియేదియో, విశేషమును, నఖములచే, తనపాదములపై వ్రాసినదని చింతించి, ఆమె యొసంగిన యోగిరమునందేదియో, విషముండ వచ్చునని యూహించి, ఆ అన్నము నొక శునకమునకు వేసెను. ఆ ఆహారమును భక్షించిన వెంటనే ఆసారమేయము మరణించెను. ఆ కూటిని కావేరియందు పారవైచి, స్నాన మాచరించి, మఠమునకు చనుదెంచెను. అది మొదలు మూడుదినములు కేవలము, ఉదకపానముచే దేహయాత్ర నడుపుచుండెను. ఆయన ఉపవాసము చేయుచున్నయు దంతము గోష్ఠీపూర్ణులకు తెలిసెను. వెంటనే ఆయన శ్రీరంగమునకు వచ్చి కావేరీ మధ్యభాగమ్మునని నిలిచి, రామానుజునిరమ్మని వర్తమానమును పంపెంచెను. వెంటనే రామానుజులు బయలుదేరివచ్చి నిలిచియున్న గురూత్తముని పాదములకు సాష్టాంగ వందనం బాచరించెను. అది మండువేసవి. వైశాఖమాసము. మధ్యందిన మార్తాండుండంబరమధ్యగతుండై సమస్తజంతు సంతానమ్మును తనవాడి మయూఖములచే తప్తము కావించుచుండెను. ఖరకిరణుని తీవ్రతాపమ్ముచే భూమి కాలిన యినుప పేనము వలెను, ఇసుక బాగుగా కాలి కుమిలినకుమ్మవలెను, భగ్గున మాడిపోవు చుండెను. ప్రణమిల్లిన పరివ్రాట్చక్రవర్తి శరీరము కాలి బొబ్బలెక్కుచుండెను. గురుడుమాత్రము లెమ్మని ఆనతీయలేదు. గురుచంద్రుల పాదములకు పావుకోళ్ళుండు

టచే ఆయనకు వేడి బాధలేకుండెను. రామానుజుల శిష్యులు చుట్టును నిలుపబడి తప్ప గురుపునకు కల్గిన బాధకు వేసన పడుచుండిరేగాని, యేమిచేయుటకును వారికి పాలు పోలేదు.

రామానుజుల శిష్యులలో ప్రణతార్తిహరుడను వాడుకలడు. రామానుజుల స్థితికి కాతని హృదయము పండిపోయేను. ఆతడు దుఃఖించుచు, గోష్ఠిపూర్ణుల నుద్దేశించి "ఓయీ! పురశ్చూడబ్రాహ్మణుడా ; ఏడనుండి వచ్చితివి? అన్యాయముగా మా గురుచంద్రుని నీ పొట్టను బెట్టుకొంటివే? దయావిహీనా! ఇట్టి నీపు మా గురుల కెట్లు పందనీయుండవైతివి? చాలు చాలు" అని నిందించుచు, తాను యతిరాజు శరీరము క్రిందదూరి, గురుపును తనపైకి లేపుకొని, తానా యిసుకపై పడియుండెను. అపుడు గోష్ఠిపూర్ణులా యిరుపురను, లెండని యాజ్ఞాపించిరి. పైకిలేచిన రామానుజుని కౌగిలించుకొని, గోష్ఠీపూర్ణులు "శరీరం వసువిజ్ఞానం, వాసఃకర్మగుణానసూన్, గుర్వర్థంధారయేన్నరః" శరీరము, ధనము జ్ఞానము, సర్వమును, ప్రాణముల నెవ్వడు గురుపునకు సమర్పించునో, అట్టివాడే శిష్యుడు" అను శాస్త్రవాక్యమున కాధారభూతుడై, యీ ప్రణతార్తిహరుడు నిల్చినాడు. ఈతడు నీకు విశ్వసింపదగినశిష్యుడు. ఈతనిచే పంటచేయించుకొని తినుము. నీ కట్టిబాధయుగాదు." అని ఆదేశించి, మరలి పోయేను. ఆ దినము మొదలుకొని యతిరాజచంద్రులట్లే అనుష్ఠించుచుండిరి.

ఒకనాడు రామానుజులు రంగేశునిసన్నిధికేగిరి. ఒక అర్చకుడు తీర్థమున విషముకలిపి, దానిని రామానుజులకీయ తీసికొనివచ్చి సందేహించి యూరకుండెను. అపుడు రామానుజులు "అర్చకా; స్వామి పాదతీర్థము నొసంగుటకు సందియమందుచుంటివేల?" అని ప్రశ్నించెను. అతడు "స్వామీ! యీ తీర్థమున విషము కలిపితిమి. దానిని మీకిచ్చుటకు మనస్సొప్పలేదు" అని ప్రత్యుత్తర మొసంగెను. "ఐనచో ఈ తీర్థమే రంగనాధునకు నివేదింపబడినదా?" అని రామానుజులు ప్రశ్నింప ఆతడు ఔనని సమాధాన మొసంగెను. అపుడు రామానుజులు "దైవనివేదనమైనది కనుక అది అమృతమైనది, ఇమ్ము." అని తీసికొని, భక్తితో మూడు పర్యాయములు స్వీకరించెను, ఆ విషము రామానుజునియందు శక్తివిహీనమయ్యెను. తానే విషధరుడట. అట్టివానికీ విషమొకలెక్కలోనిదా? ఆ సన్నివేశమును దర్శించినది మొదలు, అర్చకులు పరిచారకులు, మొదలగువారందఱును, సాక్షాద్రంగేశ్వరుదే రామానుజరూపమున భూమికవతరించెనని యెంచి, భయభక్తివినయప్రపన్నులై వర్తింపజొచ్చిరి.

యజ్ఞమూర్తి యను అద్వైతపండితుండొకండు కలండు. ఆతడు లోకము నందలి పండితుల నెల్లజయించెను. రామానుజప్రభావం బాకర్ణించి, ఒకనాడు శ్రీరంగ మునకు వచ్చెను. ఆతడు రామానుజుని సమీపించి "నీతో వాదింపనే తెంచితి. జీవేశ్వరు లకు భేదమును వచించుచున్నావట. ఆ విషయము వినివచ్చితిని. శాస్త్రవాదమునకు సిద్ధము కమ్ము" అని వాదమునకు పిలిచెను. "అట్లే వాదించెద? దానివలన ఫల మేమి?" అని రామానుజుండడిగెను. అందులకాతడు "ఓడినయాతడు గెలిచినవానికి శిష్యుడగుటయే ఫలము" అని అద్వైతి మారుపలికెను. రామానుజులు సమ్మతించిరి. పదునెనిమిది దినములలో వాదము పూర్తికావలయునని నియమము చేయబడినది. రంగరాజస్వామివారి యెదుట నిద్దరును వాదమున కారంభించిరి. వారిరువురును మత్త మాతంగములవలె, సింహకిశోరముల పగిది పదియారుదినములు సరాసరి హోరా హోరి పోరాడిరి. పదునేడవదినమున అద్వైతిప్రశ్నకు రామానుజులు సమాధాన మొసంగలేక, రేపు చెప్పెదననెను. అద్వైతి యంగీకరించి గృహమ్మున కరిగెను. యతిరాజు తన మఠమునకుపోయి, వరదరాజస్వామికి నైవేద్యమును చెల్లించి, తాను భుజింపకయే పరుండెను. స్వప్నమున వరదుడు సాక్షాత్కరించెను. "రామానుజా నీ దిగులునకు కారణమేమి?" అని అడిగెను. "స్వామీ! మీకు తెలియనిదేమికలదు? బోధాయనటంకగుహదేవభారుచిద్రమిడాచార్య శఠగోపనాథయామున ప్రభృతి మహా పురుషులు స్థాపించి వ్యాపింపజేసిన విశిష్టాద్వైత సిద్ధాంతము, నా అజ్ఞతచే నీనాడ స్త మింప బోవుచున్నది. అద్వైతిప్రశ్నలకు సమాధాన మొసంగజాలకపోయితిని. ఇది విచారింపదగిన విషయముకాక, సంతోషింపదగిన దెట్లగును?" అని రామానుజులు డగ్గుత్తికతో వచించెను. తేవప్పెరుమాళ్ళందులకు చిరునవ్వు నవ్వి "రామానుజా! నీ యంత వానిని నీకు శిష్యుని చేయదలంచి యిట్లు చేసితిని. యామునముని రచించిన మాయావాద ఖండనమును చూడుము." అని తెల్పి అదృశ్యుడయ్యెను.

వెంటనే శిష్యులు వెలిగించిన దీపశిఖకాంతిలో ఆ గ్రంథమును రామాను జులు పఠింపసాగిరి. అద్వైతి అడిగిన ప్రశ్నలకేకాక, అట్టి సహస్రప్రశ్నలకు, అందు తగు సమాధానములు వ్రాయబడియుండెను. వాని నన్నింటి కరతలామల కము లొనర్చుకొని గ్రంథమును పదిలపఱచి, స్నానమొనరించి, కాషాయవసనంబులు ధరించి, జంతుపాప పర్వతచ్ఛేదన సమర్థంబగు త్రిదండకులిశమ్మును ధరించి, అపర

దత్తాత్రేయుని భంగిపచ్చుచుండెను. అంతకుమునుందే ఆస్థానమంటపమునకు వచ్చిన యజ్ఞపురుషుడు దూరమునందే రామానుజులనుచూచి, వారి దివ్యకాంతియు, తన్ముఖ సౌలక్షణ్యమును, మనోహరాకారరేఖయు, విమర్శించి, "నన్నేయననేల? ఈయతి రాజు వాగీశుని జయింపగల సమర్థుండు, గంగాప్రవాహసదృశవాగ్ధోరణీసమన్వితుడు. ఇట్టి మహనీయునకు శిష్యుడనగుటకన్న ఫలమేమి కావలయు"నని మనంబున తర్కించి, ఎదురుపోయి రామానుజుని పదపద్మములపైబడి, చేతులు జోడించి, "స్వామీ! శిష్యుడనైతి. అనుగ్రహింపుడు" అని మనవి చేసికొనెను.

రామానుజు లాతనింజూచి, "వత్సా! నిన్న నీవడిగిన ప్రశ్నలకు సమాధానము లీయనైతి. నీ వాక్యములే మిగిలియున్నవి. వానిని పూర్వపక్ష మొనర్చి నేను నా మతమును స్థాపించినపుడుకదా నాకు జయము. ఇట్టిదేదియు జరుగకమునుందే శిష్యునిగా నిన్ను పరిగ్రహించుట యెట్లు?" అని పల్కెను.

అందులకాతండు "స్వామీ? అవసరములేదు మీ వదనారవిందమే చెప్పుచున్నది. నిన్న నేనిచ్చిన ప్రశ్నలే నావాదమునకంతము. ఇక మీతో వాదించుటకు నా యొద్ద విషయపటిమ మిగులలేదు. నేను మిమ్మడిగినవానికేకాక, అట్టి ప్రశ్నలకు వేయింటికైన తగు నుత్తరము లీయగలరని నా మనస్సు ప్రబోధించుచున్నది. కరుణింపుడు." అని అద్వైతిమారు పలికెను రామానుజులు హర్షించిరి. తన మతమునకు గొంపోయిరి. పంచసంస్కారాది విహితములన్నియు నాచరించిరి. ఉపవీత శిఖాత్రిదండకమండలు ముఖ్యపరికరముల నిప్పించిరి. దేవరాజమునియను నామధేయము. కావించిరి. ఆయనకే అరుళాళప్పెరు మాణ్ణాం ఎరుమానారు అనునది అరవనామము ఆతనికి మహాప్రేమతో భుక్తశేషము నొసంగిరి. వేరొకమఠమును నిర్మింపించి, దానియందు దేవరాజమునినుంచి "మనమిద్దఱమొకచోటనుండుటకన్న వేర్వేరుగా రెండుచోట్లనుండి భగవద్విషయములను లోకమునకు బోధించుట లెస్స" అని చెప్పి పంపెరి.

ఇతరప్రాంతములనుండి, అనంతసూరి మున్నగువారు పంచసంస్కారమును పొందుటకై రామానుజుల కడకు వచ్చిరి రామానుజులు వారికి దేవరాజముని చేతనే పంచ సంస్కారాదికార్యములు చేయించెను. ఈ విధముగా నిద్దఱును, రెండు మఠముల యందుండి వైష్ణవ సాంప్రదాయములు విశ్వవ్యాప్తము కావించుచుండ, రంగధామము, వైకుంఠధామమై విరాజిల్లెను.

ఒకదినమున మహీసారక్షేత్రమునుండి, కొందఱు వైష్ణవులు శ్రీరంగమునకు వేంచేసిరి. వారికి రామానుజ మఠమెచ్చటనున్నదో తెలియదు. అటనున్న వారిజేరి, "అయ్యా? ఎంబెరుమానారు మఠమెచ్చట?" అని యడిగిరి. అందులకు వారు "ఏ ఎంబెరుమానారు మఠము మీకు కావలయును?" అని తిరిగి ప్రశ్నించిరి. అపుడా వైష్ణవులు లక్ష్మణదేశికేంద్రుల మఠమని తిరిగి బదులు పలికిరి. అట నున్నవారు త్రోవజూప, వారు తన్మఠమునకు బోయిరి. ఈ విషయము దేవరాజమునికి తెలిసినది. వెంటనే ఆతడు తన మఠమునకు నిప్పునంటించి రామానుజులయొద్దకు బోయి ఆ విషయమును తెల్పెను. "నీ వేలమఠమును తగులబెట్టితివి?" అని రామానుజు లడిగెను. "అయ్యా ! నేను గురుదేవులరైన మీ కెదురైతిని. ఏ ఎంబెరుమానారు మఠము? అని ప్రజలు తెలిసికొనవలసిన అగత్యమేర్పడినది. నా మఠము లేనిచో ప్రజల కిట్టి యిబ్బందులుండవుకదా! అని తగులవైచితిని." అని దేవరాజు బదులు చెప్పెను. అపుడు రామానుజులు దరహసితవదనులై "వత్సా ! నా మనస్సు బాధ పడినపుడుకదా నీకు స్వరూపహాని. జరిగినదానికి వగచి ఫలమేమి? ఈ మఠమునందే యుండి, రంగరాజస్వామి కర్చనగావింపుము" అని పలికిరి.

ఇట్లుండ నొకనాడు అనంతసూరిని పిల్చి రామానుజులు "నాయనా? నీవు తిరుమలకేగి శ్రీనివాసపెరుమాళ్లునకు పుష్పకైంకర్యమొనర్పుము. సర్వేశ్వరవిషయమున, పుష్పకైంకర్యమునకన్న మిన్నయగు కైంకర్యములేదు. తొల్లిమాల్యములకు సంతసించియేకదా; మాలాకారునకఖండసంపదల ప్రసాదించి; తుదకు మోక్షపదవి నొసంగెను." అని సెలవిచ్చిరి, అంతట సూరి సకుటుంబముగా తిరుమలకరిగెను.

అచ్చట సూరి బృహద్బృందావనమును పెంచెను. అంజనాద్రీశునకు పూలదండలు సమర్పించుచుండెను. ఇట్లుండ నాతనికి తిరుమల యందొక శాశ్వత కైంకర్యమును నిర్వర్తింప నిచ్ఛజనించెను. ఆ కొండపై దేవళమునకు పడమరగా నొక కొలను త్రవ్వుటకు ప్రారంభించెను. తాను త్రవ్వి ఆ మట్టిని పల్లికలో వైచి; ఆ తట్టలను దారపుత్రుల నెత్తికెత్తుచుండెను. వారు మహానందముతో దైవకార్యమును చేయుచుండిరి. ఇట్లుండ భార్యకు నవమాసములు నిండెను. గర్భాలసత్వముచే మట్టితట్టలు మోవలేకయుండెను. కాని భగవత్కైంకర్యమను భావనతోనట్లే శ్రమపడు

చుండెను. భర్త వారింపడు. ఒకనాడామె బరువు తట్టను తలపై నుంచుకొని, గట్టు నెక్కలేక మెల్లగా పోవుచుండెను. అపుడొక వైష్ణవబాలకుండు అచట కరుగుదెంచి, "తల్లీ నీవు బాధతో గట్టు నెక్కలేకున్నదానవు, నా కెత్తుము. నే నందుకొనియెద"నని పల్కెను.

ఆమె నిరాకరించుచున్నను వినక ఆతడెదురందుకొని,మట్టిని పైని పోయుచుండెను. అపుడనంతుడు భార్యా మణింజూచి "దేవీ! ఇంతకు మును, చాల ఆలస్యముగా వచ్చెడిదానవు. ఇపుడు త్వరితముగ వచ్చుచున్నావు. కట్టమీపకుపోవుట లేదా? మట్టి నెచ్చటపోయుచుంటివి?" అని ప్రశ్నించెను. అందులకామె "స్వామీ! ఎవ్వడో వైష్ణవబాలుడెదురందుకొనుచున్నవాడు. అందుచే వేగముగా వచ్చుచుంటిని" అని బదులు చెప్పెను. "ఏమేమీ! వైష్ణవబాలకుడా? ఆతడుచేసికొనవలయునని నెన్నికైంకర్యములులేవు? మనము చేయు నీ కైంకర్యముననే ఆతనికి పాలుకావలసి వచ్చెనా? ఏడీ! చూపింపు" మని అనంతుడాగ్రహముతో గడ్డపలుగును పట్టుకొని వచ్చుచుండెను. ఆ బాలకుడు మట్టిని క్రుమ్మరించివచ్చుచుండెను. ఆ బాలుని చూచి అనంతుడు "బాలకా! నా కైంకర్యమున భాగము పొందవలయునను దుర్బుద్ధి నీకేల? వేరొక కైంకర్యమును కావించుకొమ్ము. పొమ్ము. పోకుంటివా, యీ గడ్డపలుగు మద ముతో నొక్కపోటు పొడిచెద"అని పలుగు వెనుకకు త్రిప్పిసారించి పొడిచెను. ఆ బాలకుడు పలుగునకు తట్టనడ్డము పెట్టి "ఆహా! పుణ్యమునకు బోవపాప మెదురైనది. అయ్యో పాపము, పిల్లలును, ఆమెయుశ్రమించుచున్నారని జాలితో సాయము వచ్చిన వానిని నన్ను హింసింతువా? ఇది నీకే తగిబోయినది." అని పలుకుచునే అదృశ్యు డయ్యెను. అపుడా పుణ్యదంపతులు "అయ్యో! మనమెట్టి అజ్ఞులము. వచ్చినవాడు శేషాద్రి శయనుండు. ఆతనితో తట్టలు మోయించితిమి. గడ్డపలుగుతో పొడువ బోయితిమి. మనవంటి నీచులీయుజ్జగంబుల వేఱుగా నుండరుసుమీ"యని విషాద పడుచు వృషాచలేశ్వరుని ధ్యానించుచు, నింటికిపోయిరి. రేయిగడచినది. ఉదయము కొలను త్రవ్వుటకు సర్వసన్నాహములతో వచ్చిరి. వారు త్రవ్విన ఆ చెఱువు మహా గాథమై. జలసమృద్ధమై, పుష్పతరంగితమై మహాగంభీరముగా నుండెను. వారు "శ్రీనివాసుండు, వాత్సల్యజలధి మనశ్రమ చూడజాలక యీ విధముగా సంకల్ప మాత్రముననే సరస్సు సృజించెను." అని దైవకృతమున కచ్చెరు వందుచు ఆనందించుచు, మరలి యిరుపునకుంబోయి యథావిధి పుష్పకైంకర్యమును చేయుచుండిరి.

ఒకానొకదినమున అనంతుడు తనయింటిముందు కూర్చుండి దండలు గ్రుచ్చుచుండెను. అపుడు వేంకటేశ్వరుడు "అనంతా! యిటురమ్ము." అని పిలిచెను. అనంతుడు "ఎందులకు?" అని ప్రశ్నించెను. వచ్చినచో చెప్పెదనని వేంకటేశుండు వచింప నేను రానని అనంతుడు నిరాకరించెను. "నీవు రానిచో నేనేమి చేయుదునో తెలియునా ? తదుపరి చూచెదవు లెమ్ము" అని శ్రీనివాసుండు వెడలిపోయెను.

మాలలు కట్టుట పూర్తియయ్యెను. వానిని తీసికొని అనంతుడు స్వామి సన్నిధానమునకు పోయెను. "నేను పిలిచినపుడు రాని నీ పూసరులు నాకేల? తీసి కొని పొమ్ము" అని శ్రీనివాసుండనెను. అనంతుడు వానిని మరల తీసికొనిపోవుచు "నీవు పిలిచినప్పుడు నేనచ్చటనుండి వచ్చినచో పూవుల పరువము తప్పిపోవును. అందువల్ల రానంటిని. "అని సమాధానము చెప్పెను. ఆ మాటలకు వేంకటాచలా ధీశ్వరుడు హసించి, "పిలిచిననాడను నేనేకదా! పుష్పములు వాడిననో కోపింతునా? నా వాక్యములు తిరస్కరించితివి. నిన్నీపర్వతమునుండి వెడలగొట్టింతును. అపుడేమి చేసెదవు? "అని పలికెను. అందులకు సమాధానముగా అనంతుడు "అయ్యా! నీ కోపతాపములతో నాకు పనిలేదు. నన్ను వెడలగొట్టింతువా? కానిమ్ము. నీవు లక్ష్మీ యుతుండవై వైకుంఠమును వీడి, ఈ వేంకటాచలమున పుష్కరిణీ చెంతనున్నావు. నేను నా గుర్వాజ్ఞాబద్ధుడనై వచ్చి శేషాద్రియందు నిన్ను సేవించుచున్నాను. ఈ శేషాద్రి నివాసమునకు నీ కెంత అధికారమున్నదో, నాకును అంతే అధికారమున్నది. నన్ను వెడలగొట్టించునధికారము నీకులేదు. నీ వీ మాలలు ధరించిననేమి? ధరింప కున్ననేమి ? నీ ముఖప్రీతికై నేనీకార్యముచేయుచున్నవాడనుకాను. మద్గురు చంద్రుల దివ్యశాసనానుసారము చేయుచుంటిని. "వాడినపూవులు స్వామికి సమ ర్పించుచుంటివనివటరా? "యని ఆయన నన్ను కోపగించును. అందుచే నేను రాలేదు." అని అనంతుడు పూవులు తీసికొని తిరిగిపోవుచుండెను. వేంకటాద్రీశుడు నవ్వి "అటులైనచో ధరియింతు, ఇచ్చి పొమ్ము. నేను ధరించలేదని రామానుజులకు కోపము రావచ్చును"అని వానిని గ్రహించి ధరించెను.

అనంతుడొకదినమున తోటలో పూవులు కోయుచుండెను. ఒక కృష్ణ సర్పమాయనను కఱచెను. దుష్టసర్పముచేత మైలపడితినేయని చింతించి, పుష్కరి

ణిలో స్నానముచేసి మరల విరులు కోయుచుండెను. అది చూచిన కొందఱు శాస్త్రులు "అయ్యా! పాము కఱచినదికదా! మందు వేయవలదా? కనీసము మంత్రమైన పెట్టింపవలదా?" యని అడిగిరి. అపుడావిరాగి "మందులు, మాకులు మా కెందులకు? పాము గట్టిదయ్యెనా విరజానదీస్నానము, వైకుంఠేశ్వరుని దర్శనము. అది తుట్టెపురుగే అయ్యెనా, ఈ పుష్కరిణిలో స్నానము, వేంకటేశ్వరస్వామి సందర్శనము మాకెక్కడైన నొక్కటియే సుమా" అని మారు పలికెను.

మాతులుండగు శ్రీశైలపూర్ణులవలన రామాయణ రహస్యార్థము లెఱుంగుటకును, అనంతుని పుష్పకైంకర్యమును పరిశీలించుటకును, రామానుజులు తిరుమలకు ప్రయాణమైరి. త్రోవలో దేహళీపురము, మున్నగు దివ్యదేశమ్ములు దర్శించుచు, అష్టసహస్రగ్రామమును చేరిరి. వారికా యూర నిద్దరు శిష్యులు కలరు. యజ్ఞేశుడు. వరదుడు అనునవి వారిపేళ్లు. మొదటివాడు సంపన్నుడు, రెండవ యాతండు దరిద్రుడు. రెండవవాడు గురుభక్తి సంపన్నుడు. యతిరాజులు, యజ్ఞేశుని యింటికి ముందుగా నిరువురు శిష్యులను పంపించిరి. గురువుగారేతెంచినారను విషయమాలకించియు, అతడువచ్చిన శిష్యులనైన ఆదరింపక మిన్నకుండెను. ఆ అనాదరణవిషయమును, ఆ శిష్యులు గురువునకు నివేదించిరి.

"యజ్ఞేశుడు ధనికుడు, ఆదరింపగలడు అని పంపించితిని గాని, వాడు ధనమదాంధుడైయున్న విషయం బెఱుంగ. వరదుడున్నాడు. కాని వాడాగర్భ దరిద్రుడు. మనలనేమి ఆదరింపగలడు?" అని పలికి రామానుజులు "ఐనను, వరదుని, వాని అర్ధాంగ లక్ష్మి కార్పాసారామలక్ష్మిని చూచి, పల్కరించిపోదము." అని శిష్యసమేతులై వరదుని గృహమ్మునకరిగిరి. ఆ సమయమున భిక్షాటనమునకై వరదుడు గ్రామాంతరమునకు పోయి యుండెను. అతనిభార్య గురుసత్తముని దవ్వులనే పారజూచి, తనజీర్ణవసనములతో గురులదర్శించుటకు సిగ్గుపడి గృహములో జొరంబడి, గడియ బిగించి, రెండుచేతులను కలిపి ధ్వనింపజేసెను. సర్వవేదియగు రామానుజులావిషయమును తనదివ్యచిత్తమున నవధరించినవారై తమశిరమునకుచుట్టియున్న శాటిని గృహములోనికి విసరివైచెను. ఆమె ఆవసనమ్మును ధరించి, తలుపులను తెఱచుకొని, వెలుపలకు వచ్చి ఆచార్య పాదాభివందనం బాచరించి, చుట్టునున్నవారి గౌరవించి అందరకును దర్భాసనములు పఱచి వారిని కూర్చుండబెట్టి అర్ఘ్యపాద్యాది విధుల పూజించెను. అపుడు రామానుజుడాయమం జూచి "అమ్మా! వరదుదేమయ్యె?

మేము తిరుమల కరుగుచుంటిమి. మార్గమధ్యమందునగల మిమ్ము చూచిపోవుట కిటు వచ్చినారము. ఇంకపోయి వత్తుము," అనెను.

అంత నా సాధ్వీలలామ, గురుస్వామిని జూచి "ప్రభూ! మీ వంటివారు మాబోటి దీనమానవులయిండ్లకేలవత్తురు ఏదియో మా పూర్వజన్మ కృతపుణ్యంబున మా గృహంబున కరుదెంచితిరి. పిచ్చుగుంటపై గంగ ప్రసరించినట్లు, కుబేరునింటికే పరబ్రహ్మమే తెంచినట్లు మాపైగల అవ్యాజానుగ్రహవిశేషమున వచ్చితిరి. మా జీవనము పావనమైనది. మా వంశము కృతార్థత చెందినది. మీరు మాయింట నాతిథ్యము స్వీకరింపక వెళ్ళినచో మీద మా గడపదాటుసరికి, మా ప్రాణములనంత విశ్వంబున లీనంబగు. మీరేమి ఆతిథ్యమీయగలరందురా? చంద్రుని కొక నూలుపోగు. మీరున్నచోట సర్వేశ్వరుండుండు, సర్వేశ్వరుండు కల్గిన దేశము సర్వసంపన్నము. మాకేమిలోటు? ఆతిథ్యము సిద్ధ మొనర్తు"నని పలికె గురువర్యుని, తత్పరివారమును నిలిపి, గృహాంతరమ్మునకు పోయి, ఆమె తన మనమ్మున నిట్లని వితర్కించెను" ఎంతకాలమునకో యతి సార్వభౌములు, మా గృహమ్మున కరుదెంచిరి. సంసారసాగర మగ్నులై, దిక్కు తెలియక, బాధపడు బద్ధజీవుల నుద్ధరింప సాక్షాత్సర్వేశ్వరుడే ఆచార్య రూపమ్మున అవతరించును. అట్టివారిని పూజించనివాడు శిష్యుడే కాడని శాస్త్రములు చాయించుచున్నవి. మా యింట నొక్కరూకగాని, గిద్దెడు నూకలుగానిలేవు. నా మగని భిక్షాటన మొనర్చియే సోలెడో తవ్వెడో తండులంబులు తేగలడు, ఆ కొలది బియ్యముచే ఈ మహాజనము నెట్లు సత్కరింపదగు, మాన, శరీర సర్వంబులు గురువరునకై యెవ్వండు వెచ్చింపగలండో, ఆతండు నిజమగు శిష్యుండని పెద్దలందురు కావున నే నిప్పుడీశరీరము నితరులకు సమర్పించియైన ఆచార్యవర్యునర్చించెద. ఈ గ్రామము ధనవంతుండగు వైశ్యుండు నన్ను కామించి యెన్నియోపర్యాయములు, తన పరిచారికలవాయొద్దకు పంపించినాడు. అపుడు వానిని తిరస్కరించి, నిందించి, వచ్చినవారిని చీవాట్లు పెట్టి పంపించితిని. ఆతనియొద్దకే యిపుడు పోయి, ఆతనికోర్కె నెరవేర్తునని వాగ్దాన మొనర్చి, గురుసత్కారమునకు వలసిన ద్రవ్యంబు కొనివత్తు వ్యభిచరించుట మహాపాతకము. ఇంటికి వచ్చిన అతిధిని, అందున గురుదేవుని గౌరవింపకుండుటంతకంటెను మహాదోషము. సామాన్య ధర్మమును పరిత్యజించి విశేష ధర్మము నావరించుట యెంతయేని లెస్స. దొంగతనముచే గడించిన ధనముచే శ్రీ రంగనాథుని ప్రాకారగోపురాదులు నిర్మించిన పరకాలుడు సామాన్యుడా? చోర

త్వమున ఆయనకు అఘము సంప్రాప్తించెనా? ఆయన దివ్యసూరులలో నొక్కడై విరాజిల్లుట లేదా? ఏ వృత్తిచే సంపాదించియైనను, భగవద్భాగవత ఆచార్య కైంకర్యము ననుష్ఠించుట పరమ ధర్మోత్తమము."

ఈ విధముగా వితర్కించిన ఆ పతివ్రతాతిలకము ఆ బచ్చునింటికేగెను. అతడామెను చూచినంతనే హర్షపులకితగాత్రుడై "సుందరీ! ఏదియో త్రోవతప్పి వచ్చితి వనుకొందును. ఎన్ని పర్యాయములు పలుకరించినను పలుకవు. చెలులచే చెప్పి పంపిన అంగీకరింపవు. ఏమికారణమున నిప్పుడిచ్చోటికి వచ్చితివి? అనిమోర చూపుల పలుకరించెను.

అపుడాసతీమతల్లి "ఓ వైశ్యశిఖామణీ! ఈ దినంబున శిష్య సమేతుండై గురువర్యుండు మా గృహమ్మున కరుగుదెంచెను. వారిని సత్కరించుట నా విధి. వారి భోజనములకు కావలసిన వస్తువుల నిత్తువేని యీ రాత్రికి నీ యింటికి వచ్చెద. అపుడు నీ కామితమీడేర్చు కొనవచ్చును" అని పల్కెను.

ఆమె మాటల కచ్చెరువందిన ఆ కోమటి "నిజముగా వచ్చెదవా?" అని యనుమానించెను. ఆమె గురునిపై నొట్టుపెట్టుకొని తప్పక వత్తుననియె. వైశ్యుడు నిర్భరానంద పరవశుడై బియ్యము, పప్పు, నేయి, పెరుగు మొదలగు భోజన పదార్థము లన్నింటిని పుష్కలముగా తనకూలీలచే నెత్తిపంపించెను.

ఆమె ఆ వస్తువులను గృహమ్ముననుంచి, అఘమర్షణ స్నానమాచరించి, గురుపరంపరాను సంధానపూర్వకముగా స్తోత్రపాఠములన్నియు పఠించుచు, వంటకారంభించెను. పిండివంటలతో కూడవలయు పదార్థము లవ్వారిగా వండి, భగవదారాధనము నెఱపి "స్వామీ! వంట పూర్తియైనది. వడ్డించెద. వచ్చి భుజింపుడు" అని పిలిచెను.

రామానుజులు శిష్యసమేతులై ఆ పదార్థములనెల్ల ప్రేమమీరనారగించెను, మహాపురుషులకు, పరులభక్తి భావమే ప్రధానముగాని, పదార్థ వివేచనము కాదుకదా భోజనములైనవి. పాదప్రక్షాళనములు ముగిసినవి. ఆమె పఱచిన ఆసనములపై నందరును విశ్రమించిరి. అపుడు వరదుడింటికి వచ్చెను. ఆచార్య తచ్ఛిష్యుల జూచి, అమందానందతరంగిత చిత్తుడై గురుదేవులకు సాష్టాంగవందన ప్రణామంబు లాచ

రించి, గృహమ్ములోనికింబోయి, భార్యం బిలిచి, "వీరినెట్లు సత్కరించితివి ? అని యడిగెను. అపుడామె జరిగిన వృత్తాంతమంతయు పూస గ్రుచ్చినట్లు వివరించెను.

వరదుడు సంతసించి, మనోహరిని బిగియార కౌగిలించుకొని "దేవీ! నీవు నాకులకాంతవేకాదు. మా యిలవేల్పువు. ఇంటికి వచ్చిన మహాఫలమును పోకుండ చేయుగలిగితివి. నిన్ను భార్యగా పొందిన నేను ధన్యుండ. భార్యయే భర్తకు సర్వ విధ బంధువని చెప్పిన సూక్తి సార్థకమైనది. "అని కొనియాడి బయటకు వచ్చి మరల గురులకు పాదాభివందనముచేసి. మిగిలినవారి తగువిధముల నాదరించి చేతులు జోడించి గురువు నెదుట నిలువబడెను.

అపుడు గురుండు వరదుని యోగక్షేమములు విచారించి, అకాలమైనది కనుక భుజించిరమ్మని ఆదేశించెను. గుర్వాజ్ఞాబద్ధుడైన వరదుండు భార్యాసహితుడై గురుభుక్తశేషమును, మహానందముతో తృప్తిగా భుజించెను. వారిరువురు, సంతృప్తులై గురుకరుణా కటాక్షముచే తమకీ అవకాశము లభించినదని మెచ్చుచు, గురు సన్నిధానమున కొలిచియుండిరి. ఆ దంపతులాచార్య భుక్తశేషపదార్థములను, వారి శ్రీపాద తీర్థమును, తీసికొనిపోయి ఆవైశ్యశిఖామణి కొసంగిరి. అతడా పదార్థములను భక్తితో స్వీకరించెను. ఆ ప్రసాదమహిమచే నాతనికి జ్ఞానోదయమైనది. ఆ సాధ్వీమతల్లి కాప్రభావమవగతమయ్యెను. అతడు భయభక్తి వినయ సంభ్రముడై ఆ దంపతులకు మూడు పర్యాయములు ప్రదక్షిణించి, అంజలించి, ఆమెంగాంచి "తల్లీ? నిన్ను సామాన్యస్త్రీగా తలంచితిని. కామించితిని. అనేకాపరాధములు పొనరించితిని. క్షమింపుము. మీరే నా జననీ జనకులు." అని విన్నవించి వారి పాదముల పైబడెను. వారాతనిలేవనెత్తిరి. అతడు పైకిలేచి, మీ గురు సన్నిధానమునకు కొని పొండని వేడుకొనెను. పరుసవేది సోకిన ఇనుము కాంచనమగును. మేఘ సంపర్కమున సముద్రజలము మధురత్వము నందును. ఆ యతీంద్రుని భుక్తశేష ప్రసాదమున ఆ వైశ్యశ్రేష్ఠుని మనస్సు నిర్మలత్వము వహించుటలో నాశ్చర్యమేమి?

ఆ దంపతులు వైశ్యుని వెంట నిడుకొని గురుసందర్శనమ్ము చేయించిరి వారు రామానుజునితో "స్వామీ ! వీనికి పంచసంస్కారాది హితముల నాచరింపుడు

అని అర్థించిరి. కరుణాసాగరుడైన గురుచంద్రుడాతనిని నిజశిష్యకోటిలో చేర్చు కొనియెను. గురుదక్షిణగా నాతడు సమర్పించిన ద్రవ్యమును వరదున కొసంగి అచ్చట వసియించి యుండిరి.

యజ్ఞేశునకీ వృత్తాంతము తెలిసినది. నిరుపేదయగు వరదుండింతటి సత్కార్యలగురునకాచరించుట-ధనవంతుడగు తాను సత్కరింపలేకుండుట. ఈ రెండు విషయములును, ఆతనికి పరితాపహేతువులయ్యెను. వరదుని గృహమునకు వచ్చెను. రామానుజుల పదారవిందమ్ములకెఱగి "స్వామీ! మీ ఆగమన వార్త సోదరశిష్యులచే విని, ఆనందపరవశత్వమున మారుపలుకలేక యూరకుండితిని. మీ కొఱకెన్నియో సత్పదార్థములు సేకరించితిని. మీరు మా గృహమ్మున కరుదెంచి మమ్ము కరుణింపుడు" అని ప్రార్థించెను.

అపుడు యతీంద్రు లాతనింగాంచి "వత్సా! వినుము. వైష్ణవుడ నేను పంచ సంస్కారపరుండననియు, అర్థపంచకము నెఱింగినవాడననియు, అనుష్ఠాననిరతుండననియు గర్వింపదగదు. నిజమగు భగవద్భక్తులు తనయింటి ముంగిటికి వచ్చినచో శక్త్యనుసారము వారికన్నపానాదుల నొసంగి పూజింపవలసియున్నది. రాజు తనను పూజించినవారియందుకంటె, తన పుత్రుని సేవించిన వారియందధికానురక్తుడైయుండును. అట్లే తనభక్తుల కొలిచినచో శ్రీశుండు సంతసించును. శ్రీరాముని గౌరవించి, సుగ్రీవుడు లక్ష్మణున గౌరవింపని కతమున నొక పర్యాయమతనిని వాలిచే తన్నించెను. భరద్వాజుడు రాముని కన్న మిన్నగా భరతుని గౌరవించెను. జగద్రూపియగు జగదీశ్వరుని మనమే రూపమున పూజింపగలము? వారి, కావలసినది భక్తియొక్కటియే. భగవదారాధనమునువలె, భాగవతారాధనమునకు భక్తితో నాచరింపవలె. భక్తిలేని పూజనిష్ఫలము. నిష్ప్రయోజనము నేను పైవభక్తుడనని చెప్పుకొనుచు, భగవద్భాగవతారాధనములు వచ్చినపుడు, ద్రవ్యము నొకయించుక వెచ్చింపక, శుష్కప్రగల్భములు పలుకుట, నింద్యము. భక్తియుక్తుడై యథాశక్తి పరమ భాగవతుల నర్చించుట ముఖ్యధర్మము. ఖ్యాతినిగాని, స్వలాభమునుగాని వాంఛించి యెవండు దానధర్మాదికార్యముల ననుష్ఠించునో, వాని కవ్వి సంపూర్ణ ఫలదాయకములు కావు. అమానిత్వ - అదంభత్వములు - అనగా రాజసము లేకుండుట, దంభములేకుండుట అనునవి రెండును, విజ్ఞానలక్షణములని గీతాచార్యులు ప్రవచించిరి. మీ వంటి దంభయుక్తుల ధనము మాకు అనుభవయోగ్యముకాదు, ఇప్పుడు

నీయింటికి రాను. నేను చెప్పినట్లు భాగవతపూజనము సల్పుచుండుము. తదుపరి వచ్చెద." అని ప్రబోధించిరి. ఆతడెంతయో యేడ్చినను ఫలితము లేకపోయినది.

రామానుజులు వరదునకును, ఆయనభార్యకును చెప్పి వారి నాశీర్వదించి, శిష్యసమేతులై బయలుదేరి, కాంచీపురమును ప్రవేశించిరి. కరిగిరివరదునకు మంగళా శాసనము నెఱపిరి. అనేక దివ్యదేశములు సందర్శించుచు, తత్తద్గ్రామములయందు ప్రతిష్ఠితుడైన సర్వశక్తుండగు జగదీశ్వరునకు మంగళాశంసన మాచరించుచు, తిరుప తిని సమీపించిరి.

రామానుజుల ఆగమనవార్తను విని ఆ దివ్యదేశవాసులు కొందఱెదురు వచ్చి స్వాగతమొనరించిరి. భక్తిభావముతో తిరుపతికి కొంపోయిరి. వారిచ్చు గౌర వాదరంబులు గ్రహించుచు తిరుపతికి చేరిరి. పెరియాళ్వారు మొదలగు పెద్దలు తిరు మలను శేషునిగా భావించి, శేషునిపై పాదములుంచుట అపచారమని యెంచి, ఎవ్వ రును పర్వతము నధిరోహింపలేదు. అందుచే రామానుజులును పర్వతారోహణమున కిచ్చగింపక, దిగువ తిరుపతిలోనే విడిదిచేసిరి. ఈవిషయమెఱింగి శ్రీశైలపూర్ణులు, అనంతసూరి, మున్నగువారును, మరికొందఱు వైష్ణవులును, భాగవతులును కలిసి దిగువ తిరుపతికి దిగివచ్చిరి. యతీంద్రులు శ్రీశైల పూర్ణుల చరణసారసములకు ప్రణమిల్లిరి. అనంత సూరి మున్నగుశిష్యులు తన పదమ్ములకు వందనం బొనరింప, దీవించి వారి యోగక్షేమంబులు విచారించిరి. వృషాచలనాధుని క్షేమాదుల నడిగి అనేక నక్షత్ర పరివేష్టితుండగు హిమధాముని చందంబనుకరించుచు, శిష్యసమేతులై రామానుజులు విరాజిల్లుచుండిరి. యోగక్షేమ సమాచారానంతరము 'నీవేమి పనిమీద వచ్చితివి?" యని శ్రీ శైలపూర్ణులు యతీంద్రుని ప్రశ్నించిరి. "రామాయణ సంప్ర దాయార్థములు మీనుండి యెఱుంగుటకు వచ్చితిని. మీ ఆజ్ఞయైనచొ నుండెద. లేదా శ్రీరంగమునకు మరలిపోయెద"నని రామానుజులు బదులు చెప్పిరి. తిరుమల నంబి సంప్రదాయార్థము లెఱింగించుటకు సంతోషముతో నంగీకరించెను" నేనిట వసించుటకు వీలుకాదు. ప్రత్యుదయమునను, పాపవినాశనమునకుం బోయి, తద్దివ్య తీర్థముం గొనివచ్చి సూర్యోదయాత్పూర్వమే శ్రీశ్రీనివాస స్వామికి సమర్పింప వలయు. నీవు కొండనెక్కవు. ఐనను, అట్లే కొండదిగివచ్చి ప్రతిదినమును పాఠము చెప్పిపోయెద. కానిమ్మ" అని వచించి, శుభదినమును నిర్ణయించి, యుపదేశమున నుపక్రమించెను. తిరుమలనంబి తెల్లవారుఝామున లేచును. పాపవినాశమునకుపోవును.

తీర్థమును తీసికొని సూర్యోదయమునకు ముందే దేవళమున సమర్పించును. పెండ్ల కడ భుజించి, కొండదిగివచ్చి పాఠమును బోధించి సాయం సమయము తిరిగి పోవును. ఈ విధముగా పదునెనిమిది మాసములకు రామాయణము పూర్తియయ్యెను.

ఆ సమయముననే వేంకటాచలనిలయులగు కొందఱు వైష్ణవులు రామాను జుల దర్శించి "ఆర్యా! మీరు కొండమీదకు రావలయును. ఇపుడు కొండపై వేంక టేశ్వరస్వామి కారుమాసములు విష్ణుపూజ. మిగిలిన ఆరుమాసములు శివపూజ నిర్వ ర్తింప బడుచున్నది. పూర్వము రంగదాసనెడు భక్తుడుండెడివాడు.

ఆయన వేంకటాచలమునందలి కోనేటిలో స్నానము చేయనేగెను. అదే సమయమున తత్సరోవరమున దేవకాంతలు జలక్రీడలాడుచు విహరించుచుండిరి. వారి రూపరేఖావిలాసములు కనులారగాంచిన రంగదాసు మనస్సు చలించెను. తరు వాత స్నానముచేసి వేంకటేశ్వరస్వామి దర్శనమున కేగెను. అపుడు వృషాచల వాసుడు రంగదాసుతో "వత్సా; దేవకాంతాదర్శనముతో మనశ్చలనము కలిగిన నీవు రెండవజన్మమున ఆకాశరాజు నామముతో, ఈ పృథ్విని పాలింపుము. అపుడు సమస్త వాంఛిత ఫలమ్ములు ననుభవించి తదుపరి మద్దివ్యధామమునకు రమ్ము" అనిఆదే శించెను.

రంగదాసు ఆకాశరాజుగా జనించెను. అతడఖండ రాజ్యమును పాలించు చుండెను. ఆతనిపై శత్రురాజులు దండెత్తిరి. ఆతడు వెంకటేశ్వరుని శరణుజొచ్చి ప్రపత్తి చేసెను .అపుడు శ్రీనివాసుడు శత్రు నిరాస నార్థముతన శంఖచక్రముల నొసంగెను. ఇచ్చుటయేగాని సర్వేశ్వరుడు గ్రహింపడు కదా; అందువలన శ్రీనివాసు నకిపుడు సుదర్శనపాంచజన్యములు లేవు. భృగుమహర్షి సర్వేశ్వరుని వక్షస్థలమును తన్నినపుడు అలిగిలక్ష్మివక్షమునుండి విడిచివెళ్ళినది. అందువలన వక్షస్థలమున నిపుడు లక్ష్మిలేదు. ఈ పై రెండుకారణములచే కుమారస్వామియని శైవు లాక్రమించి పూజించుచున్నారు. వైష్ణవులును పూజించుచున్నారు. ఇట్లు చాలా కాలమునుండియు జరుగుచున్నది.కావున మీరరుదెంచి అది విష్ణుక్షేత్రమో శివక్షేత్రమో తేల్చవలసినది. ఈకార్యము మీకుతక్క అన్యులకు సాధ్యముకాదు." అనివిన్నవించుకొనిరి.

ఆ విషయమా కర్ణించిన రామానుజులు "ఔరా, ఆదిమాళ్వారు లెవ్వరును ఈ నగరమును, తమపాదముద్రలచే అపవిత్రము చేయలేదు. నే నిప్పుడీ కొండపై

కాలుమోపుట యెట్లు? అని విచారించుచుండగా. అనంతసూరి మున్నగువారు హస్తం బులు మోడ్చి "స్వామీ! మీరీ పర్వతారోహణము చేయకుండిన మాబోటివారికి కూడ నిది వాసయోగ్యము కాకపోవలసి వచ్చునుకదా! ఇక మీరు కాదన్నచో కొండపై తగవు దీర్చువారెవరు? కావున మీరు తప్పక వేంకటాద్రికి రావలయును" అని ప్రార్థించిరి.

రామానుజు లంగీకరించిరి. రెండవదినమున కాళ్ళకు గుడ్డలు చుట్టుకొని కొండనెక్కుటకు ప్రారంభించిరి. మొదటి పర్వతము నధిరోహించి, వాయుపర్వత మును సమీపించిరి. అవిగ్రహించి తిరుమలనంబిగారింజూచి "గురుదేవా? మీరే వానిని తీసికొని రావలయునా? ఎవరైన పిల్లవాడు లభింపడయ్యెనా?" అనెను. అందులకు నంబి "తిరుమల నాల్గువీధుల వరసిచూచితినిగాని కన్నపిల్లవాడు కానరాడు" అని పలి కెను. తిరుమల యందున్నవారెల్లరును తనకు పూజ్యులేయను నంబిగారి భావమును గ్రహించి, వారి చిత్తౌన్నత్యమునకు రామానుజు లచ్చెరువందిరి.

తిరుమలవాసు లెల్లరును రామానుజుల కెదురువచ్చి నమస్కరించిరి. వారి యోగక్షేమంబులు విచారించుచు, భగవద్విషయములు వివరించి చెప్పుచు, వారితోకూడి రామానుజులు ఏడుకొండలధిరోహించిరి. తిరుమలయందుగల నాల్గువీధులందును సౌధ ముల తిలకించి సంతసించిరి. స్వర్ణపుష్కరిణిలో స్నానమాచరించి, ఊర్ధ్వపుండ్ర ముల ధరించి, ఆదివరాహస్వామివారిని దర్శించి,వేంకటేశ్వరుని ధర్మగోపురమునకు జోతలిడి, బలిపీఠమునకు మ్రొక్కులు చెల్లించి, దివ్యమంటప ప్రాకారాదుల వీక్షిం చుచు, సువర్ణరత్నవిరచిత ఆనంద విమానమునకు హస్తములు మోడ్చి,పంచకక్ష్యలు గడచి, అంతరాలయమున జయవిజయులకు నమస్కరించి, చతుర్భుజ విరాజ మానుండై, పద్మపత్రనేత్రుండై, హారకేయూరకిరీట గ్రైవేయక ముక్తాదామ, పీతాంబ రాద్య పరిమిత దివ్యభూషణ భూషితుండై, కోటిసూర్య ప్రకాశమానుండై, బద్ధచేత నుల నాకర్షించుచు, చతుర్విధపురషార్థప్రదుండై, శ్యామసుందర దివ్యవిగ్రహుండై, వేంచేసియున్న అపర్యాప్తామృతదేవుండగు శ్రీనివాసుని పదపంకజయుగళమ్మునకు ప్రణ మిల్లి, పెరి యాళ్వారుగానము చేసిన పది రెండుపాశురములను పాడి,మంగళాశాసనము చేసి నిలువబడిరి.

అట్లు నిలిచిన రామానుజుని జూచి శ్రీనివాసుండు "వత్సా! ఈ యుభయ విభూతులకు అధికారమొసంగితి, గ్రహింపుము." అని పలికి తీర్థప్రసాద శఠగోప ముల నిప్పింపయతీంద్రులు సమ్మోదమందిరి.

ఆ తదుపరి రామానుజులు శైవులను పిలిపించిరి. ఒకే విగ్రహమునకు కొంతకాలము శివపూజావిధానము మరికొంతకాలము విష్ణు కైంకర్యపద్ధతియు తగదని హెచ్చరించిరి. "ఈ తగవు తీరవలయును. అందుల కీతండు హరియో, హరుడో తేలవలయును. అట్లు తేల్చుకొనుట యిరుపక్షములకును క్షేమము. మనమొక పని చేయుదము. ఈ రాత్రి శివచిహ్నములగు శూలము, డమరుకము, విభూతి రుద్రాక్షలు, మొదలగునవి స్వామికొకవైపున నుంచుదము. విష్ణుసాధనములగు శంఖచక్రములు తులసీనలినాక్షమాలలు, తిరుమణి, తిరుచూర్ణములాది గాగల వస్తువులు మరియొక ప్రక్క పెట్టుదము తలుపులు వైచి, గట్టితాళములు వైచి కాపలాకాయుచుందము. తెల్లవారినపిదప తలుపులు తీయుదము. స్వామి శైవ చిహ్నములు ధరించెనా, మీరే ఆరాధించుకొండు. వైష్ణవచిహ్నమ్ముల స్వీకరించెనా, మేము పూజ కొనసాగింతుము" అని పలికెను. ఈ పద్ధతి కుభయపక్షములు నామోదించినవి. నిశ్చయము జరిగినది.

ఆ రాత్రి రెండుతెగలవారును, తమతమ మతచిహ్నములు స్వామికిరువైపులనుంచిరి. ఒకరితాళములపై మరియొకరు తాళములు బిగించిరి. కనురెప్పలు వాల్చక రాత్రి నాల్గుజాములును జాగరూకతతో కాపలాకాయుచుండిరి. అందటి హృదయములును నుద్వేగభరితము లాయెను. తెల్లవారిన నెవరిదేవుడగునో? అందఱును సూర్యోదయముకై నిరీక్షించుచుండిరి. కోడికూసినది. తెలతెలవారుచున్నది. వెలిరేకలు తూరుపుదిక్కున తొంగిచూచినవి. శకుంతసంతానములు కలకల కూజితంబు లొనర్చుచు, గూళ్లువీడి ఆహారార్థమరుగుచున్నవి. రెండుపక్షములవారును, కొంతమంది రాజోద్యోగులను ముందునిడుకొని కోవెల తలుపులు తెఱచిరి. ఆశ్చర్యము. స్వామి వైష్ణవచిహ్నంబులు ధరియించి, కోటి సూర్యప్రభాతసమానుడై ధగద్ధగిత శంఖ చక్ర పరిశోభితుడై విరాజిల్లుచుండెను. శివచిహ్నములచ్చటలేవు. వానికొఱకు వెదకిరి. అవ్వి రెండవప్రాకారమున కావల పారవైచబడియుండెను. వైష్ణవులాడిరి. శైవులోడిరి. వైష్ణవులు పాడిరి. శైవులు చింతించిరి. శైవులాలయమునుండి వెడలగొట్టబడిరి. అప్పటినుండియు వేంకటేశ్వరునకు విష్ణుపూజమాత్రమే జరుగుచుండెను.

యతీంద్రుడు శ్రీనివాసుని సందర్శించి మంగళాశాసనముచేసి,సిండితో శంఖచక్రములు తయారు చేయించి స్వామి హస్తముల కలంకరించెను.

కాంచనముతో లక్ష్మీదేవిని చేయించి, స్వామివక్షస్థలమున పాదుకొల్పెను, శంఖచక్రము లొసంగుటచే స్వామికి యతీంద్రులు గురువులైరి. లక్ష్మి నిచ్చుటచే, మామగారైరి. అనంతసూరి కావించు పుష్పకైంకర్యమునకు మిక్కిలి సంతసించి మూడుదినములుపవసించుచు, రామానుజులు నిలిచియుండిరి.

గోవిందభట్టరు శ్రీశైలపూర్ణులయింటికడ సర్వపరిచర్యలు చేయుచుండెను. ఒకనాడాతడు శ్రీశైలపూర్ణులకు శయ్యను సిద్ధముచేసి, రెండుపర్యాయములా ప్రక్కపై పండుకొని, అటునిటు దొర్లి, లేచి, శయ్యను సరిచేసి వచ్చుచుండెను. అదిచూచిన యోగీంద్రులా విషయము శ్రీశైలపూర్ణులకు నివేదించిరి. శ్రీశైలపూర్ణులు భట్టరును పిలిచి, "గురుతల్పముమీద శయనించిన వానికేమి గతి?" అని ప్రశ్నించిరి. అందుల కాతడు తడుము కొనక "భయంకరనరకమే" అని నిర్లిప్తముగా బదులు చెప్పెను" తెలిసియు నట్లేల చేసితివి?" అని శ్రీశైలపూర్ణులు గద్దించిరి. గోవిందభట్టరు తొణకక "అయ్యా! మీ ప్రక్కపై నేదియైన పుల్లయో పుడకయో చేరిన మీకా రాత్రి నిద్ర పట్టదు. అందులకు నేనే పరీక్షార్థము పండుకొని చూచుచున్నాను. మీకు నిద్రపట్టుట యేనా లక్ష్యము. నేను నరకమున కేగినను లక్షింపను" అని ప్రత్యుత్తర మొసంగెను. ఆ వాక్యములు విని, అందఱును వాని గురుభక్తికత్యంతానందమందిరి.

ఒకనాడు గోవిందభట్టరు వెంటవెంటనే రెండుపర్యాయములు పుష్కరిణిలో తానమాడి వచ్చుచుండెను. రామానుజులది చూచి "గోవిందా? కొలదిసేపటిలోనే రెండు పర్యాయములు స్నానముచేసి వచ్చుచున్నావు. కారణమేమి?" అని ప్రశ్నించిరి. అందుల కాతడు "నేను తొలిసారి స్నానముచేసి తోటలోనికి పోయితిని. అచ్చట నొక త్రాచుపాము బాధతో వేదన చెందుచుండెను. ఇది ఎందులకు బాధనందుచున్నదా? యని పరీక్షించితిని. దాని నోటిలో నొకముల్లు గ్రుచ్చుకొనియుండెను. దానినోరు వాచి యుండెను. దానిని పట్టుకొని ఆ ముల్లు తీసివైచితిని. దానికి బాధ యుపశమించినది. సర్పమును తాకి మైలపడిన కారణమున మరల స్నానము చేసి వచ్చుచుంటి"నని వక్కాణించెను. ఆ మాటలు విని ఆతని సమదర్శిత్వమునకు యతీంద్రుల లబ్బురం పడిరి.

కొంతకాలమునకు యతీంద్రులు శ్రీరంగమునకు పోవలంచి శ్రీశైలపూర్ణుని సెలవొసంగుమని కోరిరి.

అపుడు శ్రీశైలపూర్ణులు, "యతీంద్రా ! నీ శాస్త్రవిశ్వాసమునకు, నీ పాండిత్యమునకు మెచ్చుకొంటి. ఇంతటి నిష్ణాతుడవయ్యును, నా యొద్ద నింత కాలమునుండి రామాయణ సంప్రదాయార్థములు వింటివి. నేను మెచ్చితిని. కావున నేనైన ఈయవలయునని తలంచుచుంటిని. ఏమియీయవలయునో ఎంత విచారించి నను పాలుపోకున్నది" అని పలికెను.

అందులకు యతిరాజు "ఆర్యా ! మీరంత ఆలోచింపవలసిన అవసరము లేదు. మీరీయదలంచినచో ఈ గోవిందభట్టరు నొసంగుడు కొంపోయెద "ననిచెప్పెను. శ్రీశైలపూర్ణులు గోవిందభట్టరును పిలిచి "నాయనా! నీవీయతీంద్రుల వెంటవెడలుము. నేను నిన్నీయన కప్పగించితిని. ఇటనుండియు నీ సంయమి చంద్రులే నీకు గురువు. దైవము. వేయేల? ఆతడే నీ సర్వస్వము. నా యందెట్టి ప్రత్యయముతో నుంటివో, అట్టి విశ్వాశముతోడనే ఈతనిని సేవింపుము. నీకు మేలయ్యెడు" అని వచించెను.

గోవిందభట్టరు గురుచంద్రులకొలచి, సేవించుచు, వారివెంట శ్రీరంగమున కేగుదెంచెను. గురుపరులగు రామానుజులకు "ఎంబెరు మానారు" అను నామము కలదు. గోవిందభట్టరు అందులోని కొన్నివర్ణములు మార్పుచేసి, "ఎంబారు" అని తనపేరును మార్చుకొనెను. అదియే ఆతనికి స్థిరనామధేయమాయెను. గురువే తనకు సర్వరక్షకుడు. ఆతని ఆజ్ఞ దైవాజ్ఞ గురువు సాక్షాత్తు పరబ్రహ్మ. గురువే ప్రపంచము. ప్రపంచమే గురు స్వరూపము. అను విశాలభావములతో ఎంబారు ఎంబెరు మానారునకు అనేకవిధ కైంకర్యము లొనరించుచుండెను. అచిరకాలములోనే గురుభక్తియందద్వితీయ స్థానమును సాధించెను.

కొంతకాలము కడచనెను. ఒకనాడు ఎంబారు మామ శ్రీరంగమునకు వచ్చెను. ఆతడు రామానుజులను దర్శించి, "స్వామీ ; నా పుత్రిక రజస్వలయైనది, గర్భాదాన మొనర్చుటకు మీ శిష్యుండగు ఎంబారును పంపింపుడు" అని వేడుకొనెను.

యమి చక్రవర్తి భట్టరును పిలిచి "వత్సా ! నీ భార్య రజస్వలయైనదట. నిన్నుం గొనిపోవుటకు మీ మామ చనుదెంచినాడు. కావున నీవుపోయి భార్యతో కామ

సుఖంబుల ననుభవించి, కొంతకాలమునకు తిరిగిరమ్మా. పోయిరమ్మా" అని ఆశీర్వ చన పూర్వకముగా ఆదేశించెను. ఎంబారు మామగారితో కలిసిపోయెను.

ఒక శుభముహూర్తమున గర్భాదానమహోత్సవము నిర్విఘ్నముగా జరిగిపోయెను. భార్యాభర్తల నిరువురను ఏకాంతగృహమునకు పంపించిరి. ఎంబారు భార్యతో కూడి శయ్యపై పవ్వళించి, మిధునకార్యమును విసర్జించి, భక్తిజ్ఞాన వైరాగ్యములు బోధించుచుండెను. కొంతకాలమట్లే వసించి, ఎంబారు తిరిగి శ్రీరంగమునకు చేరెను.

ఆత్మజవలన ఈ విశేషము నెఱింగిన ఎంబారుమామ. శ్రీరంగమునకు వచ్చి యతీంద్రులకీ విశేషమును విన్నవించెను. యతీంద్రులు ఎంబారును పిలిచి "వత్సా ! మీ మామగారింట నీవేమిచేసి వచ్చితివి? భార్య భోగయోగ్య. ఆమెతో సుఖింపక వృధాగా కాలమును గడిపి వచ్చుట అవివేకముకదా? మైధున ధర్మమున నిష్టములేనివాడవు కల్యాణము నేలచేసికొంటివి? ఇది తగదు. భార్యతో కొంతకాలము సుఖించి రమ్మా" అని ఆజ్ఞాపించిరి.

ఆ మాటలు విని ఎంబారు "స్వామీ ! ఎట్టి కాముకునకైనను, దాంపత్య సౌఖ్యమననుభవించుటకు నిర్జనస్థలము కావలయునుకదా ! సర్వకాల, సర్వదేశ, సర్వావస్థలయందును మీరే నాకు గోచరించుచున్నారు. ఎన్నివిధముల పరిశీలించినను మీరులేని వివిక్తప్రదేశము నా కెందును కన్పించినదికాదు. అందువలన తత్కార్యమును విరమించితిని" అని సమాధాన మొసంగెను.

ఆ మాటలను విని రామానుజులు "ఔరా ! ఈ ఎంబారు గృహస్థాశ్రమమున కతీతుడు. ఈతనిమనస్సు సర్వేశ్వరాధీనము. "ప్రజహాతియదాకామాన్సర్వాన్ పార్థమనోగతాన్, ఆత్మన్యేవాత్మనా తుష్టఃస్థితప్రజ్ఞస్తదోచ్యతే "అని గీతాచార్యులు ప్రవచించిన ప్రకారమీతడు స్థితప్రజ్ఞుడు. ఏ ఆశ్రమమున నున్న వాడుతదాశ్రమ ధర్మములను పాటింపవలయును. లేనిచోపాపముసిద్ధించునని శాస్త్రములు ఘోషించు చున్నవి. కనుక ఈతడు గృహమేధి కాజాలడు. ఇట్టి విరాగికి భార్యయేల? భవన మేల?" అని ఆలోచించి ఎంబారు మామను పిలిచి "ఈతడు గృహస్థాశ్రమ ధర్మాను

ష్ఠానమునకు విముఖుడు. ఈతని మానసమున ఆపగింజయంతమైనను కామచింత లేదు. జగత్తంతయు బ్రహ్మస్వరూపముగా దర్శించువానికి ఇట్టి తుచ్ఛసుఖములు తృణ ప్రాయములు. కనుక వీనిని వీడిపొమ్ము" అని వానిని పంపించివైచి, ఒక శుభ ముహూర్తమున ఎంబారునకు తురీయాశ్రమ దీక్ష నొసంగెను. ఎంబారు సంతసించి కృతార్థుడ నైతినని తలంచెను. గురుకైంకర్యమును శ్రద్ధతో నెరవేర్చుచుండెను.

ఒకనాడు ఎంబారు ఉదయముననే ఒక వేశ్యాంగనా నివేశ ప్రాంగణంబున కూరుచుండియుండెను. కొందరీర్ష్యాళువులది చూచివచ్చి యతీంద్రుల చెవికడ గుస గుస లాడిరి. ఆశ్చర్యముతో గురుదేవులెంబారును పిలిచి "ఎంబారూ? ఈ యుదయమున అనుష్ఠానాది నిత్యకృత్యము లాచరింపక వేశ్యాగృహమున కేలపోయితివి? నీకు మతి చలించినదాయేమి? అని మందలించెను. అపుడు ఎంబారు "ఆర్యా! ఆఇల్లెవరిదో నాకు తెలియదు. అందెవ్వరో మీ కథలు గానము చేయుచున్నారు. ఆ పాట వినుచు కూరుచుంటిని. ఈ పాటలకంటె ముఖ్యమగు ననుష్ఠానము నాకు మరియొకటి కన్పింపలేదు." అని వక్కాణించెను. ఆయన గురుభక్తి అందఱకు అక్కజమైనది.

ఈ విధముగా యతీంద్రులు సమస్త శిష్య సమూహములతో నుండి, యామునమునుల కోరికమేరకు, శ్రీ భాష్యమును రచింప తలంచి, కూరేశదాశరథ్యాది శిష్యులతో కాశ్మీరమున కేగిరి. అచ్చట శారదాపీఠమునగల బోధాయన మహర్షి బ్రహ్మ సూత్రములకు వ్రాసినవృత్తికోశమును అడిగి తీసికొని శ్రీరంగమునకు వచ్చుచుండిరి. కాశ్మీరవాసులగు కొందఱు పండితులు "కోశమును చూచుట కిచ్చితిమేకాని, తీసికొని పోవుటకు కాదు. అది మనచేయి దాటిపోయినచో మనప్రశస్తియేమి?" అని ఆలోచించి కొంతదూరము వెంబడించి వచ్చి ఆకోశమును తీసికొనిపోయిరి. అపుడు యతి మూర్ధన్య "అయ్యో! బోధాయనవృత్తి లేనిచో భాష్యరచన యెట్లు కొనసాగును? దాని ననుసరించి భాష్యము చెప్పవలసి యున్నది." అని చింతించుచుండ కూరేశులు "గురు చంద్రమా! వృత్తి యెచ్చటకును పోలేదు. మనవెంట వచ్చుచున్నది. దానిని కొనివచ్చునపుడు మార్గమధ్యమున దానినా మూలాగ్రముగా నొక పరితిలకించితిని. దానిని మరల సమగ్రముగా చెప్పగలను. విచారింపక శ్రీరంగమునకు నడువుడు" అని విన్నవించుకొనెను.

శుభముహూర్తమున భాష్యరచన ప్రారంభమైనది. కూరేశుడు లేఖకుడు. రామానుజులు మహావేగముగా చెప్పుకొని పోవునపుడు, తనవాక్ప్రవాహమున దొసంగు

లేవియైన దొరలినవానిని సవరించుటకు యజ్ఞేశుడు నియమితుడయ్యెను. ఎచ్చటనైన ప్రమాదము దొరలినచో వ్రాయున దాపవలసినదని కూరేశునకు హెచ్చరిక చేయ్యబడి నది. గ్రంథాదియందు మంగళాచరణ మొనర్చి కర్మజ్ఞాన భక్తిమార్గములన్నియు, ప్రధానములని చెప్పుచు, వాని యన్నింటియందునను, భక్తియే సర్వశ్రేష్ఠమని రామానుజులు నొక్కి వక్కాణించిరి. సకలదుర్మతములను ఖండించి తనమత సిద్ధాంతమును స్థాపించిరి. మొదటిశ్లోకమునందు "శేముషీభక్తిరూపా"యని ప్రయోగించి సర్వేశ్వరుని యందు తన బుద్ధిభక్తిగామారుగా తమని ఆకాంక్షించిరి. లోకరక్షణార్థమై భాష్యమును రచించి, వేదాంతదీపము, వేదాంతసారము మున్నగు గ్రంథముల రచియించి, గీతాభాష్యమును ప్రపంచించి, డెబ్బదినాల్గు పీఠాధిపతులును, ఏడువందలేకాంగులును, పదిరెండువందల సన్యాసులును, చాలమంది కొత్తియమ్మలు కొలువ శ్రీరంగమున వేంచేసియుండిరి.

ఒక దినమున వారిశిష్యులు గురుమహారాజులం దర్శించి "స్వామీ; లోకోత్తరముగా శ్రీ భాష్యమును విరచించితిరి. దానిని లోకమున వ్యాప్తిచేయవలె. ఈ లోకమున తమరు దిగ్విజయము చేయవలె. భూప్రదక్షిణ మాచరింపవలె. ఇవి మిగిలి యున్నవి. తాను శిష్య సమేతులై బయలుదేరవలెను." అని ప్రతిపాదించిరి.

రామానుజు లంగీకరించిరి. శ్రీరంగరాజాజ్ఞ గైకొనిరి. ఏనుగులు, గుఱ్ఱములు, ఒంటెలు మొదలగు జంతువులు సమస్త పదార్థములను మోసికొని వెంట నడచుచుండెను. వారి చిరుచకాహాళముల నూదుచు కొందఱు అగ్రభాగమున నడచుచుండిరి. సన్యాసులు, ఏకాంగులు, కొత్తియమ్మలు పరివేష్టించి సేవించుచు నడువ, తారకాగణపరివృతుండగు రాకానిశాకరుని చెలువమున ధిక్కరించుచు గురుదేవులు బోవుచుండిరి. చోళదేశమును ప్రవేశించిరి. అచ్చటనున్న పండిత దిగ్గజముల నోడించిరి. వారిని శిష్యులుగా స్వీకరించిరి. వైష్ణవమతమునట సంస్థాపించిరి. అచ్చట నుండి పాండ్యమండలము జొచ్చిరి. అచ్చటనున్న సర్వేశ్వరునకు మంగళా శాసనము నెరపిరి.

కురుకాపురమున ఒక చింతచెట్టుకలదు. ఆ చెట్టుమూలముగ నగలశఠారినె దర్శించిరి. అచ్చట కొందఱు బాలబాలికలు సహస్రగీతిని చక్కగా చదువుచుండిరి. వారింజూచి రామానుజులు "ఆహా! పకుళభూషణుల కరుణావిశేషముచేకదా, యీ పిల్ల

లకు తిరువాయి మొళివచో విధేయమై యున్నది "అని ఆళ్వారుల ప్రభావమును కొని యాడుచు, కురంగనగరమును చేరిరి. అందు వేంచేసియున్న సర్వేశ్వరునకు మంగళా శాసనము చేసిరి. అపుడు సర్వేశ్వరుడు యతిరాజు పరివారమును గాంచి, "యతీంద్రా! ఏడువందలమంది యేకాంగులను, పదురెండువేలమంది సన్యాసులను, ఇతరజన సమూహములను ఎట్లు వశపఱచుకొంటివి? మేము రామకృష్ణాద్యనే కావతారములు దాల్చితిమి. కాని ఒక్కరైనను మా వెంట తిరుగరైరి. రామావతారకాలమున నన్నొక రాజమాత్రునిగా, కృష్ణావతార సమయమున నొకగోపాలునిగా ప్రజలు నన్ను తలం చిరి. సామాన్యమానవుని మొదలు ధీమాన్యునివఱకు భక్తిప్రపత్తులతో నిన్ను సేవిం చుచు వచ్చుచున్నారు. దీనికి నీవేదియైన మందుగాని, మాకుగాని మచ్చుపొడిగాని కను గొంటివా? చాల అచ్చెరువు గొల్పుచున్నది. ఆ రహస్యము వెల్లడింప దగినదైన మాకు వివరింపుము" అని పలికెను.

ఆ వాక్యములు విని యతీంద్రులు, "స్వామీ ! మా యొద్ద మందులుగాని, మచ్చుపొడులుగాని లేవు. మనుకోటి సారమగు మంత్రరాజ మొకటి మాకడగలదు. దాని ప్రభావముచే నిందఱు వశులైరి. ఇంకను వశమగుచున్నారు. ఆ దివ్యమంత్ర మునకు, దేశకాలకుల జాతినియమములేమియులేవు. శ్రద్ధగలిగినవారి కందఱకు ఇది ఉపాదేయమే. గ్రహించునపుడు సంప్రదాయానుసారముగా గ్రహింప వలె. లేనిచో ఫలితముండదు. దీనికి గురుశిష్య సాంప్రదాయమతి ముఖ్యము" అని పలికిరి.

అపుడా సర్వేశ్వరుండు తాను పీఠమునుండి క్రిందకుదిగి రామాజుల దాని పైకెక్కించి, యతిరాజుల పాదములపై తనచేతులుంచి, కుడిచెవి నందించి, "మంత్రో పదేశము చేయుము" అనెను. అపుడు గురుదేవులు స్వామికర్ణమున ద్వయమంత్రమును పఠించి, "ఈ మంత్ర మొక్కసారి విన్నచో మోక్షలక్ష్మీకరగ్రహణంబున కర్హుండగు. నేనీ శుభమంత్ర ప్రభావముననే ఇంతమందిని లోబఱచు కొనగల్గితిని." అని చెప్పి స్వామికి 'వైష్ణవనంబి' యనుదాస్యనామము నేర్పఱచి, తాను ఆసనమున నుండి క్రిందకు దిగి, స్వామిని పైకెక్కించి స్వామిచరణ సరసీజములకు ప్రణమిల్లి, లేచి "సర్వాపరాధపుంజక్షమస్వప్రభూ" అని మ్రొక్కి నిలిచెను. జగదధీశ్వరుడు, జగన్ని యామకుండును అగు స్వామి యతిరాజునకు తీర్థప్రసాద శఠకోపములనిప్పించి, తన దివ్యవాహని మెక్కించి, బ్రహ్మరథమును పట్టించెను.

సర్వేశ్వరుని విలాసముల కానందించుచు లక్ష్మణయోగివారి దివ్యాజ్ఞను గైకొని అటనుండి కదలి కేరళదేశమునకు తరలిపోయెను. తిరువనంతపురమును చేరెను, అటనున్న పద్మనాభస్వామివారిని మూడు వాకిళ్ళ యందును దర్శించి, వారికి మంగళాశంసనముచేసి, అటనుండి కర్ణాటకమున కేగెను. అచ్చటగల రమాపతికి ఏటి కోళ్లు సమర్పించి, భీమతటి నీతీరవాసుండును, ఇటుకరాతిపై కటిహస్త బద్ధుండై, రుక్మిణీ సహితుండై, చేతనుల అభిముఖ్యమును నిరీక్షించుచున్న పాండురంగని దర్శింపనేగెను.

అచ్చట పాంచరాత్రము నెలకొల్పవలయునని తలంచి, పరమేశ్వర నిరాక రణము చేత తత్ప్రయత్నమును విరమించి, పశ్చిమ సముద్ర తీరక్షేత్రమగు ద్వారా వతి కరిగి అచ్చట నందకుమారుని పూజించి, నైమిశము, కురుక్షేత్రము, బృందా వనము, మాయ, బదరికాశ్రమముల సందర్శించి, బదరీనారాయణునకు మంగళా శాసనముచేసి, నరనారాయణాశ్రమములపరికించి, కాశ్మీరదేశమునకుంబోయి శారదా పీఠమును జూచి లోని కేగుచుండెను. పదురెండేడుల బాలికయొర్తు దుఃఖించుచు ద్వార మున కడ్డముగ కూరుచుండియుండెను. ఆమె చేతులు బారచాచి, యతీంద్రుల నడ్డ గించెను. యతీంద్రులాబాలంజూచి "అమ్మా! ఎందులకు దుఃఖించుచుంటివి? నన్ను లోనికేగనీయక ఆటంక పరచిన కారణమేమి?" అని ప్రశ్నించిరి.

అందులకాబాల "త్రిదండీ! నిన్ను లోనికి పోనిచ్చెద కాని నేనడిగిన ప్రశ్నకు నీవు సమాధానము చెప్పవలె. లేనిచో పోనీయను" అని మారు పలికెను. అపుడు యతీంద్రులు "తల్లీ! అటులే కానిమ్ము. తెలిసినచో చెప్పెద. లేనిచో జ్ఞాన వృద్ధులగు పెద్దల నడిగి వివరించెద"నని పలికిరి. అపుడా కన్నియ "కప్యాస" మను శ్రుతికి అర్థము నెలవిమ్మనివేడెను. రామానుజులామెంజూచి "అమ్మా! వినుము. 'కం' అనగా జలము. దానిని పీల్చువాడు కపి. అనగా నీటిని ఆవిరిరూపమున పీల్చువాడు సూర్యుడు. ఆతనికర స్పర్శచే వికసితమగునది కప్యాసము. అనగా పుండరీకము అట్టి పుండరీకములవంటి నేత్రములుగలవాడు అనగా సూర్యకిరణముల తాకిడిచే విచ్చు కొను తామరపూవులవంటి కన్నులుగలవాడు సర్వేశ్వరుండు" అని విశదీకరించెను. ఆ వాక్యముల కలరి ఆకన్నియ "యతీంద్రా! పూర్వము శంకరుడు భాష్యము

వ్రాసికొని వచ్చెను. ఈ శ్రుతికే అర్థమును వచింపుమని కోరితిని. దీని కాతడు అపార్థమును వ్రాసెను. కపి అనగా కోతి. ఆస మనగా గుదము. కోతిముడ్డి వంటి నేత్రములుగలవాడు సర్వేశ్వరుడు అతని ప్రత్యయము, ఆ నిర్వచనమును విన్నదాది ఇప్పటి దనుకదుఃఖించుచునేయుంటిని నీవు నిర్దేశించిన ఈ యర్థముచే నా శోకమునివారితమైనది. నీవు చెప్పని భాష్యమే శ్రేష్ఠతమము. అసలు భాష్యమననీవు చెప్పినదియే. నీవే భాష్యకారుడవు" అని మెచ్చుకోలు నెరపి లోనికిం దీసికొనిపోయి భాష్యగ్రంథమును తీసికొని శారదాదేవీ విగ్రహము చేతిలో నుంచెను. ఆ చేతిలోని గ్రంథమట్లే యుండెను. అపుడా బాలికదానినందుకొని ఆర్యా! మీ భాష్యము నిర్దోషభూషితము. లేనిచో చేతపెట్టిన వెంటనే శారదాదేవి పారవైచెడిది. తీసికొమ్ము. అని గ్రంథమును రామానుజులకొసంగి అదృశ్యయయ్యెను యోగీంద్రు లాశ్చర్యమంది "అహో! భాగ్యము ఈమెయే సరస్వతీదేవి. నా భాష్యము నంగీకరించినది" అని మిక్కిలి సంతోషించిరి. అపుడచ్చటనుండి, ఈ విచిత్ర సన్నివేశమును తిలకించినవారందఱును "స్వామీ! శారదాశోకమును పోగొట్టిన ధన్యుడవు నీవే. నీవు శారదాశోకనాశనుడవు" అని అగ్గించిరి. అప్పటినుండియు రామానుజుల కదియొక నామధేయమయ్యెను.

అచ్చట అంతకుమునుందు మంచి కీర్తి ప్రతిష్ఠలతో నిరంకుశముగ వర్తించుచున్న విద్వాంసులు కొందఱిది చూచి, రామానుజుని కీర్తికసూయాద్వేషమలీ మస చిత్తులై ఆయనపై దండెత్తి వాదించి యోడిపోయిరి. అపుడు వారు అభిచారికముచేసి, యొక కృత్తిని పుట్టించి లక్ష్మణ సూరిపై నుసిగొల్పి పంపించిరి. అయ్యది వచ్చి రామానుజుల దివ్యతేజోవిశేషములకు భయమంది దిక్కుతోచక, ఆయనకు నమస్కరించి, వెనుదిరిగిపోయి, తనను పంపించిన బ్రాహ్మణులలో కొందఱిని హింసించి మాయమయ్యెను. దానిచే ఆ విప్రులందఱును మతిహీనులై యున్మాదులై తిరుగుచు, దిగంబరులై, పిచ్చిపిచ్చిగా నఱచుచు వీధులవెంట తిరుగుచుండిరి. తద్దేశ పాలకుడగు రాజునకీవార్త తెలిసెను. అపుడాతడు యతిరాజుల పదపంకజములు కనులకద్దుకొని వారి నాశ్రయించి "స్వామీ? మిమ్ము పరాభూతులగావింప వచ్చిన బ్రాహ్మణులందఱు మతిభ్రమణముచే మహాభ్రష్టులై తిరుగుచున్నారు. తాము దయార్ద్రులు. వీరి ననుగ్రహింపుడు. ఈ దేశము నకు పూర్వమునుండియు బ్రహ్మావర్త మను ప్రసిద్ధనామము సార్థకమైయున్నది. వీరిట్లేయున్నచో "మతి హీనావర్తము" అను అన్వర్థ నామము ఈ దేశమునకు శాశ్వతముగా నిలిచిపోవును" అని పరిపరి విధముల వేడుకొనెను.

రాజవిన్నపము నంగీకరించి, ఆ పిచ్చి బాపలను పట్టి తెప్పించి, వారికి,
వారి శ్రీపాదతీర్థము సంగి కమండులూదకము వారిపై సంప్రోక్షించిరి. వెంటనే వారి
మానసికవ్యాధులన్నియు మటు మాయమయ్యెను. అపుడు వారు లక్ష్మణదేశి కేంద్రుని
పాదములపై బడి, "స్వామీ ! మీ రసమాన్యులని గ్రహింపలేక, సామాన్య మానవు
నిగా తలంచి మేము మీకు మహాపరాధము చేసితిమి. వాగధీశుండవగు ననంతుడవని
యెఱుంగ మైతిమి, ఇప్పుడు తెలిసికొంటిమి. మా అజ్ఞానమంత మైనది. అహంభావ
మారిపోయినది. మీ రెచ్చట? మే మెచ్చట? నాగలోకమునకును నక్కలకును పోలి
కయా? బహుజనపాన పాబ్ధికుల పర్వతపూర్ణ సరస్సరిస్వతీ సహిత మహామహీభరము
చాల్పు పడగలపై ధరించుచు మీకు మాస్వల్పాపచారములు సహించుట యొక లెక్క
లోనిదికాదు. ప్రభూ! మమ్మనుగ్రహింపుడు" అని కొనియాడుచు, వారి వెంట కొంత
దూరమరిగి వారి యాజ్ఞానుసారము తిరిగిపోయిరి. ఆ రాజును. తనదేశమును దాటు
వరకును, యతిస్వాముల సాగనంపి వారి యనుదుతితో వెనుదిరిగి అరిగెను.

ఆ యతివర్యులు సమస్త పరివార సహితులై, అయోధ్య ప్రయాగ,గయ,
మొదలగు దివ్యదేశములు దర్శించుచు, పూర్వాంభోధితటస్థమగు పురుషోత్తమ క్షేత్ర
మను పేరుగల జగన్నాథ క్షేత్రమునకు వచ్చి అట నివసించిరి. పతితపావన బిరుద
మును ధరించి, బ్రహ్మదారు స్వరూపులై వేంచేసియున్న జగన్నాథుని దర్శించి, ఆ
పాద మస్తకము మంగళాశాసన మాచరించి, "ఈ క్షేత్రము చాల గొప్పది. దీనిని
పాంచరాత్రాగమములచే సంస్కరించి దివ్యదేశమొనర్చెద"నని యెంచి, దానికి తగిన
యత్నములు కొనసాగించుచుండిరి. అది తెలిసికొని జగన్నాథస్వామి యర్చకులును,
పరివారమును స్వామి కడకేగి "ఓ దయానిధీ! నీవీ త్రిదండిమతమునదిగితివా, మే
మందఱమేమి కావలె? సర్వజ్ఞుడవగు నీకొక శాస్త్రమేమి? నీవున్నచోటు దివ్యదేశము.
అంతియే. ఆ అరవమంత్రము పఠింపకున్ననది దివ్యస్థలము కాదా? నీ యిచ్ఛయే
ధర్మము. వేరు ధర్మాధర్మములు లోకమునలేవు. ఎన్నియో తరములనుండి నీ పాద
కమలములు సేవించుచున్న మమ్మందఱ బహిష్కరించి ఈ సన్యాసిని చేపట్టవలదు
నీ వాతనికి వశంవదుడవు కావలదు. నీవు దివ్యుండవు. నీ జన్మకర్మములు దివ్యములు
అట్టి నీకీ ద్రవిడదేశీయుల సంపర్కముచేత గాని దివ్యత్వము సంప్రాప్తింపదా? సమస్త
చేతనా చేతనములకు నీవలన దివ్యత్వము సిద్ధింపవలె. నీ కింకొకరివలన దివ్యత్వ
సిద్ధియేమి? "పత్రం, పుష్పం, ఫలం, తోయం, యోమే భక్త్యాప్రయచ్ఛయతి, తదహం

భక్త్యు పహృతం, అశ్నామిప్రయతాత్మనః" అనునట్లు ఆకుగాని, పూవుగాని పండు గాని, యేమియు లేనిచో నుద్ధరిణెడు నీరుగాని భక్తితో నా కెవడు సమర్పించునో? అట్టి వాని, భక్తియుతమగు తత్పదార్థమును నేను ప్రేమతో భుజియించుచున్నాను" అని మీరు సెలవిచ్చితిరికదా! అదియుగాక; నవేద యజ్ఞాధ్యయనైః వేదములు పఠించి నను, రాజసూయాశ్వమేధాది యజ్ఞములు నిర్వికల్పముగా నిర్వహించినను, భయం కరతపస్సుపొనరించినను, నేను గోచరింపను. భక్తిచే నన్ను దర్శింపగలరు' అని మీరే సాయించిఉన్నారు. తపస్సిద్ధులు, జ్ఞానయోగులు, కర్మయోగులు, అనేకులు మిమ్ము ప్రతిమాలగా దండకారణ్యమున, రామావతారకాలమున వారికుటీరములు త్రొక్కి చూచితివి. నిరక్షరాస్యయు, బోయకుల సంజాతయునగు శబరికోరకుండగనే, ఆమె ఆశ్రమమున కేగితివి. ఆమె యిచ్చిన యెంగిలిపండ్లు మెసంగితివి. గుహుని గాంచి "పద్భ్యామభిగమ మాచ్ఛైవస్నేహం సందర్శనేనచ "ఓ గుహుండా? నీకు రథా ద్యనేక పరికరములున్నను, నన్ను చూచుటకై కాలినడకతో వచ్చితివా? నీ స్నేహ మును నేనేమని కొనియాడగలను? అని పలికితివి. ఇదంతయు భక్తిచే తనే కదా! స్వామీ? నీవు మమ్మనుగ్రహింపక, ఈ సన్యాసి మతము నంగీకరించితివేని, మా శిర స్సుల నన్నింటిని, మీ పదములపై కొబ్బరికాయలవలె బ్రద్దలు గొట్టుకొని, అసువుల విడిచెదము" అని ఏకగ్రీవముగా ప్రపత్తి నెరపరి.

జగన్నాథుడు వారి ప్రపత్తి నంగీకరించెను. వారి స్వప్నములలో సాక్షా త్కరించి "మీరు విచారింపకుడు. నేను యతీంద్రులమతమును స్వీకరింపను" అని సెలవిచ్చెను. అతడే రామానుజుని కలలో కన్పించి "త్రిదండికుల మండనా? నీవు నా శయ్యవు. రామావతారవేళతమ్ముండవు. కృష్ణావతారమ్మున అన్నవు. వేంకటా చలంబున లక్ష్మి నొసంగుటచే మామవు. నాకుపదేశ మొనర్చిన హేతువున గురుం డవు, నీకు నా కనేక సంబంధములు నిరంతరమున్నవి. నీ మాటకు నేనడుగు దాట రాదు. కాని యిచ్చట నీ మాట విసను. నీ మాట విన్నచో నిపుడిచ్చట పనిచేయు చున్న పరిజనమంతయు నల్లాడిపోవును. ఇచ్చట పతితపావన బిరుదాంకితుండను ఆ బిరుదమును తప్పరాదు. సమ్మోహారసర్వభూతేషు" అనుసూక్తి నిచట ప్రత్యక్షముగ చూచుచున్నాను. నీయాగమతంత్రమునిట ప్రవేశపెట్టకుము. ఇది నేను నిన్నాజ్ఞాపించు టగా తలంపకుము. ఇది నా విన్నపము మాత్రమే. నన్ను విడిచిపొమ్ము!" అని తెలి పెను. ఆ మాటలు విని యతీంద్రులు" జగన్నాథా! నీవిట్లు పలుకదగునా? ఇంతటి

విధిక్షేత్రమున ఆగమములేనిచో మిగిలిన చిన్నక్షేత్రముల వైదిక యున్ననేమి? లేక పోయిననేమి? అఖిలక్షేత్రంబుల సంస్కరింప బయలుదేరితిని. నన్నిట్లు వ్యర్థముగా త్రిప్పి పంపుట పాడియా? అనుగ్రహింపుము" అని వేడుకొనెను. అంత జగన్నాధుడు "ఈ యతీంద్రుడు పట్టుబట్టుకొని యున్నాడు. వీనినిచ్చట నుండనిచ్చిన కార్యము తప్పును." అని తలంచి రామానుజులు నిద్రించుసమయమున నాయన నెత్తుకొని శ్రీ కూర్మమున దించి స్వప్నమునకన్పించి "నీయాగమసిద్ధాంతమునిట స్థిరీకరింపుము. ఇచ్చట నేను కూర్మరూపినై యుంటి. కావున నన్ను లింగస్వరూపునిగా భావించి శివ పూజ నెరపుచున్నారు, ఇచట సంస్కరించి శ్రీరంగమునకు పొమ్ము. "అని తెల్పి జగన్నాధమున నిద్రలో మున్గియున్న రామానుజుల శిష్యుల కలలలో పొడచూపి "మీ గురువును శ్రీ కూర్మమున దింపి వచ్చితిని. అటకుపొండు" అని ఆనతిచ్చెను. వారు మేల్కాంచి గురుని కానక, జగన్నాధుని తిట్టుకొనుచు శ్రీ కూర్మమునకు బయలు దేరిరి.

అపుడిచ్చట లక్ష్మణసూరి "హరిహరీ" అని ఉచ్చరించుచు నిద్రనుండి లేచెను. చుట్టును చూచెను. శ్రీ కూర్మము. దాని పరిసరము, శ్రీ కూర్మాలయము గోచరించుచుండెను. స్వప్న వృత్తాంతమును జ్ఞప్తికి తెచ్చుకొని "ఔరా! జగన్నాథు డెంతపని చేసెను. మారు వస్త్రములుగాని, త్రిదండముగాని లేవు. లలాటమున ధరించుటకు శ్వేతమృత్తికయైన లేదు. స్వరూపమును ధరింపకుండు టెట్లు? త్రిదండము లేనిదే సన్యాసికి భోజనార్హత లేదు. ఇచట పరిచర్య లొనరించువారెవరు?" అని విచారించుచుండెను. అట్టి యెడనొక వైష్ణవబాలకుడు శ్వేతవస్త్రమును గూడ కట్టుగా కట్టి ముద్దులు మూటగట్టునెమ్మోమున తిరుమణి తిరుచూర్ణముల దిద్ది ద్వాదశోర్ధ్వ పుండ్ర విలసితుండై, ఇంద్ర నీలశకలములవలె, ఎలదేటికొదమ రెక్కలనధఃకరించు సొంపుతో భాసించునల్లని కేశములుముడిచివైచి, ఒక యుత్తరీయమును వల్లెవాటుగా అలంకరించుకొని, పలాశదండధారియై వైష్ణవమే యీతనిరూపమును ధరించెనో యన యతీంద్రులను సమీపించెను. రామానుజు లాబాలకుం గాంచి, "అహో! ఈ గ్రామమునకూడ వైష్ణవులున్నటులున్నారు. ఈ పిల్లవాని నడిగినచో, తిరుమణి, శ్రీ చూర్ణములు తెచ్చి యీయగలడు" అని ఆనందించుచుండిరి. అంత నాకొమరుం బ్రాయపు వైష్ణవుడు సమీపించి గురుదేవుల నుద్దేశించి "ఆర్యా! తమయూరెయ్యది?

ఎచ్చటినుండి వచ్చుచున్నారు? ఎచ్చటి కేగుచున్నారు? మీ త్రిదండకమండలువు లేమైనవి? అంతే వాసులెటనున్నారు? ఒంటరిగా నిటనుండుటకుం గతంబేమి? మీరు సామాన్య యతీంద్రులుగా గోచరించుటలేదు; శ్రీరంగ వేంకటాచలాది దివ్య స్థలములనుద్ధరించి జగత్ప్రసిద్ధి వహించిన రామానుజసంయమీశ్వరులుగానున్నారు. ఈ దేశము మీకు వాసయోగ్యము కాదు. ఇది శైవపాషండ మతప్రబలితమై యున్నది. మీ భిక్షాటనమునకు తగిన ప్రాంతము కాదు. మీ రిపుడేమి చేయదలంచి యున్నారు?" అని ప్రశ్నించెను.

ఆ వాక్యములకలరి రామానుజులు "వత్సా! నీవు భావించిన రామానుజుం డను నేనే. గయాప్రయాగాది క్షేత్రముల దర్శించి జగన్నాథమునకు వచ్చి ఆ క్షేత్ర మును పాంచరాత్రాగమానుసారిగా సంస్కరింపదలంచితిని. కాని జగన్నాథుడందుల కంగీకరింపకపోగా నిద్రావశంబున వాడలెఱుంగకయున్న నన్నెత్తుకొని వచ్చి యిట దింపె. ఈ క్షేత్రమును సంస్కరింపుమని ఆజ్ఞాపించిపోయెను. నా శిష్యులంచటచ్చ టనే నిలిచిపోయిరి. దైవకృపచే నీవు నా కంటబడితివి. నీదేయూరు? నీపేరేమి? నీ విచ్చటికేల వచ్చితివి?" అని అడిగిరి. అందుల కాకామరుండు "అయ్యా! నాది సింహాచలము. జగన్నాథమునకు పోవుచున్నాను. మధ్యేమార్గమ్మున మత్పురాతన పుణ్యభరంబున మీ దర్శనభాగ్యములభించినది. ఇది యంతయును విధివిలాసము. మీ శిష్యులు వచ్చువఱకును మీ కడనుండి, మీ కుపచరించెద. నా పూర్వపుణ్యముచే నాకీ సుకృతము సిద్ధించినది." అని పలికి సకలోపచారములు జరుపుచుండెను. తిరు మణి శ్రీ చూర్ణముల కొండపై నొకచోట త్రవ్వి తీసికొనివచ్చెను. స్వరూపమును ధరించిన తదుపరి పాలు, ఫలములు కొనివచ్చెను. ఇట్లాతడు గురుపాదులకే లోప మును రాకుండ పరిచర్య సలుపుచుండ నొకవారము దినములకు రామానుజుల పరి వారమంతయు శ్రీ కూర్మమునకు చేరెను. శిష్యులు గురుపదులకు నమస్కరించి, పోయిన పెన్నిధిలభించి నట్లానందించిరి.

శిష్యులు గురుపుంగవునిగాంచి "ఆహా? జగన్నాథదేవుం డెంతపనిచేసెను? మీ గురువును శ్రీ కూర్మమునదించి వచ్చితిని. మీరు నటకు పొండని స్వప్నమున ప్రబోధించెను. అహోరాత్రమ్ములు నడచివచ్చి యిచ్చటికి చేరగల్గితిమి. ఇచ్చట మీ పరిచర్య లొనర్చు వారెవ్వరు? కాలమెట్లు గడచుచున్నది?" అని యడుగయతిరాజు "సర్వేశ్వరానుగ్రహమున్నంతవఱకు సముద్ర గర్భమున నున్నను భయములేదు.

ఎవరో వైష్ణవబాలకుండు నాకు పరిచర్య లొనర్చుచు నాతోడనే వసించుచున్నాడు. ఇప్పుడే నన్ను విడిచి వెళ్ళినాడు" అని చెప్పెను. "ఆ వైష్ణవయువకుం డెచ్చటినుండి వచ్చె?"నని వారన్ని ప్రాంతములందును అతనికై వెదకిరి. ఆత డెందును కన్పింపలేదు. ఆ కైతవ బ్రహ్మచారి అప్పుడే మాయమాయెను. "అహో! జగన్నాధుడే యీ రూపమున చనుదెంచెనని అక్కజం పడిరి.

యతిరాజులు శిష్యసమేతులై దేవళములోని కరిగిరి. కూర్మనాధుని దర్శించి "శాంతాకారం, భుజగశయనం. పద్మనాభం, సురేశం" అను శ్లోకముచే స్తుతించుచుండిరి. ఆ స్తోత్రమును విని అటనున్న శైవులు మండిపడి "ఏమయ్యా! సన్యాసి బ్రాహ్మణా! శివలింగము కడవిష్ణు స్తుతి పఠింపవచ్చునా? మేము మీ వెన్ను నికడ శంభుస్తోత్ర మాచరించిన మీరూరకుందురా? ఆలయమును వదలి పొమ్ము!! అని మందలించిరి.

ఆ శైవపుంగవులజూచి యతివరులు "ఓ శివభక్తి తత్పరులారా! ఇది లింగముకాదు. పూర్వము సప్తర్షులు నీ ఆధికూర్మరూపమును చూపుమని వేడగా వారి కారూపు చూపుటకై యిచ్చట వెన్నుడు శైలరూపమును దాల్చెను. ఇప్పటికైన నీ కొండను పరిశీలింపుడు. కూర్మరూపముగా తోచుచున్నది. ఈ ఆలయమువ నున్నది కూడ కూర్మరూపమేకాని లింగముకాదు. ఈ గ్రామము శ్రీ కూర్మము అను పేర ప్రసిద్ధి కెక్కినది. ఇన్ని నిదర్శనములుండనిది లింగమన నెట్లు వచ్చు?" అని పలికిరి.

ఆ మాటలు విని శైవులు క్రోధమునడంచుకొని ఎక సక్కెముగా, "ఎంత యుక్తియుక్తముగా చెప్పితివయ్యా! బాపనయ్యా! 'ఆరుశాస్త్రములా మూలాగ్ర ముగా చెప్పితివయ్యా! బాపనయ్యా? 'ఆరుశాస్త్రములా మూలాగ్రముగా చదివిన అద్వైతికన్న ఓనమాలు వచ్చిన వైష్ణవయ్య మిన్న' అను సామెత సార్థకపరచితివి. మా పూర్వులకాలము నుండియు, మేము పూజించుచున్న యీ లింగము విష్ణువట. ఈతడెలుగువట. అందును కూర్మరూపమట. ఆహాహా! ఇంతమాత్రమునకు మేము నమ్మవలయునా? నీ వంతటి సత్యము నెటింగిన త్రికాలవేదివేని నిజముగా నిది శివ లింగముకాక కూర్మ విగ్రహమేని, నీవు చెప్పినది నిక్కమేని ఒక్క తార్కాణము చూపుము. ఇపుడు తూర్పుముఖముగా నున్నస్వామి పడమరముఖముగా తిరిగినచో మీ

వాక్యము లంగీకరింతుము. అపుడీతడు కూర్మనాథుడే. నీ వట్లు చేయలేవిచో, నీవీ గ్రామమున నుండుటకు గూడ అర్హుడవుకావు. పొమ్ము" అని కసరి పలికిరి.

సంయమి ఆ మాటలకు సంతసించెను. ఆ పన్నిదమున కంగీకరించెను. ఆ దినము గతించెను. రెండవ దినమున తెల్లవారుజాముననే మేల్కాంచి, కాలకృత్యములు ముగించుకొని, భగవద్ధ్యానమును నెరవేర్చి శిష్యసహితుడై ఆలయమును సమీపించి, వెనుకవైపున కూరుచుండి, దైవమును గూర్చి ఈ రీతి ప్రపత్తి సలిపెను. "ఓ జగదీశ్వరా! జగద్రూపా? జగన్నియంతా! దయామయా? నీవు నా స్వప్నమున వచించినమాటలు సత్యబద్ధమేని, నీవు నిజముగా ఆది కూర్మనాధుండవేని, శ్రీపతిత్వము నీకు చెల్లునేని, నిస్సమాభ్యధికుండవగుట నిక్కమేని, భక్తపారతంత్ర్యము నీ కలంకార ప్రాయమేని, విభూతి ద్వయనాయకుండ వగుట యధార్థమేని, ప్రాచీదిశాముఖుండ వగు నీవు పశ్చిమాభిముఖుండవు కమ్ము."

ఈ ప్రపత్తి విన్నవెంటనే సమస్త జనులు దర్శించుచుండగా, దేవాలయమున ప్రాచీముఖుండైయున్న స్వామి పశ్చిమాభిముఖుడై నిలిచెను. అందరాశ్చర్యచకితులైరి. ప్రత్యక్షమునకు వేరుసాక్ష్యమవసరములేదు కావున శైవులందరును దుఃఖించుచు, చేయునదిలేక, అటనుండి నిష్క్రమించిరి. రామానుజులచ్చటి అర్చకుల రావించి "మీరు మా వైష్ణవమత మవలంబించినచో దేవాలయమును వీడు నవస్థ తటస్థింపదు. లేదా వెడలిపోవలయు. మీరు పంచసంస్కారమును పొంది పాంచరాత్రాగమానుసారము పూజా కైంకర్యాదుల నిర్వర్తింపుడు" అని పలుక అర్చకస్వాములు హర్షించి, శైవమును వీడి, వైష్ణవమతానుయాయులై రామానుజోక్త ప్రకారము, దేవళమున పూజాదుల నిర్వర్తించుచుండిరి. ఇప్పటికిని, ఆ సంప్రదాయ మట్లే నడచుచున్నది.

లక్ష్మణసూరి కొన్ని దినములటనుండి, కదలిసింహాచలమునకు వచ్చెను. సింహాచలమునకు దిగువగల నొకగ్రామము నందుని వసించుచు, పరివారమునంతయు నచ్చటనుంచి, కతిపయశిష్య సహితుడై పర్వతము నధిరోహించి, వరాహనారసింహస్వామి దేవాలయమందు ప్రవేశించి, గోపురమంటపాదులు తిలకించుచు, ద్వారపాలకుల దర్శించి, గర్భగృహమునందున్న శ్రీచందన లిప్తశరీరభాసుండైన దేవాదిదేవునకు మంగళాశాసనము చేసి, ఆదిలక్ష్మిం దరిసించి, దేవాలయమునకు ప్రదక్షిణించు

చుండెను. ఆ ఆలయప్రాంగణమున తాండవకృష్ణ మాచార్యుడను నొక వైష్ణవు డొక ఆసనముపై కూరుచుండి యుండెను. జగద్గురుండగు లక్ష్మణయోగిని చూచియు, లేవక, నమస్కరింపక, పూజింపక, గర్వయుక్తుడై యుండెను. ఆ విప్రుని జూచి రామానుజులు తనమనంబున "ఈ బ్రాహ్మణుడు గర్వయుక్తుడై యున్నాడు. భాగవతధర్మమీతనికి తెలియలేదు. ప్రత్యక్షముగా దైవదర్శనము చేయుచున్నానని దంభయుక్తుడైయున్నాడేకాని, భాగవతాపచారము నేను సహింపనని భగవానుడు ప్రవచించిన విషయమును విస్మరించినాడు.కావున భగవదారాధనము సల్పియు వ్యర్థుడగుచున్నాడు.ఆతని కరుణింపవలె." ననితలంచి, ఆతని సన్నిధకేగి "స్వామీ, మీకు వరాహనారసింహస్వామి ప్రత్యక్షమటకదా? ఆ స్వామినడిగి నా సంశయము తీర్పవలె. అద్దియెద్దియందురా? మీకు స్వామి ప్రత్యక్షమైన పిదప ఆయనతో "అయ్యా? ఇటకు రామానుజుడను యోగి వచ్చియున్నాడు. ఆతనికి మోక్షప్రాప్తియున్నదా? లేదా? 'అని అడుగుడు, ఆయన చెప్పిన సమాధానమును రేపు నాకు వినిపింపుడు?' అని వెడలిపోయెను.

ఆ రేయి కృష్ణమాచార్యుడు పాడ నారంభించెను. సింహాద్రి నాథుండాడ జొచ్చెను. కొంతసేపు జరిగెను. అప్పడాతడు స్వామినిజూచి "దేవాదిదేవా? యీ వేళ రామానుజుడను ఒక సన్న్యాసి వచ్చెను. ఆతనికి మోక్షమున్నదా ? లేదా ? ఈ విషయమును మిమ్మడిగి చెప్పుమనినాడు. ఏమని చెప్పుమందురు?" అని అడిగెను.

ఆ మాటలకు సర్వేశ్వరుండు నవ్వి "ఆ సన్న్యాసికి మోక్షమేమి? ఆతడెవ్వరికి మోక్షమొసంగునో, వారందఱకును మోక్షప్రాప్తియే. అని చెప్పుము" అని పలికెను.

రెండవదినమున రామానుజులు సింహాచలనాథుని దర్శనమునకు విచ్చేసిరి. ఆ వేళకు కృష్ణమాచార్యుడు యథాప్రకారముగా మంటపమున కూర్చుండియుండెను. యతిరాజులు దైవదర్శనానంతరము వెడలిపోవుచు కృష్ణమాచార్యుంగాంచి "ఏమయ్యా! రాత్రి స్వామినడిగితివా? ఆతడేమనినాడు?" అని ప్రశ్నించెను. అంతనా విప్రుడు "దిగులు చెందకుము. సన్న్యాసివైన నీకు మోక్షమున్నదనినాడు" అని పలికెను. అపుడు రామానుజులు "స్వామీ! నాకుండవచ్చును. సరియే. మీకు మోక్ష

మున్నదో? లేదో? ఎప్పుడైన స్వామినడిగితిరా?" యని పలుకనాయాసురుడు కహకహ నవ్వి విలాసహేళనసులు కంఠమున ధ్వనింప "ఏమంటివి? నాకు మోక్షమా? నిరంతరభగవత్సాక్షాత్కారముగల నాకేమి కొఱత? ఇంతటి వెఱ్ఱివాడవేమయ్యా? ఇట్టి నీ వెంటనిందఱెట్లు చేరిరి? సన్యాసులకు బుద్ధిమాంద్యము సహజము. పొమ్ము. పొమ్ము. నీ సంగతి నీవు చూచుకొమ్ము. మా గొడవలు నీకేల?" అని మందలించెను. రామానుజు లోరిమిచెవార, "స్వామీ? ఐనను ఒక్కమాట అడుగుటకు మీకేమి బాధ? ఐనను ఈ రాత్రి కడిగిచూడుడు" అని పలికి శిష్యసహితులై వెడలిపోయిరి.

ఆరేయి కృష్ణమాచార్యులు పాడనారంభించెను. జనార్దనుడు నృత్యమొనర్చుచుండెను. అపుడు కృష్ణమాచార్యులు భగవంతునితో "స్వామీ! నిన్నటి సన్న్యాసికి మోక్షమున్నదని చెప్పితిని. ఆ వెఱ్ఱివాడు నాకు మోక్షమున్నదో లేదోయని అనుమానపడి, ఆ విషయముగూడ మిమ్మడుగుమనినాడు. చెప్పుడు ప్రభూ! ఇంత కాలమునుండి పాడుచుంటిని. మీరాడుచుండితిరి. నాకు మోక్షమునకు లోపమా? నా సంగతియేమి? నా కనుమానములేదుగాని, పరుల అనుమానమును పరాస్త మొనర్చుట కడుగుచుంటిని" అని ప్రశ్నించెను.

అందులకు సింహాచలాధీశ్వరుడు కొంతవడి మౌనమును వహించి తదుపరి మెల్లగా, "నీమోక్షము సంగతి నాకు తెలియదు. పూర్వము మోక్షలక్ష్మి నాయధీన (మోక్షమిచ్చేస్మిముకుందాత్) అది యిప్పుడు పరాధీనయైనది. మోక్షమిచ్చు నధికారము నిన్న నిన్నడిగిన రామానుజయోగి కిచ్చి వైచితిని. ఒకసారి యొసంగిన దానిని పరిగ్రహింపను.ఆయననే అడుగుము. ఆయన నీకు మోక్షమున్నదని చెప్పెనా, నీకు మోక్షమున్నది. లేదనెనా లేదు" అని వచించెను.

ఆ వాక్యములకు విప్రుడు నివ్వెరపడి "ఏమేమీ, మోక్షము నీయాధిపత్యమున లేదా? సన్న్యాసి కర్తయా? ఎంతయో కాలమునుండియు నిన్నే నమ్ముకొని ధారకపోషకములకు నీవేయని నమ్మియున్న నీవు నన్నెంత చులుకన చేసితివి? ఎంత వంచనకు పాల్పడితివి? నా పెరటికల్పకమవని, నా కొంగు బంగారమవని, నా యింటి చింతామణివని నిన్నునమ్మియున్న నన్ను నడియేట నెట్టుదువా? నా తరుగని పెన్నిధానమవని యెంచితి. ఇట్టి నన్నెట్టిపని చేసితివి? బ్రహ్మరుద్రేంద్రాది దేవతావందిత చరణారవిందుండవగు నీవీ సన్న్యాసిమాయలకు లోబడితివా? ఆ మాయా సన్న్యాసి

నిన్నెట్లు పురులు కొలిపె? నీవు భక్తజన పారిజాతమవా? ఆ నామము నేతిబీరకాయ వలె నున్నది. నా కింత ద్రోహమొనర్చుట తగునాయని విలవిల విలపోసెను.

ఆ మాటలు విని సింహాద్రినాథుడు "దౌర్భాగ్యుడా! నేనేమి చేసితి? నీ గర్వమే నిన్నింతకు తెచ్చె. భాగవతాపచారమున్నకు నేను సైరింప, రామానుజ యోగి యిటకు వచ్చినపుడు నీ వాయనకపచార మొనర్చితివి. ఆయనను జూచి లేవక, నమస్కరింపక గర్వయుక్తుండవై కూరుచుంటివి. భాగవతాపచార మెట్టివారలనైన అధః పతితులజేయును. భాగవతాపచారస్వరూపము వివరింతు వినుము. భాగవతులు సమీపించినపుడు వారినిచూచి లేవక, పలుకరింపక, నమస్కరింపక, సత్కరింపక యుండుట, భాగవతుల జూచి నీ కులమేమి? నీ జాతియేమి? యని ప్రశ్నించుట, హీన కులుండవనినిందించుట, భాగవతులున్నస్థలము నీచమైనదని నిర్దేశించుట, బొట్టు కట్టుల జూచి నవ్వుట, వేషమునుగాంచి పరిహసించుట, ఇవి యన్నియు భాగవతాప చారము క్రిందకు వచ్చును. లక్ష్మణయోగి జగద్గురుండు. నాకు రెండురూపములు. ఒకటి అచరరూపము. అనగా కదలనిది. శ్రీ రంగతిరుమలేత్యాది దేవాలయముల నుండునది. ఇక రెండవది చరరూపము. కదలునది. అది యీ రామానుజయోగి స్వరూపమే. అట్టివాని కపచార మొనర్చితివి. కావున నీకిట్టి దుస్థితి సంభవించినది ఇప్పటికైన మించిపోయినది లేదు. నీవాతనియొద్ద కేగి క్షమాభిక్షవేడుము. లేనిచో స్వరూపహాని సంభవించును" అనెను.

అంత తాండవకృష్ణమాచార్యులు మిక్కిలి పరితపించుచు, అవమానపీడితుడై క్రుంగిపోవుచు, కొండదిగి రామానుజయోగి బసచేసియున్న ప్రదేశమునకేగి, చుట్టును పరికించెను. మదవారణములు, తురంగములు, శతాంగములు, పరిచారకులు అపారసంఖ్యలోనుండిరి. అందఱును తులసీనలినాక్షమాలాధారులే. అందరును స్వరూపధారులే. అందఱును భగవత్కల్యాణగుణస్తోత్ర పాఠకులే, అందఱును వైష్ణవ కథాకర్ణన నిరతులే, అట్టి పరివారమును పరికించి, ఆశ్చర్యమంది, దౌవారికులగాంచి "అయ్యలారా! మీరు మీ గురుదేవుల కడకరిగి, తాండవకృష్ణ మాచార్యులు వారు వచ్చిరి. అని తెలుపుడు" అని పలికెను. వారు లోనికేగి గురుదేవున కట్లే విన్నవించిరి. అది విని గురుచంద్రుడు "వారితో మనకేమియు పనిలేదు. పొమ్మని చెప్పుడు." అని ఆదేశించెను. వారు తిరిగివచ్చి కృష్ణమాచార్యుల కట్లే చెప్పిరి. కృష్ణమాచార్యుడహంభావపూరితుండై మరలి సింహాద్రికిపోయెను.

అట్లు కృష్ణమాచార్యులు సింహాద్రికేగి, సింహాచలేశ్వరుంజూచి "అయ్యా! నీవు పొమ్మంటివి. నీ మాట దాటలేకపోయితిని. కాని ఆ సన్న్యాసి నాకు దర్శనము కూడ నొసంగలేదు" అని పలుక నృసింహమూర్తి "ఎందుల కాతడు నిన్ను గ్రహింపలేదు? సామాన్యులకేని ఆతడు సులభసాధ్యుడే. నీవేమని కబురు చేసితివి?" అని యడిగెను. "కృష్ణమాచార్యుల వారు వచ్చియున్నారని చెప్పి పంపితిని" అని ఆతడు సమాధానమిచ్చెను. అందులకు స్వామి "ఓహో! అట్లా? ఇంతకు నీ యహంకారమడంగినది కాదు. జగద్గురుపులకడ నీకంత పొగరుబోతు తనమేల? వారు వచ్చినారని యేల చెప్పితివి? అదియే నిన్నింతకు తెచ్చినది. మరలపోయి యీసారి సరిగా చెప్పుము" అని పలికెను.

ఆతడు మరల వెళ్ళి ద్వారపాలకులం జూచి, "కృష్ణమాచార్యులు వచ్చినా" డని గురువుగారికి వర్తమానమును పంపించెను. ఆయనయుందు చెప్పినటులే మన కాయనతో పనిలేదు పొ"మ్మని కబురుచేసెను. మరల కృష్ణమాచార్యులు నరసింహ దేవుని కడకేగి, ఆయన స్వీకరింపలేదని యేడ్చెను. నీవేమంటివని స్వామి యడుగ కృష్ణమాచార్యులు వచ్చినాడని కబురు చేసితిననియెను.అందులకు సింహాద్రినివాసుండు "వత్సా! ఆచార్యుడనియేల చెప్పితివి? ఆచార్య శబ్దము జగద్గురుండగు రామానుజునికే పరిమితము సార్థకమును. ఈసారిపొమ్ము. దాసశబ్ద పురస్కృతుడవుకమ్ము జగదాచార్యుడు నిన్ను కనికరించి, గ్రహించు"నని చెప్పి పంపెను.

కృష్ణమాచార్యులు వచ్చి ద్వారరక్షకులంగాంచి నమస్కరించి, "స్వాములారా? రామానుజయోగిపుంగవులతో "తాండవకృష్ణదాసుడు తమ దివ్యదర్శనార్థము వచ్చియున్నాడని విన్నవింపుడు" అని కోరెను. వారు యతిమూర్ధన్యుల దర్శించి "స్వామీ! ఒక వైష్ణవుండు వచ్చియున్నాడు. ఇది మూడవపర్యాయము. ఈసారి అహంకార దూరుడై కన్పించుచున్నవాడు. రమ్మని చెప్పుమందురా? "అని అడిగిన రామానుజులు వానిని లోనికి కొని తెం"డని ఆజ్ఞాపించిరి.

దౌవారికుని అనుమతితో కృష్ణమాచార్యుడులోనికింబోయి ఆ కొన్నవాడిష్ట మృష్టాన్నంబు సరసినపగిది లోకగురుండగు యతీంద్రుల మొగమంతయు కన్నులు చేసికొని చూచి, సాష్టాంగవందన ప్రణామంబులాచరించి, "సర్వాపరాధాన్ క్షమస్వ ప్రభూ" అని చేతులు కట్టుకొని నిలుపబడి యుండెను. గురుచంద్రులాతనిం జేర

ఖిలిచి కరుణార్ద్ర దృక్కుల ప్రసరింపంజేసి, ప్రపన్న లక్షణం బులుగ్గడించి పంచ సంస్కారాది విహితమ్ముల నాచరించి అర్థపంచక ముపదేశించి అనుగ్రహించెను. యతీంద్రుల దయాసాంద్రత కచ్చెరుపంది "స్వామీ! నేను మీయెడ చేసిన అపరాధముల కెంతయు వంతనందుచుంటిని. దేవరవారింతటివారని తలంపనైతి. సాక్షాద్రంగేశ్వరులే నన్ననుగ్రహింప మీ రూపమున నేతెంచినారని తలంచెద. కృతార్థుడ. నా అపరాధములు మన్నింపుడు. మిమ్ము వీడి యొక్కనిమసమైన మనజాల. మిమ్ము కొలుచుచు మీ వెనువెంటనే తెంచెద అని పలికెను. అపుడు యతివర్యులు "నన్ను సేవించుటకు నీ వంటివారెందరో యున్నారు. కాని యీ సింహాచలనాథునకు పరిచర్య చేయుటకు మావాడొకండుండవలయుకదా! నీవు మా వాడవై యిచ్చటనే యుండి, ఈ నృసింహదేవునకు కైంకర్యము లాచరించుచుండుము. ఇచ్చట కలకాలముండి, అంత్యమున లీలావిభూతినివిడిచి, నిత్యవిభూతికిరమ్ము, మోక్షమునకు నీకేమి భ్రాంతి?" అని యూరడిల్లం బలికి, ఆతని నచ్చటనేనిలిపి, సింహాచలవాసు ననుమతింగొని,బయలుదేరి, అహోబిల, గరుడాద్రి, వేంకటాద్రి, మొదలగు దివ్యదేశములు చూచుచు తత్తద్దివ్యదేశవాసులగు భగవన్మూర్తులకు మంగళాశాసనము చేయుచు, కతిపయదినంబులకు శ్రీరంగమును చేరి, తావెడలివచ్చిన విశేషములన్నియు శ్రీ రంగేశునకు వివరించి, వారి శాసనముచే అచ్చటనేయుండి, సిద్ధాంతపాలనము చేయుచుండిరి.

## కూరేశచరిత్రము

సత్యవ్రతక్షేత్రమునకు పడమటకూరమను నొకగ్రామము కలదు. ఆయూర నొక మహావిద్వాంసుడును, వినయసంపన్నుండును, నిరతాన్నదాతయునగు నొక భూసుర శ్రేష్ఠుండుకలండు. ఆతడాగ్రామప్రభువు. అందులకాతనికి కూరేశుడను పేరు వచ్చెను. ఆ మహాబ్రాహ్మణుడు సూర్యోదయము మొదలుకొని అర్ధరాత్రమువఱకును, వచ్చినవారికి లేదనకుండ షడ్రసోపేతమగు భోజనము నొసంగుచుండెను. నిరతాన్నదాతయగు నా మహామహీసురుని ప్రజలు వేనోళ్ళకొనియాడుచుండిరి.

ఒకనాడాతడు వచ్చిన యాచకుల కెల్లఱకు తనివిదీరనోగిరము పెట్టించి అర్ధరాత్రమున స్వగృహప్రధానద్వార కవాటమును బంధించుచుండెను. ఆతడు తలు

పులు వేయునప్పటి ధ్వని కంచిలోని వరదరాజస్వామివారికిని, పేరుందేవితాయార్లకును వినవచ్చెను. ఆ ధ్వనిని విని లోకమాతయగు నిందిర కాంచీపూర్ణులతో సంభాషించు చున్న మగనింగాంచి "స్వామీ! మేఘగర్జాడంబరమును విడంబించుచు వినవచ్చిన ధ్వని యేమై యుండును?" అని అడిగెను. ఆ వాక్యములు విని దేవరాజు "సుందరీ! ఆ ధ్వని యిచ్చటకు రెండుమైళ్ళదూరమున నున్న కూరనాధుని యింటి తలుపులు వేయుటచే జనించినది. కూరనాధు డరుదెంచిన అన్నార్తులకందఱకు అన్నపానాదు లొసంగి పాత్రములన్నియు శుభ్రపఱచి, భద్రముచేసి, యిపుడు తలుపులు బిగించు చున్నాడు. ఆత డతిధిపూజావ్రతపరాయణుడు. దానతత్పరుడు. వినయశీలి. వివేక శాలి" అని సమాధానమొసంగెను.

అపుడు భార్గవి "ప్రాణేశ్వరా! అట్టి దాతను చూడవలయునని మనం బువ్విళులూరుచున్నది. ఆతనినిచ్చటకు రప్పింపుడు అనుగ్రహింతుము" అనిపలికెను. భార్యా వాంఛితము నెరవేర్ప వరదుడు కాంచీపూర్ణులతో "నీవుపోయి కూరనాధు నిటకుం గొనిరమ్ము" అని ఆజ్ఞాపించెను.

వరదరాజాజ్ఞాబద్ధుడై కాంచీపూర్ణులు కూరపురమ్మున కరిగి కూరనాధునితో "అయ్యా? నిన్నుచూచి యనుగ్రహింప జగదీశ్వరి నన్ను నీకడకంపినది. లోకమాత దయాప్రాప్తుడవైతివి. ఎన్నిజన్మముల ఎన్నిజన్నములు చేసియుంటివో? ఎన్ని పుణ్య కర్మమ్ముల నాచరించితివో కంచికిరమ్ము" అని పలికెను.

కూరేశు డీ వాక్యములకలరి వివశీభూతహృదయుడై తన్మయత్వమున దేహేంద్రియ ప్రపంచముల కొంతతడవుమఱచిపోయి మరలతెలిసి "ఆహా? ఏమి నా సుకృతము. పూర్వజన్మకృతము. జగదీశ్వరియగు పద్మాలయ యెచ్చట? మందుడనగు నే నెచ్చట? నే నొనర్చినతపోదానాదు లింతవఱకెవ్వరును చేసియుండరు." అద్యమే సఫలంజన్మసుప్రభాతాచమేనిశా" అనినట్లు నా పుట్టువు సార్థకమైనది. నా సమస్త పురు షార్థములు ఫలించినవి. 'నసంసారాత్ సరోరిపుః' అని శాస్త్రము నిర్దేశించినట్లు సంసారమునకంటె భిన్నమగు శత్రువులేడు. ఇట్టి సంసారమును వర్జించినగాని భగ వదనుభవము సిద్ధింపదు." అని సర్వసంగ పరిత్యాగియై భార్యామాత్రద్వితీయుడై శ్రీరంగమునకు బయలుదేరెను. ఆయనభార్యపేరు ఆండాళమ్మ, ఆమె పచ్చుచు ప్రతిదినమును తనభర్తపాలుద్రావునట్టి బంగారు భృంగారువును మాత్రము గైకొని,

భర్త ననుసరించి వచ్చుచుండెను. తిరుక్కచ్చినంబి తిరిగివచ్చి వరదున కీవిషయము నివేదించెను.

భార్యాభర్త లిరువురును పయనించుమార్గమధ్యమున నొక అరణ్యము కలదు. అపుడు భార్యభర్తను జూచి "స్వామీ! ఈ కాననమున నేమియైన భయ ముండునా?" అని ప్రశ్నించెను. అందులకు కూరనాథు డర్ధాంగినిచూచి, "పిచ్చిదానా! నీవీ చెంబును వెంటతెచ్చెదనంటివా? సర్వత్రభయమే. నీవు దానిని పారవైచిన నెచ్చ టను భయముండదు. ధనవంతునకు లోకమున భయమేమి గిలియుండును. ఆకాశమున పక్షులు - నీటియందు చేపలు-భూమిపై భూతజాలము. ఎట్లు ఆమిషమును భక్షించు చున్నవో అట్లే ధనవంతు డందఱిచేత భక్షింపబడును. మనము గృహస్థమున సమస్త సుఖభోగమ్ము లాభోగమ్ముగాననుభవించితిమి. వానిని వర్జించి వానప్రస్థమును గ్రహిం చితిమి. కేవలము భగవదనుభవముచే కాలము గడుపవలయునని శ్రీరంగమునకు వచ్చుచుంటిమి. అట్టి మనకీస్వర్ణచషకమేల? దానినట పారవేయుము. మనము భయ దూరులమగుదుము" అని పలికెను. ఆ సాధ్వియు భర్తవచించిన వాక్యములయందలి సత్యమును గుర్తించి, ఆ పాత్ర నచ్చట పారవైచెను. కూరనాధుడు భార్యతో కూడి, లక్ష్మీ సహితుడైయున్న రంగనాదుని దర్శించి, భక్తిప్రణామాంజలి చేసియుండగా, ఆ విషయమెఱింగిన యతీంద్రులు కూరనాథుని తీసికొని రమ్మని శిష్యులను దేవా లయమునకు పంపెను. వారుపోయి కూరనాధునికీ విషయమును తెలిపిరి.

అపుడు కూరేశుడు 'ధన్యోస్మి'యని భార్యా సహచరుడై రామానుజుల మఠమునకు పోయెను. రామానుజు లెదురువచ్చి బాహుద్వంద్వమును చాచి, పరిష్వంగ సౌఖ్యము ననుభవించెను. కూరనాధుడు యతినాధుని పాదములకు ప్రణమిల్లి "ప్రభూ ! ఈ దీనుని, తనకు దాసభూతునిగా ననుగ్రహించి, ఈ పాత్రమున కొక ప్రయోజన మును కల్పింపుడు." అని ప్రార్థించెను. పంచసంస్కారాది హితముల నాచరించి యోగీంద్రు లాతని నాదరించిరి. కూరాధిపుడు తనకు యతీంద్రులేసర్వవిధరక్షకుడని నమ్మి గురుభక్తి పరాయణుడై అచంచల భక్తిలోలుడై ఉంఛవృత్తి నవలంబించి కాలము గడుపుచు శ్రీరంగమున వసించి యుండెను.

ఇట్లుండ నొకనాడు సూర్యోదయము మొదలు సూర్యాస్తమయమువఱకు విధి విరామము లేక ఆకసమున పాములు వ్రేలగట్టిరో యనునట్లు కుంభవర్షము

కురియుచుండెను. ఆ దినమున కూరత్తాళ్వారు భిక్షాటనమును సేయుట కవకాశములేక యూరకుండిరి. వంటసేయుటకుగాని, భుజించుటకుగాని, ఇంట నేపదార్థమును లేక యుండెను. ఆయన సాలగ్రామ తీర్థమును స్వీకరించి విశ్రమించెను. అండాళమ్మయు, తినుటకేమియును లేక పరున్నభర్తనుజూచి బాధపడుచుండెను. రాత్రి పది గంటలసమయమున రంగేశునాలయమున, నైవేద్యఘంటికలు మ్రోగుచుండెను. కాహళ ధ్వని వీతెంచెను. ఆ ధ్వనిని విని అండాళమ్మ "ఓ రంగా, నీ భక్తుడు తినుటకేమియు లేక పస్తుండగా నీవుమాత్రము సర్వదివ్యపదార్థమ్ముల నారగించుచుంటివా? ఇది న్యాయమా?" అని భావించి శయనించెను.

ఇటరంగేశుడు దేవాలయాధికారితో "నాకు నివేదించెడి యీ ప్రసాదమును, కూరనాథుని యింటికి పంపవలె"నని ఆదేశించెను. ఆతడర్చకులను నియోగించెను. అంత నా పూజరులు ఆ దేవతాప్రసాదము నొక శుభ్రపాత్రమునందుంచుకొని దానిని వస్త్రముచే కప్పుకొని, శ్వేతచ్ఛత్రమును దానిపైబట్టి అనేక మంగళవాద్యములు మ్రోగుచుండగా దివ్విటీల వెలుగులతో వీధివెంట బయలుదేరి వచ్చుచుండిరి. ఈ ప్రసాద మెవరికోయని వీధివెంబడి ప్రజ లబ్బురు సాచుచుండ, వారు కూరనాథుని కుటీరమునకు వచ్చి రంగేశునాజ్ఞచే తెచ్చితిమని తెల్పి ప్రసాదము నటనుంచి వెడలి పోయిరి.

కూరనాథుడా పాత్రమునకు నమస్కరించి గ్రహించి, యింటప్రవేశించి, భార్యను పిలిచి "తన్వీ? రంగేశ్వరప్రసాదము మనయింటికి వచ్చిన కతంబేమి? నీవేమైన మనన్నున యాచించితివా? ఊరకరాదు. నిజము చెప్పుము." అని అడిగెను. అండాళమ్మ తాను తలంచిన విషయమును విన్నవించెను. ఆ మాటలకు కూరపతి మిక్కిలి పరితాపపడి, "సాధ్వీమణీ! ఎంతదోషము చేసితివి? సర్వేశ్వరు నడిగి ప్రసాదము గ్రహింపనగునా? అది వారి యనుగ్రహముచే రావలయును. భర్తకు భార్య పరిచర్యసలిపి, కూలియమ్మని యడిగినట్లున్నది నీవు చేసినపని. అట్టి స్త్రీ వెలయాలు. గాని ఆలుగాదు. మనము నట్లే సర్వేశ్వరునకు నిజమగు దాసులముకాలేదు. కూలీలమైతిమి. ఇయ్యది దైవప్రసాదమైనను కోరి తెప్పించుకొంటివి కనుక నేను గ్రహింపను. అట్లని ప్రసాదమును పారవేయరాదు. నీవు స్వీకరింపుము.— అని నిర్బంధించెను. ఆమె తనతప్పు తెలిసికొని నిర్వేదమంది భగవత్ప్రసాదమును భక్తిశ్రద్ధలతో గ్రహించెను.

ఆ ప్రసాదమహిమచే నామె గర్భవతి యయ్యెను. నవమాసములునిండెను. పదియవమాసమ్మున మహాతేజస్సంపన్నులగు నిద్దరు శిశువులు జనించిరి. పురుడుగడచిన తదుపరి, ఆక వలల జూచు నుత్సాహముతో యతీంద్రులు ఎంబారును కూరనాథునింటి కంపిరి. ఎంబారు, ఆచారాజ్ఞను విన్పించి, ఆ పసిపిల్లల నిద్దఱను, ఊయెల తొట్టిలో పరుండబెట్టుకొని, ద్వయమును పఠించుచు, తీసికొని వచ్చెను. యతీంద్రులా సినుగుల నిద్దఱంజూచి "ఎంబారూ! ఈ బాలకులయొద్ద మహాపరిమళము విరజిమ్ము చున్నది. ఈ సౌరభ మద్వయమంత్రమునకు తక్క ప్రపంచమున మరొక్క వస్తువునకు లేదు. నీవేమైన సంధించితివా? "అని పృచ్ఛించిరి. అపుడాతడు "సంయమి శ్రేష్ఠా! పసిపిల్లలకు బాలగ్రహదోషములు సోకకుండ నేనే చదివితిని "అని పలుకగానే గురుచంద్రులానందించి, "ఈ బాలకుల కిర్వురకును నీవే ఆచార్యత్వము వహింపవలె" నని తెల్పి యామున సూక్తిదలంచి ఆ పిల్లలిద్దఱకును 'పరాశరభట్టరు' 'వ్యాసభట్టరు' అను నామముల పెట్టెను. చిన్నపిల్లవాడు పెద్దవానికన్న సుందరుడగుటచే "రామదేశికు"లని మరియొక పేరుపెట్టి పిల్లలను త్రిప్పిపంపించిరి. పెద్దపిల్లవాని యందు పుత్రభావమునుంచి రంగేశుడు మిగుల ప్రేమించుచుండ రంగనాయిక చిన్నవానియందు పుత్రభావముతో ప్రవర్తించుచుండెను. ఆ పిల్లలిద్దఱును దినదిన ప్రవర్ధమానులగుచుండిరి. వారిలో పరాశరుని ప్రతిభ దినదినమును వికసించుచుండెను. ఒక దినమున కూరేశుడు నమ్మాళ్వారు పాయించిన తిరువాయిమొళి శిష్యులకు బోధించుచుండెను. అదివిని పరాశరభట్టరు "తండ్రీ! మీరు అణుత్వ మహత్వములకు సమానాధి కరణ్యమును చొప్పించుచున్నారు. అవి పరస్పర విరుద్ధధర్మము కలవికదా! ఒక చోట నెట్లుండును?" అని ప్రశ్నించెను. ఆ వాక్యములకు కూరవిభుండలరి" నాయనా! నీకుపనయనముకాలేదు. కావున వేదాధికారముులేదు. ఉపనీతుండవైన తదుపరి విపులముగా చెప్పెద.

# ధనుర్దాసచరితము

నిచుళాపురమను నొకయూరుకలదు. అందు మల్లయుద్ధ నిపుణుండొకండు కలండు. ఆతనిపేరు ధనుర్దాసు, అతడు శూద్రుడు. ఆతనిభార్య చాలచక్కనిది. ఆమెపేరు పొన్నాచ్చియారు. శ్రీరంగనాథస్వామివారి యుత్సవదర్శన కుతూహలమున ఆతడు భార్యతోగూడి శ్రీరంగమునకు వచ్చెను. ఆయనభార్య వీధివెంట నడచుచుండెను. అతడపుడొక గుడ్డను, ఆమె మోమున కడ్డముగా పట్టుకొని, త్రొక్కుబడక లతో, ఆమెమోమువైపు చూచుచు, వెనుకకు నడచుచుండెను. ఆవింత నారసి యందఱును అబ్బురం బందుచుండిరి. ఆ సమయమున యతీంద్రులు శిష్యసహితులై కావేరీ స్నానము పూర్తిచేసికొని వచ్చుచుండిరి. వారా వింతదృశ్యమును తిలకించి, శిష్యులతో "నటు చూడుడు. లోకమున కాముకు లనేకులు కలరు. కాని యిట్టిసిగ్గులేని వాని నెచ్చటను కానము. కొందఱు రాత్రులందు రహస్యస్థానముల స్త్రీలకు దాసానుదాసులై యుందురు. వీడు పట్టపగలు, మహాజన సమక్షమున నడవిమృగమువలె సంచరించుచున్నాడు." అని పలికి ఆతనిపిలిపించి "నాయనా! మీదేయూరు? ఎచ్చటికి పోవుచున్నారు? ఇంతకు అస్త్రీ యెవ్వతె? ఆమె మొగమునకేల వస్త్రము నడ్డుపెట్టుచుంటివి?" అని అడిగిరి. అందుల కాతడు "దేవరా! మాది నిచుళాపురము. నా పేరు ధనుర్దాసు. నేను శూద్రుండ. ఆమె నా పెండ్లము. ఆమె కన్నులవంటి అందముగల కన్నులు ప్రపంచమున మరెవ్వరికిని లేవు. నేను, ఆమె కన్నులు చూడకుండ క్షణమైన జీవింపజాల. కావున నేనామె నేత్రములు చూచుచు, ఆ సుందరారవిందమ్ములకు నెండగాని, దృష్టిదోషముగాని తగులకుండ తెరనడ్డము పెట్టి నడచుచుంటిని. నేను మల్లయుద్ధనిపుణుడను. రంగనాథస్వామివారి చైత్రోత్సవమును చూచు కుతూహలమున నిట కేగుదెంచితిమి" అని పలికెను.

అందులకు యతిరాజు "ఓయీ! నీ యింతినేత్రములకన్న సుందరములైన కన్నుల చూపించెద. నా వెంట వచ్చెదవా?" అని పలికి, వాని అంగీకారముతో వానిని రంగనాథాలయమునకు తీసికొనిపోయి "స్వామి నేత్రములు చూడుము" అని చూపించెను. అందులకాతడు "స్వామీ! నాకేమియు కన్పించుటలేదు. శిలావిగ్రహమే గోచరించుచున్నది. ఆ కన్ను లెట్టు లందముగనుండును?" అని ప్రశ్నించెను.

అపుడాలోకగురుపు, ఆతనియందు బద్ధాదరుండై "బిడ్డా! రమ్మ." అని శ్రీస్వామివారి శ్రీహస్తములచే నాతని చక్షూద్వయముకడిగి "ఇకచూడుము. నీకు దివ్య దృష్టియొసంగుచుంటిని. నీకు చక్కగా గోచరించును." అని పలికెను. ఆ సన్ని వేశము "దివ్యందదామితేచక్షుః" అని గీతాచార్యులు "అర్జునా! నేనీమాంసనేత్రము లకు గోచరింపను. జ్ఞాననేత్రములిచ్చుచున్నాను చూడుము" అని పలికినటులుండెను. ధనుర్దాసు దివ్యదృష్టి కలిగినవాడై "సూర్యోదయమున వికసించిన సితపుండరీకముల తిరస్కరించు కన్నులును, దివ్యకేయూరకిరీటహారాది భూషణంబులును, కోటిసూర్య ప్రభాస సమానంబగు దివ్యతేజస్సునూ గల స్వామింజూచి, పరమానంద పరవశుండై గద్గదస్వనమున "ధన్యోస్మిగురుచంద్రా ధన్యోస్మి" మీ యనుగ్రహవిశేషమున సర్వే శ్వర దివ్యమంగళ విగ్రహము గోచరించుచున్నది. భగవంతుం డిట్టివాడని పెద్దలు చెప్పగా నెన్నోమారులు వినుచుందును. కాని భగవంతుని చూపించినవారుమాత్రము, మీరుగాక మరొక్కరులేరు. 'హిరణ్మయఃపురుషోదృశ్యతే' అనగా సర్వేశ్వరుడు బంగా రమువంటి ఆకారరేఖలుగలవాడనియు, బంగరుకేశములు కలవాడనియు వేదములు పచించుచున్నవని పెద్దలు చెప్పుచున్నారు. అదేవిధముగా రంగేశుడు కన్నుగవముందు సాక్షాత్కరించియున్నాడు. నా ప్రేయసికేకాదు. జగత్తుననిట్టి నేత్రము లెవ్వరికైన నుండుట అసంభవము. ఈశ్వరునితో సమానమగు వస్తువెయ్యది కలదు? ఉండెనా, ఆతడీశ్వరుండెట్లగును. ఇప్పుడు నా కర్తవ్యమేమో సెలవిండు. ఇట్టినేత్రములు నా కేల చూపించితిరి. నేనేమి చేయవలె? నా కేది దారి?" అని గురుచంద్రుల పదమ్ముల కెరగి, లేచి నమస్కరించి నిలువబడియుండెను.

ధనుర్దాసు డతికామి. మూర్ఖుడు. జ్ఞానరహితుడు. కర్మయోగప్రాప్తి సున్న. భక్తిమృగ్యము. తపమా శశవిషాణము. మరి అట్టివానికి సర్వేశ్వరదివ్యదర్శన ప్రాప్తి కలిగినది. మహాత్ములగువారికే సమయమున, నెచ్చట, ఎందులకు, ఏ జీవిపైననుగ్రహము జనించునో యెవ్వరెరుంగుదురు. దానినేనిర్హేతుకజాయమాన కటాక్షమని పెద్దలందురు. ధనుర్దాసురామానుజునికోరెనా? లేదు. మరి తనంతతానే యతీంద్రుడు నానిం బిలిచి వాని జన్మమునకు సార్థక్యమును చూపించిరి. పరుసవేదిసోక ఇనుము కాంచనమగును! మరలనది యినుముకాదుకదా? అట్లే గురుబ్రహ్మదయచే ధనుర్దాసుండు భక్తిజ్ఞాన వైరాగ్యాది దివ్యగుణభూషణభూషితుం డయ్యెను.

రామానుజులాతనిని దీసికొని మఠమునకు బోయి "ఓయీ! నీకొక దివ్య మంత్రంబుపదేశించెద. గ్రహింతువా?" అని అడిగిరి. అపుడా మల్లుడు "ప్రభూ! గ్రహింతుననుటకుగానీ, లేదనుటకుగానీ నా కధికారమెక్కడిది ? ఈ శరీరము ఆత్మయు సర్వస్వమును మీ అధీనములు." అని పలుక ఆచార్యులత్యంతముదం బంది "ఆ ఆలుమగలిద్దరికిని పంచ సంస్కారాది హితమ్ములాచరించి, మంత్ర మంత్రార్థములనుపదేశించి, అర్థపంచకజ్ఞానము ననుగ్రహించి, మీ దంపతులిత్య పూర్వమువలెనే అన్యోన్య ప్రేమలై భగవదను భవపరులైయుండుడు" అని ప్రబోధించిరి. ఆచార్యముపదేశముచే శ్రీరంగమున నివాస మేర్పాటుచేసికొని వారొకరికన్న నొకరు గురుభక్తియం దద్వితీయులై యుండిరి.

శిష్యులెందఱున్నను, రామానుజులకు ధనుర్దాసునందనురాగము మెండు. ధనుర్దాసునకు గురుదేవునిపై భక్తిమిక్కుటము. వేదాధ్యయన సంపన్నులగు బ్రాహ్మణశిష్యులు యతీంద్రునకు కొందఱు కలరు. వారినితాకవలసివచ్చినచో రామానుజులు తనస్నానమునకు పూర్వమే స్పృశించెడివారు. స్నానానంతరము వారినంట వలసివచ్చినచో వారిపై తడిబట్టవైచి స్పృశించెడివారు. కాని స్నానపూర్వమైనను. స్నానానంతరమైనను, ధనుర్దాసువచ్చి పాదములపై బడినచో వానిని పైకిలేపి ఆలింగనము చేయుచుండిరి. ఈ విషయము బ్రాహ్మణశిష్యులకు కంటగింపైనది. వారందరొకదినమునగుమిగూడి ఈ విషయమును రహస్యముగా చర్చించిరి. "ఏమిరా యిది? మనగురు వర్తనమును గమనించితిరా? ఎంతవిచిత్రము? మనము శాస్త్రములు పఠించితిమి. వేదములధ్యయనించితిమి. కళల నభ్యసించితిమి. ఆచారపరులము. పైగా బ్రహ్మకులసంజాతులము. అట్టి మనలతాకవలసివచ్చిన పైని తడిగుడ్డవైచుట. అహా! ధనుర్దాసు: ఆచారదూరుడు. శాస్త్రపరిజ్ఞానశూన్యుడు. భగవద్భక్తి సున్న. పైగా శూద్రకులజుండు. మల్లయుద్ధమును చేసి స్నానమైనను చేయునో ? లేదో ? వట్టి చెమటకంపు. అట్టివానిని గట్టిగా కౌగలించుకొనుట. దీనికి హేతువేమియై యుండునో ?

వారిలో కొందఱు "ఏమోయీ! అట్లువాగెదరు. ధనుర్దాసుబలశాలి. మల్ల యుద్ధయోద్ధ. సమర్థుడు. రాజాస్థానములకు పోయి అచ్చట జెట్టిమగలతో పట్టుబట్టి జయించియు, మల్లయుద్ధ ప్రదర్శనను లొసంగియు కొల్లగాధనమును దెచ్చి చాటుగా గురువుగారికిచ్చుచున్నాడు. అది డబ్బుపైగల ప్రేమయేకాని వేరుకాదు. ధనమూల

మిదంజగత్తునికదా! మీరు డబ్బు గడించి తెచ్చి యిత్తురా? ఇచ్చినచో మిమ్ములను? అట్లే ప్రేమించును. ధనమే సర్వశ్రేయస్సులకు మూలము. ధనవంతునందఱును ప్రేమింతురు. గురువుగారు పైకి సర్వసంగపరిత్యాగియేకాని, వారికి ధనముపై నాస లేదనియా మీతలంపు? వెఱ్ఱులారా? ధనముపై సర్వేశ్వరునకే మక్కువయెక్కువ. ఇక మనుజులసంగతియేమి?" అని యుపన్యాసమొసంగిరి. మిగిలినవారందఱును దానిని సమర్థించిరి. "మనము గురువుగారి నడిగియే తీరవలె. ఈనా డిదియైనది. రేపేమగునో? గురువుగారు ధనాశాపరులుకానట్లు ధనమును తృణీకరించి పలుకుచుందురు. ఆయన మనకు బోధించునపుడు "విద్యాధనాదులు మదమును పెంచుటకే పనికివచ్చునుగాని, గొప్పతనమునకు కాని, భగవత్ప్రాప్తికిగాని, హేతువులు కావనియు, అందులకు భక్తియే ప్రధాన"మనియు చెప్పుచు తానిట్లాచరించుటయేమంతబాగు? పదుడు. వారి నడుగుదము. "అని అందఱును కూడబలుకుకొని యేదియో అవసరకార్యమున్నట్లుగా రామానుజుల సన్నిధికిపోయి వారియెదుట నిలువబడిరి. యతీంద్రులు వారింగలయ తిలకించి "ఏదియో పవిమీద వచ్చినట్లు మీ మొగములు చెప్పక చెప్పుచున్నవి. సందేహితురేల? నిస్సంశయముగా నడుగుడు" అని పలికిరి.

అంత వారు "అయ్యా! మీరు మమ్ముల నంటవలసివచ్చినచో, మాపై తడిబట్టను వేయుచున్నారు. లేదా స్నానమునకు ముందేగాని, తదుపరి స్పృశింపక యున్నారు. మేము బ్రహ్మజ్ఞాన సంపన్నులము. వేదవేదాంగ పారగులము. మేము శూద్రుడగు ధనుర్దాసుపాటి చేయమా? వాని నెప్పుడైనను తాకుచున్నారు. అందుగల రహస్యమేమో సెలవిండు" అని పలికిరి.

యతీంద్రులేమియు సమాధానము చెప్పలేదు. ఏదో గ్రంథమును పఠించు చుండిరి. శిష్యులు పలుమారులడిగినను పల్లెత్తి పలుక కూరకుండిరి. అంత వారు విసిగివేసారి, వెనుదిరిగిపోయిరి. పోవుచు వారిలో నొకడు "ఏమిరా! దీక్షితులూ! మనమడిగినదానికి మారు పలుకడేమి? బెల్లము కొట్టినరాయివలె గ్రుడ్లు మిటకరించి చూచుచున్నాడు. తానుచేసినది తప్పని తనకుమాత్రము తెలియుటలేదా? తన తప్పు నెట్టు లంగీకరింపగలడు? ఒప్పుకొనక ఎట్టులును తప్పదు. మౌనమర్థాంగీకారము కదా? చూచుచుండుడు. ఇకముం దిట్టిపని చేయండు. అడుగుట మంచిదైనది" అని

పల్కెను. ఇటులు వారిలో వారేదియో భాషించుకొనుచు, తాముచేసిన ఘనకార్యమునకు సంతసించుచు, తమతమ యిండ్ల కేగిరి.

కొన్నిదినములు జరిగినవి. యతీంద్రులు తన కాంతరంగికులగు శిష్యుల నిరువురిబిలిచి, "మీరీరాత్రి, మొన్న గుంపు కట్టుకొని వచ్చిన బ్రాహ్మణ బ్రహ్మచారుల వస్త్రములలో నొక్కొక్కదానినుండి ఒక్కొక్కజేనెడుగుడ్డ కత్తిరించుకొని రండు." అని చెప్పి పంపిరి. వారట్టులే యొనరించి, గుడ్డముక్కల దెచ్చి గురునకు సమర్పించిరి. రెండవనా డుదయము వారు వస్త్రములధరింపవచ్చి చినిగిన వస్త్రములు చూచి, బాధాపూరితమానసులై "అహో! ఎవ్వడీనుష్కార్యమునకు పూనుకొనియె? దైవభక్తులమగు మనవస్త్రములు చింపుకొనిపోయి, ఎవ్వడీ జగమున తనజీవితమును చింపుకొనదలంచె? వాని కాయువుమూడినది. కావుననే యిట్టి దుష్క్రియకు పూనినాడు. ఆ వెధవ యెవ్వడో కంటబడినచో వానిని సజీవదహనము చేయకుంటిమా? సమాధికట్టకుంటిమా?" అని అనేకవిధముల దుర్భాషలాడుచు, వారిలో వారొకరి నెత్తిపై మరొక్కరు దోషారోపణ మొనరించుచు, కలహించుకొనజొచ్చిరి.

యతీంద్రులు ఆ వస్త్రములను చింపుకొనివచ్చిన శిష్యులనే మరుదినమున పిలిచి "ఓయీ! ఈ దినమున ధనుర్దాసు గృహమ్మున నుండడు. మీరర్ధరాత్రమున పోయి ఆతని యాలిమెడలోని స్వర్ణభూషణముల నొలుచుకొనిరండు" అని పంపించెను. వారట్లే అర్ధరాత్రమున ధనుర్దాసుగృహమునకు కన్నమును త్రవ్వి లోన ప్రవేశించిరి. ధనుర్దాసుకళత్రము నిద్రలో మునిగియుండెను. ఆమె యొక ప్రక్కకుతిరిగి పవ్వళించియుండెను. శిష్యులావైపు నగ లూడదీసిరి. అంతలో నామెకు మెలకువ వచ్చెను. దొంగలిద్దఱు ద్వాదశోర్ధ్వపుండ్రములు ధరించియుండిరి. తులసీనలినాక్ష మాలలు వారికంఠసీమల వ్రేలుచుండెను. "పాపము భగవత్కైంకర్యమునకీ భాగవతుల కేదియో ధనావసరమేర్పడినది. లేనిచో భగవద్భక్తులు చోరత్వమునకు పాల్పడుదురా? నేను రెండవవైపునకు తిరిగినచో ఆ వైపు భూషణములు గూడ గ్రహింతురుగాక." అని భావించి, ఆమె రెండవవైపునకు పొరలెను. ఆ వైష్ణవులు చోరకౌశలము లేనివారగుటచే "నీమె మేల్కాంచినది" అని తలంచి భీతచేతస్కులై పారిపోయిరి. నగలుగురుచంద్రుని చేరినవి.

తెల్లవారుచుండగనే ధనుర్దాసుగృహమునకు వచ్చెను.భార్యను నిద్రలేపెను. ఆమె లేచెను. ఒక్కపార్శ్వమునందే ఆమెకు భూషణములుండుట తెలిసిన ధనుర్దాసు

"ప్రేయసీ? ఇదేమి? రెండవవైపు నగలేమైనవి?" అని ప్రశ్నించెను. పొన్నాచ్చియారు గతరాత్రి జరిగిన యుదంతమునంతయును వివరించెను. ఆ వృత్తాంతమును విని "ఎంత పని చేసితివి? చేతికందిన మహాఫలమును పాడుచేసితివి. వారొకవైపు నగలు తీసికొనిన తదుపరి నీవేల ప్రక్కకు తిరిగితివి? అట్లు తిరుగుటకు నీకు స్వతంత్రత యెచ్చటిది? ఈ శరీరము భాగవతాధీనముకదా? ధనము కావలసివచ్చినవారే నిన్ను ప్రక్కకు త్రిప్పి రెండవవైపు టలంకారముల నొలుచుకొని యుండెడివారు. ఆ ధనమంతయు భగవదారాధనమున వెచ్చింపబడియెడిది. మనము కృతార్థులమయ్యెడివారము. నీవు కదలుటచే నింతపని జరిగినది. నీవు చెప్పుచున్న విషయము యథార్థముకాదు. అయ్యో! నగలుపోవుచున్నవే యను చింతతో, వానిని కాపాడుకొనవలయునను దుర్బుద్ధితో, నీ విట్లు చరించితివి. నీవలన భగవద్భాగవతాపచారము సంభవించినది. నీవు నా కికపనికిరావు. నీ యిచ్చవచ్చినతావునకు పొమ్ము" అని పలికి, ఆమె యెంత యేడ్చుచున్నను వినక యింటినుండి బయటకు నెట్టి తలుపులు బిగించుకొనెను.

ఆమె చేయునదిలేక లోకగురుండను రామానుజుల కడకేగి, జరిగినది వినిపించి విలపించెను. యతీంద్రు లామెనోదార్చి నీకేమి భయయుములేదు. ఇచ్చటనే యుండుము" అని పలికి ధనుర్దాసును పిలిపించి, "ఓయీ! ఈమెను వెడలగొట్టుటకు నీకు స్వాతంత్ర్య మెక్కడిది? ఈమె నిర్దోషి. ఆమెను పరిగ్రహింపుము" అని ఆదేశించెను. అపుడు ధనుర్దాసు "ఆర్యా! మీ నిర్దేశమున కన్యథాత్వము సిద్ధింతునా? మీ వాక్యానుసార మామెను స్వీకరించితిని" అని పలికి గురుదేవునకు ప్రణమిల్లెను.

అపుడు గురువృషభులు, కూరేశదాశరథ్యా శిష్యుల పిలిపించి తనపై అభియోగము మోపిన బ్రాహ్మణ శిష్యులనందఱిని రప్పించి, వారందఱి సమక్షమున, తాను కత్తిరించి తెప్పించిన వస్త్రపు ముక్కలన్నియు కుప్పగా నొకవైపున నుంచి, ధనుర్దాసభార్యాభూషణములు మఱియొకవైపుననుంచి "బ్రహ్మజ్ఞాన సంపన్న బ్రాహ్మణ బ్రహ్మచారులారా! ఆచారపూరితులారా? ఈ గుడ్డపేలికల ఖరీదెంతయో, ఈ నగల విలువయెంతయో మీరే నిర్ణయింపుడు" అని పలికిరి. అనగా కూరేశదాశరథ్యాదులు "అయ్యా! యీ గుడ్డపేలికల వెల చాలస్వల్పము. ఈ స్వర్ణభూషల వెల వేలపై నుండును." అని నిర్ణయించిరి. అపుడు యతీంద్రులు వారలంబరికించి చూచి, "ఈ అల్పములగు గుడ్డముక్కలుపోయినందులకు, ఈ విప్రశ్రేష్ఠు లనేకోచ్చనీచముల

కూసిరి. వీరు పలికిన దుర్భాషలు వినరానివి. ఈ గోచిపాతలన్నియు నొక్కరికి చెందినవికూడకాదు. ఇంత స్వల్పవస్తువులకు వీరు హీనమర్యాదులై ప్రవర్తించిరి. ధనుర్దాసుభార్య భూషణముల ఖరీదు అత్యధికము. ఇంతధనము పోయినను విచారింపక, మిగిలిన ధనము భాగవతారాధనముకాకపోయెనే అని బాధపడి, ధనుర్దాసు దారను పరిత్యజించుటకు సిద్ధమయ్యెను. ఇప్పుడు నిర్ణయింపుడు, ఈ విప్రులు బుద్ధిమంతులో, ధనుర్దాసుబుద్ధిమంతుడో స్థిరీకరింపుడు. గొప్పతనమునకు గుణమే కారణము గాని కులముకాదుకదా! కులమదము, ధనమదము, విద్యామదము, వీని మూడింటిని భాగవతుడు విసర్జింప వలయును. మదయుతులగు వారిని తాకిన మదము హెచ్చును. మదహీనులను స్పృశించిన మనలోని మదము తగ్గును. ధనుర్దాసు మదవిహీనుడు. నేను తక్కువ వాడననునైచ్యము ననుసంధించుకొనువాడు. ఇక ఈ బ్రాహ్మణవటులు మే మున్నత కులసంజాతులమను మదసంయుతులు. మేము గొప్పవారమని తలంచువారు. నేను నట్టి మదముగల విప్రజాతియందే జనించితిని నాకుకూడ నట్టిమదము విజృంభింపకుండ ధనుర్దాసును తాకుచున్నాను. ఈ బాపలు నాకన్న నెక్కువమదముకలవారుకావున వీరినంటిన నాకుకూడ మదము హెచ్చునేమోయని వీరినంటుటలేదు. నేనధికుడననుభావమున్నంతవఱకు భగవత్తత్త్వాను సంధానమున కర్హుడుకాడు. అమానిత్వ, అదంభిత్వములు జ్ఞానలక్షణములు. జ్ఞానహీనుడు తానే గొప్పవాడనని ఎంచి గర్వించును. అజ్ఞానికి ఇహపరములందు సుఖములేదు. ధనుర్దాసు జాతిచే నికృష్టుడు, సద్గుణసంపత్తిచే ప్రకృష్టుడు. ఈ బ్రాహ్మణులుకులోత్కృష్టులు. గుణనికృష్టులు. ఇదియే భేదము." అని ఉదాహరణపూర్వకముగా జ్ఞానోపదేశముచేసి, వారికి సమాధానము చెప్పిరి. బ్రాహ్మణ బాలలందఱును లజ్జించిరి. యతీంద్రులు ధనుర్దాసు భూషణముల నన్నింటిని తిరిగి యిచ్చిరి. ఒకసారి దైవార్పణమైనదానిని మరల స్వీకరింపనని ధనుర్దాసు పట్టుబట్టియు, గుర్వాజ్ఞాబద్ధుడై వానిని స్వీకరించి, భార్యతో గృహమ్మునకుపోయెను. శ్రీరామచంద్రునకు నాంజనేయునివలె యతీంద్రులకు ధనుర్దాసు నమ్మినబంటు అయ్యెను. ధనుర్దాసు భార్యయు గురుభక్తియందద్వితీయయై వన్నెకెక్కెను.

యతీంద్రుల ప్రభావ మనుదినమును దిగంతములకు వ్యాపించుచుండెను. ఒకదినమున సర్వజ్ఞభట్టరు అనుపేరుగల పండితుం డొకరుండు యతీంద్రుల ప్రభావమును విని, వారిని జయింపదలచి వాహనారూఢుడై సర్వజ్ఞత్వాది బిరుదములు తెలియజేయు కాహళులు ధ్వనించుచుండ, శ్రీరంగవీధియందు వచ్చుచుండెను. ఆ సమయ

మున కూరత్తాళ్వారి పెద్ద కొమరుండగు పరాశరభట్టరు, వీధులలో నాడుకొను చుండెను. ఆ వచ్చుచున్న పండితుని చూచి, ఆతడు వచ్చుచున్న కారణమును తెలిసి కొని, యాతని కెదురుగా పోయి, రెండుచేతులనిండనిసుకను తీసికొని పండితునితో "అయ్యా! ఈ యిసుక యెంతయో చెప్పుము" అని అడిగెను. ఆ పండితుడు కొలత చెప్పవలయునా, తూనిక చెప్పవలయునా, లేకయిసుకరేణువుల లెక్క చెప్పవలయున అని సందిగ్ధావస్థలో పడి యూరకుండెను. వెంటనే పిల్లవాడొకచేతిలోని యిసుము పా జల్లి ఒకచేతినే చూపించుచు, "సరే. మొదటిది చెప్పలేకపోయితివి. ఇపుడిదియెంతయొ చెప్పుము. "అని అడిగెను. పండితుడులుకలేదు. పలుకలేదు. అంత నా పిల్లవాడు మొదటిది దోసెడు. రెండవది చేరెడు. ఈ మాత్రము చెప్పలేని, నీవు సర్వజ్ఞుడవా నీకీ బిరుదము నేతిబీరకాయకాదా? ఇట్టివాడవఖిలజ్ఞులగు మా గురువుగారితో నెట్ల వాదింపగలవు ? ఇచ్చటనుండియే తిరిగిపోవుటయే మంచిది." అని హేళనచేసెన ఆ పండితుడు శిబిక నవరోహించి, ఆ పిల్లివాడు కూరత్తాళ్వారి బిడ్డయని తెలిసికొ వాని నెత్తుకొని, యగ్గించుచు, కూరత్తాళ్వారియింటికి పోవుచుండెను. ఇంతలో నెచ్చ ధనుర్దాసుభార్య వచ్చి పిల్లవానిని తీసికొని ఆండాళమ్మగారి కప్పగించి, "పిల్లవా నిట్లు స్వేచ్ఛగా వీధులలో విడిచిపెట్టవద్దమ్మా. దృష్టిదోషము తగులును" అని చె వెడలిపోయెను. యతీంద్రుల శిష్యుల కొమరుండగు నొకపసివానికి నా ప్రతిభ చా పోయెకదా, ఇక గురుదేవులతో వాదించుటెట్లని తలపోసి పండితుడు వెనుది పోయెను.

శ్రీరంగమునందొక మూగవాడు తనకు పంచ సంస్కార మొసర్పు గురుదేవులను సంజ్ఞలచే వేడుకొనెను. మూగకు వినపడదు. మంత్రోపదేశమున మాటలురావు. ఇట్టివాని నేమిచేయవలయునా, అని చింతించి. ఒక గృహములో తీసికొనిపోయి, తలుపులువేసి, మూగవానికి తనపాదములు చూపించి, "ఇవియే రక్షకములని యెంచుకొనుము" అని ఆతనికి చూపించుచుండెను. ఈతనికి గురు రెట్లు చెప్పుచున్నారా? యేమి చెప్పుచున్నారా? యని కూరేశులొక చిన్నసోరణ నుండి చూచి, వారు పాదములు చూపుట కచ్చెరువంది "అయ్యో! నేనుకూడ మూ పుట్టకపోయితినికదా? ఇట్టి రహస్యము నాకు చెప్పలేదుకదా?" అని విచారిం అపుడా మూగవాడట్లేయని సన్నచేసి, గురుపాదములకు నమస్కరించి, బయ వచ్చెను. కొంతకాలమా మూగవాడెవ్వరికిని కన్పింపలేదు. తరువాత వాడు ప

వాడు మాటాడుచుండెను. వానిని చూచి సర్వజనులాశ్చర్యధుర్యులైరి. ఇట్లు యతీంద్రులు శ్రీరంగమున, వైష్ణవమత సామ్రాజ్యమును పాలించుచు, బధిర పంగ్వంధక, భిక్షుకాదులకు, బ్రహ్మక్షత్రియ వైశ్య, శూద్రమ్లేచ్ఛశబరపుళిందాది జాతులవారి కందఱకును, వారికి వీరికను భేదములేక, భగవత్సృష్టిలోని సమస్త జనులకు మంత్రోపదేశము చేయుచు, శిష్యప్రశిష్యులవలన భరతఖండమును, భగవన్మయము కావించెను.

భారతమంతయు భాగవత పూతమాయెను. ఎచ్చట చూచిన ద్వాదశోర్ధ్వపుండ్రధారులే, ఎవరిని చూచినను, కంఠాలంకృత తులసీనలినాక్షమాలా విరాజితులే. ఏవంక పారజూచినను ద్వయమంత్రరత్న జపపరాయణులే. ఎవరిభుజమూలములు చూచినను, శంఖచక్ర చిహ్నమండితములే. ఏమిచెప్ప. ప్రపంచమే భాగవతరూపమునను సంధించెను. యమునకు పనిలేకపోయెను. తన ప్రభుత సరిగా సాగనందులకు చింతించి కలిపూరుషుడు తననిలయమును వీడిపోయెను. ధర్మధేనువు నాల్గుపాదముల నడయాడ దొడంగెను. పాపము రూపుమాసె. రంగధామము శ్వేతద్వీపసన్నిభమై అలరారె. సమస్తభూతములకు మోక్షలక్ష్మి కరతలామలకమయ్యెను. ఊర్ధ్వలోకములల్లకల్లోలితములయ్యెను. అర్చిరాది మార్గము లిరుకయ్యెను. తిరుమామణి మంటపమున సందడి హెచ్చెను. నిత్యవిభూతియందు కలకల మెక్కువయ్యెను. జగన్మాతకు మోదము తల మున్కలాయెను. లోకమున ఈషణాత్రయమునకు పోషణ నశించెను. అశేషద్స్వర్గమంతము చెందెను. తాపత్రయము దగ్ధమైచనెను. చింతకు చింతపట్టెను. భవబంధములకు బంధన ప్రాప్తి కలిగెను. స్వర్గాదులకు దుర్గతు లెక్కువయ్యెను. నరకలోకము బీడువారెను. భూలోకమున రామరాజ్యము నెలకొనియె.

అపుడు సమవర్తియు, దేవతాచక్రవర్తియు ఇంక కొందఱు లోకపాలకులును కలిసి పితామహు పాలికింబోయి చతుర్ముఖునితో, తమ తమ లోకములకువచ్చువారెవ్వరును లేరనియు, తల్లోకములు, జనశూన్యములై కళావిహీనములైయున్నవనియు వచించిరి. బ్రహ్మ కొంతతడవాలోచించి, వారలంజూచి "మీరు నాతో జెప్పకొనిన ప్రయోజనమేమి? సర్వేశ్వరునకు విన్నవింతము. వారియాజ్ఞను వర్తులమై చరింతము" అని పలికి వారలందోడ్కొని శ్రీరంగనాధుని సన్నిధికివచ్చెను. వారందఱు "ఓన్నమోభగవతేనారాయణాయ" అని చేతులు జోడించి, చేతులు కట్టుకొని నిలువబడి యుండిరి. వారిని దయార్ద్రదృష్టుల కరుణించి, ఆసనమ్ముల నలంకరింపనియమించి "మీ మీ లోకములకు, మీ పరిజనములకును నేమమా? లోకములకేమియు హాని

పట్టదుకదా! మీరందఱు బ్రహ్మదేవునితో కలసి వచ్చుటం జూడనేదియో పెద్దపని పైననే వచ్చి యుందురని తలంతు చెప్పుడు దానిని తీర్తు"నని పలికెను.

అంతవారందఱు కరసరసి జమ్మలు మొగిడ్చి "దేవాది దేవా! మేము వచ్చిన కార్యం బెరుంగవా? సృష్టి స్థితిలయకారకుండవు జగదంతరాత్మవు. జగన్నియామకుండవు. మా నోట విను కుతూహలమే తక్క దేవరకు తెలియనికార్యము లుండునా? భూతభవిష్యద్వర్తమానకాలనియామకులగు మీకేమని విన్నవింతుము? మా మాలోకములు పాడు బీడైనవి. స్వర్గమెడారియైనది. ఒక్కజీవి యునాకలోకగతుడగుట లేదు. నందనము నిర్మానుష్యమైనది. వియద్గంగా సౌందర్యము వ్యర్థమగుచున్నది. దివ్యాప్సరోంగనలు భవ్యయోగినులైరి. కల్పక మల్పమాయెను. చింతామణి చిన్నబుచ్చుకొనియె. కామధేనువు కపిలగోవుగా నిలిచిపోయె. అమరావతి సామాన్య జనపదమువలె వైభవహీనమయ్యెను. స్వామీ! ఇక నరకవిశేషములరయుడు. డెబ్బదివేల విధములగు నరకములు పాడైనవి. ఇనుపకోరల కుక్కలకు పనిలేదు. కింకరులందరు సోమరులై ఆటపాటల వినోదించుచున్నారు. కుంభీపాకము సంరంభహీనమయ్యెను. గట్టిముక్కులుగల పక్షులు సైతము వైతరణీకూలముల రెక్కలార్చుకొనుచున్నవి. అసిపత్రవనము మసి అయ్యెను. రౌరవంబున కనంత విరామము విరాజిల్లె, భూలోకమున భాగవతులు విడచుతి లోకదానములచే నారకవాసులగు జీవుల వర్గమును చేరినవి, ఇప్పుడు వచ్చువారు లేరు. అదివఱకున్నవారును లేరు. సమవర్తిగోళ్ళు గిల్లుకొను సమయమాసన్నమైనది. జగద్వ్యాపీ! జగన్నిర్మాతా! ఈ లోకములన్నియు నీవు. నీవు కర్తవు. నీవే భర్తవు. హర్తవు. నీయాజ్ఞాబద్ధులమై మేము మా కర్తవ్యదీక్షలో కూరుకొని పోయితిమి ఇపుడు మా కర్తవ్యపాలనమునకు భంగమేర్పడినది. ఇంక కొంతకాల మీస్థితి యిటు కొనసాగినచో పైలోకములన్నియు స్వరూపరహితము లగును. మమ్మేమిచేయ మందురు? దయతో సెలవిండు." అని యందరును ముక్తకంఠమున గగ్గోలుగా నరచిరి. అపుడు సర్వేశ్వరుడు దరస్మితముతో "యజమాని పిల్లవానికి ధనమిచ్చెను. ఆ పిల్లవాడు మంచిచెడు లెరుంగక దానిని వ్యర్థముగా వ్యయించెను. అటులే రామానుజునకు, ఉభయ విభూతులపై అధికారమిచ్చితిని. ఆ కారణమున నింతవచ్చె, ఆ యధికారమును లాగుకొనుటకు వీలులేదు. వేరు కార్యగతిచే దానిని చక్కదిద్దవలయును. మీరు మీ మీలోకములకు పొండు. కొలదికాలములోనే మీ లోకములు నిండునట్లు సంకల్పించెద.

# క్రిమికంఠ చోళ వృత్తాంతము

చోళదేశము సంపన్నము. ఆదేశమునకు క్రిమి కంఠచోళుని ప్రభువుగ పుట్టించి శ్రీహరిశేషతల్పముపై యోగనిద్రా పరవశుండయ్యెను. ఆ క్రిమికంఠుడు త యెనిమిదవయేటనే రాజ్యపాలనమునకు వచ్చెను. ఆతడు శైవమతావలంబి. వానిపు హితుడు నట్టివాడే. వారిరువురు విష్ణుద్వేషులు. వైష్ణవద్వేషులు. ఆతడుశైవమతస్థ కాని వారినివేధింపజొచ్చెను. భాగవతుల బాధింపదొడంగె, విష్ణ్వాలయములు శోధిం వానిలోని ధనమును గ్రహించివానిని పడగొట్టించెను. కొన్నివిష్ణ్వాలయములలోని వి ప్రతిమలను తొలగించి తత్ స్థానమున లింగప్రతిష్ఠ నెరపించెను. హరినామస్మర కావించిన వారికంఠముల నుత్తరింపించెను. నారాయణయనిన వారి నాలుకలు చీలిక చేయించెను. తిరుమణి ధరించిన వారిమొగములు బాడిశలతో చెక్కించెను. తొ పూసలు ధరియించు వారితోలు ఒలిపించెను. నలినాక్షమాలలు ధరించినవారిని తీయించెను. చోళదేశము బీభత్స భయానకరసముల నడుమ నూగిసలాడుచుండె ఆతని దేశమంతయు శైవమతమయము కావింపించెను. "శివాత్పరతరం నా యను పెద్దఫలకమును వ్రాయించి, సర్వప్రజలను పిలిపించిదానిపై సంతకము పొందని యాజ్ఞాపించుచుండెను. రాజాజ్ఞకుభయపడి ప్రజలు తండోపతండము వచ్చి సంతకములుచేసి పోవుచుండిరి. కంనునిరాజ్యమున నిలువలేక కొందరు పోయి వేరురాజ్యముల తలదాచుకొని నట్లుగా, మహాపాపియు, నికృష్ట స్వభా నగు నాతని రాజ్యమున నుండలేక భార్యాపుత్రులతో పొరుగురాజ్యములకు వలస చుండిరి.

అట్లుండగా నొక్కనాడు, 'నాలూరాను' అను వైష్ణవుని రాజభ పట్టుకొని, రాజస్థానమునకు లాగుకొని పోయిరి. నీవుకూడ ఆ ఫలకముపై సంత పెట్టుమని రాజపురోహితుడాజ్ఞాపించెను. అపుడాతడు పురోహితునిగాంచి, "నా అనామకు లెందఱిచే సంతకములు పెట్టించి యేమిఫలము? శ్రీరంగమున జగ ఢగు యతిచంద్రులు కలరు. ఆయన రామానుజుభిధానుడు వేలకొలది శిష్యులు వాడు. ఆయనచే సంతకము చేయించినచో లోకము నందున్న వైష్ణవుల

పెట్టించినట్లే ఆయనచే సంతకము పెట్టింపలేకపోయినచో నా బోటి బీదవైష్ణవులతో నెంతమందితో పెట్టించినను, ప్రయోజనములేదు. ఆ పనిచేయుడు" అనెను.

ఆ పలుకులు విని చోళభూపాలుడు మండిపడి "ఎట్లా! రామానుజులా! అతడు జగద్గురుడా? అతనినిప్పుడే పట్టి తెప్పించెద చూడు" మని కొంతమంది భటులను, తత్కార్యమునకు నియోగించెను. వారు గుఱ్ఱములనెక్కి శ్రీరంగమునకు వచ్చి యతీంద్రుల మఠమును చుట్టుముట్టిరి. ఆ సమయమున రామానుజులు స్నానము చేయుచుండిరి. లక్ష్మణసూరిని పట్టుకొని పోవుటకు భటులు వచ్చిరి. ఏమియగునో? యని శ్రీరంగ ప్రజలు గగ్గోలు పడుచుండిరి. ఆ గల్లంతు విని, కూరత్తాళ్వారు గురువుగారిని పట్టుకొనిపోయిరా? వైష్ణవమంతయు నశించినట్లే. వారిని మాత్రము దొరకనీయరాదు" అని తలంచి, కొంతమంది వైష్ణవులతో నాలోచించి, యతీంద్రులు విడిచిన కాషాయములు ధరించి, త్రిదండకమండులువులుగ్రహించి, వెలుపలికి వచ్చి రాజభటులంగాంచి, "ఏమి పనిమీద వచ్చితిరి?" అని ప్రశ్నింప "రామానుజయోగిని బంధించుకొని రమ్మని రాజాజ్ఞ యైనది. ఎవరాతడు?" అని అడిగిరి. అపుడు కూరాధిపుడు 'నేనే' అని పలికెను.

భటులవెంట కూరేశులు బయలుదేరిరి. దుష్టుడగు చోళనృపతి అతనినేమి చేయునోయని పెరియనంబియు, ఆయనకూతురగు అత్తుళాయమ్మయు వెంబడించిరి. వారు మువ్వురును రాజసేవకులవెంట చోళరాజధానికి పోయి బాహ్యోద్యానమునవసించి "ఇచ్చట వంటచేసికొని భుజించి సాయంసమయమున రాజసభకు వత్తు" మని భటులతో చెప్పి పంపిరి. వారుపోయి ప్రభువుతో "అయ్యా! యతీంద్రులను కొని వచ్చితిమి. బాహ్యోద్యానమున నున్నారు. సాయంతనము సభకు వత్తుమనినారు" అని చెప్పిరి. నాలూరా ఆ మాటలు వినెను. యతీంద్రు డేవిధముగా నున్నాడో చెప్పుమనగా భటులు తమ వెంటవచ్చిన యతీంద్రుల రూపరేఖా విలాసముల నభివర్ణించిరి. ఆ లక్షణము లన్నియు విని నాలూరాను "వచ్చిన వాడు రామానుజుల పెద్దశిష్యుడగు కూరత్తాళ్వారు. కాని యాతడు రామానుజులుకారు." అని నొక్కి వక్కాణించెను. చోళభూపతి మోముజేవురించెను. దేహముడికిపోయెను. గుండెలు మండెను.

గ్రుడ్లెఱ్ఱజేసి భటులంజూచి, "మీరు శీఘ్రముగా శ్రీరంగమునకు పొండు. రామానుజునికి నాయాజ్ఞ తెలిపి సక్రమమార్గమున కొనిరండు. రానని మొండికెత్తినచో దండించియైన బలవంతముగా నాతనిని కొనిరావలె. తీసికొనిరానియెడల మీకు యావజ్జీవకారాగారాశిక్ష తప్పదు. జాగ్రత్త" అని కటువుగా శాసించెను. రాజసేవకు లాగ్రహోదగ్రులై మండిపడుచు ఆ సన్న్యాసి నిప్పుడే పట్టి తెత్తుమని ప్రతినబట్టి హుటాహుటి శ్రీరంగమునకు వచ్చుచుండిరి.

ఇచ్చట యతీంద్రులు స్నానమాచరించి లోనికివచ్చి చూడగా తాను విడిచిన వస్త్రములు లేవు. కూరేశులు వానిని ధరించి రాజసభకు పోయిన సంగతి వినవచ్చెను. అందులకు రామానుజులు నిర్వేదపడుచు, రంగనాథసన్నిధికింబోయి "ప్రభూ! ఏమిది? కల్లోలము నెంతకు తెచ్చితివి. ఇట్టిపాడవు నన్నీ భూలోకమునకేల పంపితివి? ఉభయ విభూతుల కధికారము నిచ్చితివి కదా? మరిట్టి దుష్టధరాధినేత నేల పుట్టించితివి?" అని పలుక రంగనాథుడేమియు ప్రత్యుత్తర మీయక నవ్వి యూరకుండెను.

ఇక ప్రయోజనము లేదని చింతించి, రామానుజులు మఠమున కేగి, కూరేశుల శ్వేతవస్త్రములు తాను ధరించి, ఇక నచ్చట నుండతలంపక శ్రీరంగమునుండి బయలుదేరి పశ్చిమాభిముఖుడై బయలుదేరెను. వారి వెంట నలుబదిమంది శిష్యులు మాత్రముండిరి. ఇంతలో రాజభటులు శ్రీరంగమునకు వచ్చి రామానుజులు విషయ మెఱింగి వెంటబడిరి. శిష్యులు వారిని జూచి, "ప్రభూ? అరుగో, రాజభటులు వెంబడించుచున్నారు. మనలను పట్టుకొని పోగలరు. సమీపమునకు వచ్చిరి. ఎట్లు తప్పించుకొనవచ్చును?" అని గోలపెట్టిరి. యతీంద్రులు సమీపించిన రాజభటులనుజూచి, విష్ణుచిత్తులవారు చెప్పిన పల్లాండు పఠించి, యిసుక తీసికొని చల్లిరి. ఆ యిసుకరేణువులు పర్వతములుగా గోచరించి, అడ్డువచ్చెను. సైనికులానగశ్రేణుల జూచి, "అరవవైష్ణవులు మంత్రములు చదివి, మనల మోసగించి, కనబడకుండ పారిపోయిరి. ఇక లాభము లేదు." అని తలంచి రాజధానికి మరలిపోయిరి. రాజున కావిషయము నివేదించిరి.

సాయం సమయము సమాసన్నమాయెను. కూరేశులు, పెరియనంబియు, నత్తుళాయమ్మయు వెంటరా, రాజసభకు పోయిరి. రాజపురోహితుడు కూరేశులజూచి "దీనిమీద సంతకము పెట్టుడు." అనెను. అపుడు కూరేశులు "వట్టి సంతకముతో

మీకేమి ప్రయోజనము ? నాతో వాదింపుడు. మీరు జయించినచో సంతకము చేయు దును. ఒకవేళ నేను జయించినచో మీరు వైష్ణవులు కావలయును." అనెను.

రాజపురోహితుడంగీకరించెను. "మీరే కారణమున శివునికంటె పరాత్పరుడు వేరులేరని పలుకుచున్నారు?" అని కూరేశులడుగగా, రాజపురోహితుడు కొన్నికారణములు ప్రపంచించెను. ఆ విషయముల నన్నింటిని శతవిధమ్ముల ఖండించి "సర్వవేదములు, శాస్త్రములు, ఇతిహాసములు, పురాణములు, సర్వేశ్వరుడు నారాయణుండనియు, నాతడే మోక్షప్రదాతయనియు ఘోషించుచుండ మీ రిట్లు పక్షపాతించుట తగదు" అని కూరేశులు పలికిరి. చోళభూపతి ఆవాదమును విని "ఎందుకయ్యా! పనికిమాలిన వైష్ణవుడానికీ కంఠశోష? నీ శాస్త్రవాదము నా కేమియు తెలియుటలేదు. నీవు సంతకము చేయుటయే నాకు కావలసినది" అనెను. అందులకు కూరేశులు "భూపతీ ! నీకు శాస్త్ర పరిచయములేదు. కావున నా వాదము నీ కవగతము కాదు. నీకు కూడ తెలియునట్లు చెప్పెద వినుము. "కాలు సాచిన వా డొకడు. చాచినపాదమును కడిగిన వా డొకడు. కడిగిన నీటిని తలపైధరించిన వా డొకడు. ఈ ముగ్గురిలో నెవ్వడు గొప్పవాడందువు? "కాలు సాచినవాడే గొప్ప వాడని రాజు ముక్తసరిగా సమాధానము నొసంగెను. అపుడు కూరేశులు "ఐనచో రాజా! సావధాన మతివై ఆకర్ణింపుము. బలిని యాచించి త్రివిక్రముడు తనకాలిని గగనమునకు చాచెను. అది బ్రహ్మాండ కటాహమును బ్రద్దలు చేసెను ఆ పాద మును చూచి తనతండ్రి పాదమని బ్రహ్మ కడిగి, తజ్జలమును తన కమండులువు నందు భద్రపరచెను. భగీరథుని తపఃఫలముగా బ్రహ్మ ఆ నీటిని విడిచెను. ఆ జల మును ధూర్జటి జటాజూటమున ధరించెను. దీనివిధానమిది. ఇప్పుడు చెప్పుము. వీరిలో నెవ్వడధికుడు?" అనెను.

చోళభూపతి మండిపడి, "నీవు తెలివిగలవాడవు. కావున యుక్తి ప్రయుక్తు లుపచరించుచున్నావు. అది యంతయు మాకు పనికిరాదు. సంతకము పెట్టుము. లేదా శిక్ష ననుభవింపుము" అని పలికెను. కూరేశులా ఫలకమును తీసికొని దానిమీద "శివాత్పరతరం నాస్తి" అను వాక్యము క్రింద "ద్రోణమస్తి ఇతఃపరః" అని వ్రాసి సంతకము పెట్టెను. రాజ పురోహితుడయ్యదికాంచి "రాజా! ఈ వైష్ణవుడు మనము వ్రాసిన పత్రికను కించపఱచి సంతకమొనరించెను. ఎట్లన 'శివ' అను శబ్ద మునకు 'తూము' అను మరియొక అర్థము కలదు. 'శివాత్' తూమునకంటె,'పరతరం

నాస్తి' ఇతరమైన పెద్దదిలేదు. (తూముసకంటె వేరువస్తువు పెద్దదిలేదు) అను నర్థమును తీసికొని, "ద్రోణమస్తి ఇతఃపరం" అని వ్రాసినాడు ద్రోణ మనఇందుము తూమునకన్న పెద్దది యిస్దుమున్నదిగదాయని పరిహసించి సంతక మొసరించెను." అని పలికెను. ఆ మాటలకు చోళభూపతి క్రుద్ధుడై "మమ్మెల్లిదముగా గొని హేళన చేయుదునా? నీ నేత్రములు పీకించెద"నని పలికెను.

కూరేశులామాటవిని "నిన్నుజూచిన నేత్రములతో నా గురువును చూడను ఇవిగో నేత్రములు" అని తనవాడి గోళ్ళతో తన నేత్రములు రెండును పెటుక్కన నూడబెరికి, క్రిందపారవైచెను పెరియనంబి కన్నుల నా దుర్మార్గుడే పీకించెను నేత్ర హీనులగు నా యిద్దరిని వెంట నిడుకొని, అత్తుళాయమ్మగారు బయలుదేరి వచ్చు చుండిరి పెరియనంబి కప్పటికి నూటయైదువత్సరములు మిక్కిలి వృద్ధుడగుటచే నేత్రోత్పాటన బాధను భరింపంజాలక శరీరమును వీడదలంచి, యొక ఆరామమున పవ్వ ళించెను కూరేశులయ్యది తెలిసికొని "అయ్యా! మిమ్ము శ్రీరంగమునకు కొనిపోవు దుమా? యని ప్రశ్నింప పెరియనంబి "వలదు నేనిపుడు శ్రీరంగమున దేహమును విడిచితినా, సామాన్యప్రజలందరు దేవాలయమున తనువు పరిత్యజించిననే గాని ముక్తిసిద్ధింపదని తలంతురు. దానిచే ప్రతివ్యక్తియు నాలయముననే మరణింప సమ కట్టును. ప్రపన్నునకు దేశకాలములు ప్రయోజనకారులుకావు. ఎప్పుడెచ్చట మృతి నందినను, మోక్షమునకు కొఱంతలేదు" అని చెప్పి యావనముననే శరీరమును విడి చెను పెరియనంబి పుత్రులు వచ్చి తండ్రికి బ్రహ్మమేధాది సంస్కారము లాచ రించి, కూరేశులతో శ్రీరంగమునకు వచ్చి తమనివాసములనుండిరి.

ఒకనాడు కూరేశులు రంగనాదుని సేవింపదేవాలయమునకు వచ్చిరి. ద్వారము కడనున్న రాజభటులు, ఆయనను చూచి "నీవు రామానుజుల సంబంధము వదలుకొంటివా, కోవెలలోనికి పోవచ్చును. లేనిచో లోనికి ప్రవేశించుటకు వీలు లేదు "అని పలికిరి. ఆ మాటలు విని కూరనాథుడు "హరిహరీ! ఎట్టెట్టివపు మాట వినవలసివచ్చినది? రామానుజ సంబంధమే లేనినాడు నాకీ రంగనాథ దర్శనమేటికి?" అని తిరిగి యింటికిపోయెను.

ఇచ్చట యతీంద్రులు శిష్యసహితులై, అహోరాత్రములు పశ్చిమాభి ముఖులై పయనించుచు, ఆరుదినములు నడచిరి. మధ్యేమార్గమున పెద్దగాలివాన

గొట్టెను. ఆ ప్రభంజనమున కటవీవృక్షములు వ్రేళ్ళతో పెల్లగిలి పడుచుండెను. అడవి యంతయు జలమయమాయెను. అట్టిచో సూర్యుండ స్తంగతుడయ్యెను. దిక్కు లంధకారబంధురము లాయెను. అట్టి దారుణసమయమున రామానుజుల శిష్యు లెవరికి వారుగా విడిపోయిరి. ఒకరికొకరి సంబంధము లేకయుండెను. చలికి బాధపడుచు శిష్యులగానక రామానుజులారాత్రి యంతయుం నొంటరిగా గడపిరి. తెల్లవారినది. అంబరమణి యుదయాద్రిమీది కేతెంచెను. ఒక చిన్నపర్వత మచ్చట కలదు. దాని సమీపమున సెలయేరున్నది. చలికి బాధపడుచునే సెలయేటికడ గుడ్డలను పిండుకొను చుండిరి. శిష్యులారేయి గురువును కానక వెదకి వెదకి దిక్కుతెలియక యింకను త్రిమ్మరుచునే యుండిరి. ఉదయమున వస్త్రములు పిండుకొనుచున్న గురువునుగాంచి, నష్టమైపోయిన సేవధి మరల దొరికినట్లు మోదమందుచు, గురువుంజేరి, "స్వామీ? ఈ రాత్రి మీకెట్లు గడచినది? మీ రెట్లు తప్పిపోయితిరి? మీ కొఱకు తెల్లవారులును వెదకుచునే యుంటిమి. మా యదృష్టవశమున మీ రిప్పటికి మాకు కనిపించిరి." అని పలికిరి. లక్ష్మణసూరి శిష్యులజూచి, "జరిగిన విషయముల తరువాత ముచ్చటించు కొనవచ్చును. శీతు బాధ కోర్వలేకయున్నాను. చేతులు కొంకర్లుపోవుచున్నవి. నిప్పు ఎచ్చటనైన దొరకునేమో ముందు వెదకుడు. స్వాధీనము తప్పిన ఈ శరీరము కొంత తడవు నిప్పుతో కాచినగాని వశమగునట్లు లేదు" అని చెప్పెను. అపుడు శిష్యులు గురువుగారి నెత్తుకొని సమీపమున గ్రామ మెటనైన నున్నదేమోయని పరికించుచు పోవుచుండిరి.

మార్గ మధ్యమున, త్రోవ కిరుపైపుల కొన్ని జొన్నచేలు కలవు. పండి కంకులు క్రొత్త పెండ్లికూతుండ్లవలె తలలు వంచుకొని, చిరుగాలి తరగల నటునిటు కదలుచున్నవి. కొందఱు వ్యాధులు ఆ జొన్నచేలలో మంచెలమీద కూర్చుండి, వచ్చు చున్న వైష్ణవులజూచి దిగి వచ్చి నమస్కరించి, "సాములారా! మీ దే దేశము? ఎచటనుండి ఎచ్చటికి పోవుచున్నారు. మీరు వైష్ణవ స్వాములుగా గోచరించు చున్నారు. మేమును వారి శిష్యులమే" అనిరి. అంతనా వైష్ణవులాబోయలను కలయ జూచి "మాది శ్రీరంగము. ఎంబెరుమానారు శిష్యులము. ఒకానొక కారణమున, శ్రీ రంగమును విడిచి వచ్చుచున్నాము" అని పలికిరి. పుళిందులావాక్యములు విని యానందించి, "అయ్యలారా! మీది శ్రీరంగమని చెప్పుచున్నారు. రంగేశునకు

క్షేమమా ? రంగనాయకి సుఖముగా నున్నదా? అర్చకులు, పరిజనము, కుశలమున నుండిరా? జగద్గురువులు, ఎంబెరుమానారు సేమముగా నుండిరా ? మా గురువు నల్లాన్ చక్రవర్తుల వారు. మాకు వారే పంచసంస్కారము చేసి, మంత్రార్థము నుపదేశించిరి. వారు కొంతకాలముండి తిరిగిపోయిరి. పోవుచుండగా మేము వారింజేరి "స్వామీ! మాకు ముఖ్య రక్షకమేమో సెలవిండు, మీరుపదేశించిన వన్నియు మాకు రాకపోవచ్చును." అని నమస్కరించితిమి. వారు మాతో మీకివి రానిచో ప్రతిదినమును, మీరు మీ నిత్యకృత్యము లన్నియు నెరవేర్చుకొనుచు, స్నానముచేసి, ఊర్ధ్వపుండ్రధారణము చేసి, "శ్రీమతేరామానుజాయనమః" అని నాల్గుపర్యాయములు తలంచి, ఎంబెరుమానారు దివ్యతిరువడిగళేశరణమ్ అని నమ్మియుండుడు" అని చెప్పిరి. అప్పటినుండియు, మేమిట్లే చేయుచుంటిమి. అందువలన రామానుజుల వారి నడిగితిమి" అనిరి. అందుల కాశిష్యులు "మేమును రామానుజుల వారి శిష్యులమే. వీరే ఎంబెరుమానారు విశ్వగురువులు వారొకానొకకారణమున శ్రీరంగమును వీడి వచ్చుచున్నారు. త్రోవలో వానదెబ్బతింటిమి" అనగా ఆ వ్యాధులంవరు ఎండుపుల్లల నేరితెచ్చి మంటజేసి, చలికాచుకొనుడని వారి వస్త్రములు అగ్నివేడిమిచే నారునట్లుచేసి, యీయగా వానిని ధరించి, చలిబాధ నివర్తింపజేసికొని ఆదినమున కాకిరాతుల యిండ్ల కడ నివసించిరి. కిరాతులంద రేకమై ఆలోచించి, జగదాచార్యులు మన పూర్వజన్మ సుకృతమున మనయిండ్లకు వచ్చినారు. ఎన్నిభవముల పున్నెమోకదా యిది? వారిని నిరాహారులుగానుంచుటెట్లు ? అని క్రొత్తకుండలను, జొన్నకంకులను, మంచిపట్టు తేనెను తెచ్చి యిచ్చిరి. వారా జొన్న కంకులను కొట్టి, వేయించి, తేనెయందు కలిపి, భగవంతునకు నివేదించి, దానినే భుజించి, ఆ రాత్రి అచ్చట నిద్రించిరి.

తెల్లవారినది. కిరాతులు జగత్పూజ్యులకు నమస్కరించి "దేవరా ! మీ కిక్కడ వసతియుండదు. ఈ సమీపమున కొండకు దిగువ, పడమటిదిక్కున నొక బ్రాహ్మణాగ్రహారమున్నది. అక్కడ నివాసమునకు వీలుగా నుండును. కనుక మీరు మా వెంట వచ్చినచో పంపించెదము" అని పలికి, వారిం వెంట దీసికొని అగ్రహార మునకుంబోయి ఒక బ్రాహ్మణ గృహమునుచేరి, ఆ గృహిణితో "అమ్మా! వీరు మా గురుదేవులు, వీరికి కావలసిన భోజనవస్తువు లన్నియును, నీయవలసినదని, మేము చెప్పితిమని, మీ పెనిమిటిగారికి చెప్పుడు. వారి కీ విషయమున నెంత ఖర్చగునో, ఆమూల్యమును మేము చెల్లింతుము" అని చెప్పి వారి నప్పగించి, గురువులకు నమ స్కరించి వెనుదిరిగిపోయిరి.

సూర్యుడు పశ్చిమాభి ముఖుండగుచుండెను. స్థూలవస్తువులు సైతము దృశ్యాదృశ్యములుగ గోచరించుచుండెను. ఆ యిల్లాలు వారి కర్ఘ్య పాద్యాదివివిధముల సత్కారమును నెఱపి, చాపలుపఱచి, కూర్చుండబెట్టి "పెద్దలారా! మీదే యూరు? ఎందుల కేగుచున్నారు?" అని అడిగెను. అంత నా వైష్ణవులు "తల్లీ! మాది శ్రీరంగము. మేము ఎంబెరు మానారు శిష్యులము మా గమ్యస్థానమేదియో మాకే తెలియము" అనిరి. అందులకామె "ఏమీ! మీది శ్రీ రంగమా? రంగనాథునకు శుభమా? అమ్మవారికి భద్రమా? జగదాచార్యులు రామానుజులకు సేమమా ?" అని కుశల ప్రశ్నలు వైచి నేను ఎంబెరు మానారు శిష్యురాలనే" అని చెప్పెను. అందులకువారు "అమ్మా? శ్రీరంగమునకు క్షేమమునకు నెంతదవ్వు? రంగనాథుడుండియు లేనివాడే. దుష్టుడగు చోళరాజుచే శ్రీరంగ దివ్యదేవాలయ మాక్రమింపబడినది. రంగవాసులగు శ్రీ వైష్ణవులందరును, రంగమును వీడిపోయి చెట్టున కొక పిట్టయైరి. ఎంబెరు మానారు కతిపయ శిష్య పరివారుడై దేశాంతరగతుడయ్యెను. రంగేశ్వర వైభవము వన్నె తగ్గినది. దుశ్శీలుడగు నా రాజుపాలనమున నివసింపజాలక వచ్చుచున్నారము. నీవు ఎంబెరు మానారు శిష్యురాలనంటివి. ఎపుడు, ఎచ్చట, ఏ విధముగా వారి నాశ్రయించితివి? నీకు వారెట్లు గురువులైరి?" అని ప్రశ్నించిరి.

ఆ సాధ్వి శ్రీరంగ దుస్థితికి మిక్కిలి వగచి "పూర్వ మొకప్పుడు దేవమాతృక మగు నీ భూమి వర్షాభావముచే సస్య విహీనమయ్యె. క్షామదేవతా కరాళ తాండవము విజృంభించెను. తినుటకన్నము లేక, త్రావ నీరులేక, జనులు మల మల మాడిపోయిరి. ఈ దేశవాసులందరు గృహములను వీడిదారపుత్రులతో, ఎవరికి తోచిన దేశమునకు వారు తరలిపోయిరి. పశుపక్షి మృగాదులు నేవంక కేగెనో, నొక్కటియు గోచరింపవయ్యె. అట్టి తరినేను, నా పతియు శ్రీరంగమునకు పోయి తల దాచుకొంటిమి శ్రీరంగము నదీమాతృకమగుటచే సుభిక్షముగ నుండెను. మే మచట నొక మిద్దెపై నుంటిమి. ఒకనాడు ఎంబెరు మానారు మేమున్న యింటికి భిక్షకు వచ్చిరి. అప్పుడు నేను దిగివచ్చి వారుపోవు త్రోవకడ్డముగ నిలుచుంటిని. అపుడు వారు "అమ్మా! ఎందుల కడ్డగించుచుంటివి. త్రోవ నొసగి పోనిమ్ము" అనపరికిరి. అపుడు నేను స్వామీ! దారి నిచ్చెదను. మీరు పోవచ్చును. కాని మిమ్ము చూచిన, యీ దేశవాసులు, మహా విద్వాంసులు, మహీసార్వభౌములు, రంగనాథునికన్న మిన్నగా నెన్ని మిమ్ము పూజించుచున్నారు. సహస్రములకొలది శిష్యులు మిమ్ము పరివేష్టించు

చున్నారు. ఇదియేమిమాయ? మచ్చుపొడియా? లేక గారడీవిద్యయా? అది నాకు
చెప్పుడు. "అంటిని. అందులకామహాభాగుడు మందస్మితమాచరించి "మాయలు,
మచ్చుమందులు, మాపేరు విన్నమాసిపోవును. గారడీ విద్య లెంతసేపు ప్రజలను
నమ్మించును? మా యొద్ద నొకమంత్రమున్నది. దాని ప్రభావముచే నన్నిట్లు పూజించు
చున్నారు" అని సెలవిచ్చిరి. అట్లయినచో స్వామీ! ఆ మంత్రరాజమును వినుటకు నా
కర్హతయున్న యెడల నాకుపదేశింపుడు" అని వేడుకొంటిని.

అందులకా కరుణామయులు "అమ్మా! యీ మంత్రపఠనమున కందఱకు
నధికారమున్నది. రోగపీడితులకు తక్క మిగిలినవారి కన్నము తినుట కెట్లధికారము
కలదో అట్లే పాపజ్వరార్తులకు తక్క మిగిలినవారందఱకు నీ మంత్రమునందధికారము
కలదు. దీనికి ప్రేమయొక్కటియే ముఖ్యము. చెప్పెదవినుము "అని ఆ మంత్రరాజము
నా కుపదేశించిరి.

ఆ తరువాత కొంతకాలమునకు మా దేశమున వానలు కురిసెను.పంటలు
పండెను. తదవసరమున మా దేశమునకు మరలి వచ్చుచు స్వామికడకు పోయి
"స్వామీ! మీరుపదేశించిన మంత్రమును మఱచితిని. మా దేశము పుష్కల సస్య
సమృద్ధమైనదట. పోవుచుంటిమి. మరల నొకపరి చెప్పుడు. నా కర్పించు కొనుట
కొఱకు, తమపాదుక లొసంగుడు" అని ప్రార్థించితిని. వారు మరల నా మంత్రము
చెప్పిరి. అర్పించుకొనుటకై వారి పాదుకలు దయచేసిరి. ఆ పావుకోళ్ళను నా పైట
కొంగు చాపి స్వీకరించితిని. అప్పటినుండియు నాకు, కొంగు పెరాట్టియను పేరు స్థిర
మయ్యెను. నేనును, వారి యాజ్ఞానుసారముగా పూజించు కొనుచున్నాను. వారి దర్శ
నమునకు మరల నోచుకొనలేదు. నేనబలను. కావున మరల ఆదేశమునకు పోజాలను
నాకీ జీవితమున వారి దర్శన ప్రాప్తియున్నదో? లేదో? అని తన పూర్వ వృత్తాంత
మును చెప్పి దుఃఖించెను. మరల వారలంజూచి "ఆర్యులారా! మీరును వారిశిష్యులే
కావున నాకు సోదరులు, నేను చేసిన వంట మీరు తినవచ్చును మీ యంగీకృతియైనచో
వంటపని కారంభింతును" అని పలికెను. వారంగీకరించిరి.

ఆమె ఆ ప్రయత్న మొనర్చుచుండెను. యతీంద్రు లిరువురు శిష్యులం
బిలిచి. 'ఆమె యెట్లు వంటచేయుచున్నదో? చూచి రండు" అని పంపెను. వారు
పోయి చూచి వచ్చి గురుదేవులతో "మహాత్మా! ఆమె అఘమర్షణ స్నానమాచరించి

నది. వేరువస్త్రములు ధరించినది. స్వరూపధారణము చేసినది. గురుపరంపరచదువుచు వంటనంతయు శుచిగా చేసి, గంపలయందుంచి, వానిని తిరువాలాధగృహమ్మున పదిల పరచి, మరల శుభ్రవసనమును ధరించి, సన్నిధియందు దీపారాధన మొనరించి, యొక పీఠముపై తమపాదుకలనుంచి, అర్ఘ్యపాద్యాచమనీయస్నానాదులు సమర్పించి, పదార్థముల నన్నింటిని పాదుకలకు నివేదించినది మరల నర్ఘ్యపాద్యాదులు సమర్పించి మంత్రములు చక్కగా చదువుచున్నది" అని చెప్పిరి. అంత అచేలాంచలాంబ (కొంగుపిరాట్టియొక్క సంస్కృతనామము) వైష్ణవుల కడకు వచ్చి "వైష్ణవ స్వాములారా! వంటసిద్ధమైనది. వేడితరుగకముందే భుజింపుడు" అనిపలికెను.

యతీంద్రులామెను పిలిచి, "వత్సే! నీకు రామానుజు లుపదేశించిన మంత్రము స్మరణలోనున్నచో నా చెవిలో చెప్పుము" అనెను. ఆమె తిరుమంత్రము, చరమశ్లోకమును వారి చెవిలో చెప్పెను. రామానుజులు సంతసించి "అమ్మా! వీరిలో రామానుజుడున్నాడేమో చూడుము. యతిరాజు నీకు పాదుకలిచ్చినాడంటివికదా! వాని సాయమున నీ గురువిటనున్నాడేమో, కనుగొమ్ము" అని వాక్రుచ్చెను. ఆ సాధ్వి కుడిచేత పాదుకలు, రెండవచేత దీపమును పట్టుకొని, వరుసగా వారిపాదములకు తొడుగుచు వచ్చెను. కొందఱి కవి యెక్కువయ్యెను. కొందఱికి తక్కువయ్యెను. యతీంద్రుల పాదములకు చక్కగా సరిపోయెను. ఆ చేమ, యతీంద్రుల మోమున దృష్టి నిల్పి, ముఖకవళికలు కొలదిసేపు తేరిపారజూచి, "శ్వేతాంబరధారివైన కతమున సంశయించుచుంటిని కాని, మీరే మా గురుదేవులవలె వెలుంగుచున్నారు" అనెను. అంత యతీంద్రులామెతో "తల్లీ! కారణాంతరముల వలన ఈ తెల్లబట్టలు ధరించితి. నేనే ఎంబెరుమానారును" అనిరి. ఆపతివ్రత నివ్వెరపడి "ఓదయాసాగరా! ఎంత కాలమునకు మిమ్ము కనగలిగి నాకన్నులు కృతార్థత చెందినవి. నా జన్మము పావనమైనది. నా పుట్టువు సార్థకము." అని పలుకుచు వారి పదారవిందములపై బడి బోరపరోదించెను. యతీంద్రులామెను లేవనెత్తి, కన్నీరు తుడిచి "అమ్మా! నీ భక్తిశ్రద్ధలకు, నీ విజ్ఞతకు సంతోషించితి" అని శిష్యులజూచి "రాజరాజు నాతిథ్యమును తిరస్కరించి, శ్రీకృష్ణ పరమాత్మ విదురుని యింట ప్రేమతో నారగించెను. దండకాటవిలో, చక్రవర్తి సూనుడగు శ్రీరామచంద్రుడు మహర్షుల కాదని బోయెతఎంగిలి

ఫలముల ప్రీతితో భక్షించెను. భక్తిప్రధానమేకాని, పదార్థాధిక్యము కారణముకాదు. ఈమె చేసిన పదార్థములు మహా పవిత్రములైనవి "అని చెప్పగా, శిష్యులు కాలు సేతులు ప్రక్షాళించుకొని పంక్తిని కూరుచుండి, అన్నము, సూపము, నేయి, అపూప ములు మొదలగు పదార్థములు తృప్తిగా భుజించిరి. అపుడు గురుపర్యులామెను చూచి "అమ్మా! నా పాదుకల కర్పించిన పదార్థములు మీ రారగింపదగును గాని నాకు తగవు. దైవనివేదనము చేయని పదార్థములను నేను స్వీకరింపను" అని పలుక ఆమె కొన్నిఫలములు పాలు నొసంగెను. వానిని వరదరాజస్వామి వారికి నైవేద్యమిడి వానిని గ్రహించి తృప్తినందిరి. శ్రీరంగమునుండి బయలుదేరిన యేడవదినమున నాచేలాంచలాంబగృహమున తృప్తిగా భుజించి నిద్రించిరి. ఆయోషిల్లలామ, వారి భుక్తావశేషమును గ్రహించి మేడపై నిద్రించుచున్న భర్తకు పెట్టి తాను భుజింపక పరుండెను. అపుడు భర్త ఆమెతో "ప్రియా! నాకీ పదార్థముల నెల్లపెట్టి నీవు తినని కారణం బేమి?" అనెను. అందులకామె "స్వామీ! చాలకాలము తదుపరి, ఆచార్య పర్యులు శిష్యసమేతులై శ్రీరంగమునుండి మనయింటి కరుగుదెంచిరి. శిష్యులంద ఱును భక్షించిరిగాని, గురుపర్యులు భుజింపలేదు. అవైష్ణవులగు వారి యిండ్ల వారు భుజింపరు. మీరువారికడ శిష్యత్వమును, భజింపని కారణమున వారు మనయింట తిన లేదు. వారుపవసించి యుండుటచే, నేనును భుజింపదలపలేదు." అని చెప్పెను. ఆ మాటలకు భర్త బాధనంది "దేవీ! నేనును వారి శ్రీ పాదంబు లాశ్రయింతు. సంది యము వలదు భుజింపుము" అని పలుకగా, ఆమెయు భోజనమొనర్చి, భర్తతో సుఖ నిద్ర చేసెను.

రెండవనాడు యతీంద్రులు, కాషాయ వస్త్రములను, త్రిదండమును సంపా దించిరి. చేలాంచలాంబయింట కొన్నిదినములుండిరి. ఇంటి యజమానియు వారి శిష్యుడై భార్యతోగూడ శుశ్రూషచేయుచుండెను. శ్రీరంగమును వీడిన దుఃఖమును, మార్గాయాసమును తీరిన తరువాత కొన్నిదినములకు వారి యింటనుండి పశ్చిమదిశగా పయనింప బయలుదేరిరి. వారి వియోగమును భరింపజాలక ఆ దంపతులు వారిని కొంతదూరము సాగనంపి, దుఃఖించుచుండ దేశికేంద్రులు వారి నూరడించి, మరల నొకసారి తప్పక వత్తుమని తెలిపి, వారి నట నివారించి, కొంతదూరము నడచి సాల గ్రామమను పేరుగల యొకయూరు చేరిరి.

ఆ గ్రామమున వసించు వారందఱును మాయావాదులు. వారు వీరిని పూజింపలేదు. అపుడు జగద్దేశికులు దాశరథినిచూచి "ఈ గ్రామవాసులందఱును

మూర్ఖులవలె నున్నారు. వీరి యజ్ఞానమును రూపుమాపవలె. వీరు త్రావుటకు మంచి నీరము నెచ్చటనుండి తెచ్చుకొందురో, ఆ కొలను నందు నీవు పాదములు కడిగికొని రమ్ము "అని ఆదేశించిరి. దాశరధి ఆ గ్రామవాసులు జలమును తెచ్చుకొను చెఱువులో దిగి, ఆ జలమునందు కొంత తడవు నిలుచుండి వచ్చెను. ఆ నీరు త్రావుటచే గ్రామ స్థుల అజ్ఞానతిమిరము తొలగిపోయెను. వారరుగుదెంచి, యతీంద్రుల పాదములపై బడి నమస్కరించి పూజించిరి. యతీంద్రులు వారికి పంచ సంస్కారాధి హితముల నాచరించిరి. అంధ్రపూర్ణులను మహాపురుషు డా గ్రామమున కలడు. ఆతడు యతీం ద్రుల శరణు జొచ్చెను. ఆతనికి పంచ సంస్కారము నెరపి, సంప్రదాయవిషయముల నన్నింటిని ప్రేమతో నుపదేశించిరి. ఆతడాచార్యుల నీడవలె సంచరించుచు, వారి ప్రేమకు పాత్రుడయ్యెను. ఆతనిని వెంటబెట్టుకొని, శిష్య పరివృతులై ఆచార్యులు నృసింహ క్షేత్రమునకు వెడలిరి. అట కొన్నిదినములుండిరి. అటనారసింహస్వామి సన్నిధానమున దుష్టుడగు చోళభూమీశ్వరుడు చచ్చుగా తమని అభిచారిక హోమము చేయించిరి.

అచ్చటనుండి యతీంద్రులు తన శిష్యుడగు గ్రామపూర్ణులున్న భక్త గ్రామమునకు పోయిరి. గ్రామ పూర్ణులెదురువచ్చి ఆచార్యుల పూజించి తన గృహ మునకు కొంపోయెను.

ఆ దేశమును విఠ్ఠలదేవుడు పాలించుచుండెను. ఆతని కుమార్తెను ఒక బ్రహ్మరక్షస్సు పట్టినది. రాజు పనుపున అనేక భూత వైద్యులు, రాజ భిషక్కులు, సన్న్యాసులు వచ్చి బ్రహ్మరాక్షసిని విడిపింప యత్నించిరి. కాని వారివలన కాలేదు. బ్రహ్మరక్షస్సును విడిపించినవారికి లక్షరూప్యముల నొసంగెదనని రాజు ప్రకటించెను. కాని యెవ్వరి యత్నమును; ఫలింపలేదు గ్రామపూర్ణులు రాజగృహమున కరిగిరి. ఆ సమయమున రాజకుమారి వస్త్రహీనయై పిచ్చిదానివలె నటునిటు సంచరించు చుండెను. గ్రామపూర్ణులు రాజపత్ని దరికేగి "తల్లీ! ఆ పిల్ల యెవరు? ఏమి కార ణమున నిట్లు తిరుగుచున్నది? ఆమెను జూచి మీరేల దుఃఖించుచున్నారు?" అని అడి గిరి. అందులకామె శోకవికారముతో "నాయనా? ఏమి చెప్పుమందువు? ఆమె నా కొమరిత. పిశాచ గ్రస్థయై యిట్లు సంచరించుచున్నది. అనేకమాంత్రికులను పిలి పించితిమి. కాని ఆ దయ్యమును వదలింప సమర్ధుండొక్కండును. లేడయ్యె వయస్సు వచ్చిన పిల్ల యిట్లగుటచే, రోదించుచుంటిమి" అని చెప్పెను.

అపుడు గ్రామపూర్ణులు "మహారాణీ ? ఇపుడు జగద్గురువులగు యతి రాజులు మా గ్రామమునకు వచ్చియున్నారు. వారిపేరు చెప్పిన నిట్టి భూతములు, బ్రహ్మరక్షస్సులు పలాయనమంత్రమును పఠించును, వారిట్టి భూతముల నెన్నింటినో పారద్రోలినారు. వారు సామాన్యులుకారు. వారిని సగౌరవముగా నాహ్వానించినచో నిటకు వత్తురు. వారు వచ్చినచో భూతబాధ యీ దేశమునకే యుండదు. భూపతికి చెప్పి యీ పని చేయింపుడు "అవి యుపదేశించెను. అపు డామె "అట్టి అదృష్టము సిద్ధించినచో వారిని పూజింతుము. వారియిష్టానుసారముగా వర్తింతుము" అని వచించి భర్త కీ విషయమును తెలిపెను.

ఆరాజు మంత్రి పురోహితుల పిలిపించి, "రామానుజులను యతీంద్రులు వచ్చి యీ సమీపగ్రామమున నుండిరట. వారిని సగౌరవముగా ఆహ్వానించి తీసికొని రండు "అని ఆజ్ఞాపించెను మంత్రి పురోహితులు సపరివారులై గ్రామపూర్ణుల వెంట బయలుదేరి, యతీంద్రులను దర్శించి, వారికి పాదాభివందనం బాచరించి, "స్వామీ! మిమ్ము సగౌరవముగా, మారాజధాని కాహ్వానించుటకై మారాజ చంద్రులు మమ్ము పుత్తెంచిరి. దేవరవారు దయచేయవలె"నని విన్నవించిరి.

అపుడు రామానుజులు వారితో"మేముసన్న్యాసులము. మాకునగరమ్ములు గంతవ్యములుకావు. మఠములున్నచో నందు వసింపగలముగాని, గృహస్థుల గృహమ్ముల నివసింపరాదు. ఆ కారణమున మేము రాజధానీ నగరమ్మునకు వచ్చుటకు వీలుకాదు" అని నుడివిరి. అంత గ్రామపూర్ణులు యతీంద్రుల చెవిలో "స్వామీ! తాము రాజధానీగరమ్మునకు తప్పకపోవలె. ఈ దేశాధీశ్వరుడు తమ శిష్యుడాయెనా ఈ రాజ్యమంతయు తమకు వశము కాగలదు. మీరేకార్యము నిర్వహింప దలచినను, ఆటంక ముండదు" అని చెప్పిరి.

ఆ మాటలాలకించి, యతీంద్రులు నగరమ్మున కరుగుట కంగీకరించి, మంత్రి పురోహితుల వీక్షించి, "మేము రావలయుననిన, మీరాజచంద్రుడు మాకు శిష్యుడు కావలె. శిష్యుల గృహమ్ములకు తక్క నితరుల యిండ్లకు మేము రాము. మీరునగరమ్మునకరిగి, మీ రాజున కీవిషయమెఱింగించి, ఆతడంగీకరించెనా, మరలి నాయొద్దకు రండు, లేకున్న మీరును మా సన్నిధికి రావలదు" అని విశదీకరించిరి.

అంత మంత్రి పురోహితులు రాజునొద్దకుపోయి, విషయమంతయు విప

రించి, "రాజచంద్రమా! మీరాయతీంద్రులకు శిష్యులైనచో వారు తమ గృహమ్ము నకు విచ్చేతురట. లేనిచో వచ్చుటకు వీలులేదని నిష్కర్షగావక్కాణించిరి" అని విన్నవించిరి.

అంత నాదేశ ప్రభువు "నాకు పదివేలమంది గురువులుండిరి. వారి నందఱి విడనాడి, యీయన కెట్లు శిష్యుడనయ్యెద?" అని సంశయించుచుండ నా రాజపత్ని భర్తనుజూచి "ప్రభూ! మీ గురుదేవులెందులకు? పదివేలమంది యుండియు ప్రయోజనములేదు కదా! పిశాచమును వదలించుటకు సమర్థులుకారు. కాని ధన మును గ్రహించుకొని పోవుటకు మహాసమర్థులు. అదికాక వారొకప్పుడు మిమ్ము తిరస్కరించియున్నారు. తమరు పూర్వమొక వ్రతమాచరించి వారిని భోజనమున కాహ్వానింప వారు మీయందు లేశమైన గౌరవము లేక, మిమ్ముగాంచి" రాజా! పూర్వము ఢిల్లీశ్వరుడు నిన్ను బంధించి, నీవ్రేలి నొకదానిని ఛేదించెను. అంగవిహీ నుడు రాజ్యపాలనార్హుడు కాడని అతడట్లాచరించెను. అంగవిహీనుడవయ్యు నీవు రాజ్యము నేలుచుంటివి. కావున రాజ్యార్హతలేని నీయింట మేము విందుకుడువ నొల్లము" అని మిమ్ము తృణీకరించిరి. అట్టివారు మీకు గురువులా? వారు మిమ్ము విడనాడి త్రోసిపుచ్చినను, మీరుమాత్రము వారి పాదములు విడువలేకయున్నారు. సందియమును వదలి యతీంద్రుల నాహ్వానించి, వారికి శిష్యులుకండు. మన కుమార్తెను దుష్టపిశాచము బారినుండి రక్షింపుడు" అని యుపదేశించెను.

అపుడా రాజు భార్య వాక్యములకలరి, మంత్రి పురోహితులతో "మీరా యతీంద్రుల సన్నిధికిపోయి వారు పిశాచమును వదలించినచో, పత్నీసహితముగా వారికి నేను శిష్యుడనయ్యెదనని విన్నవించి, వారిని సాదర గౌరవములతో నిటకు తోడ్కొనిరండు". అని ఆదేశించెను. వారు యతీంద్రులకడకుపోయి విషయమును పరిపూర్ణముగా విన్నవించిరి. ఆంధ్రపూర్ణ దాశరథ్యాది శిష్యులు ప్రోత్సహింపగా యతీంద్రులు సశిష్యులై రాజధానికి బయలుదేరిరి.

అపుడు మంత్రి పురోహితులు ముందేగి, యతీంద్రుల ఆగమనవార్తరాజునకు నివేదించిరి ఆతండు సమస్త మంగళ వాద్యంబులు నదించుచుండ, రథగజతురగ పదాతులు తన్ను పరివేష్టించినడువ, ఆబాలగోపాల మానందోత్సాహములతో వెను వెంట బయలుదేర, యతీంద్రుల నెదుర్కొని అర్ఘ్యపాద్యాది విధుల పూజించి, పాదాభివందనంబాచరించి, "స్వామీ! తమ రాకచే నేను కృతార్థుడనైతిని. నాదేశము పవిత్రంబయ్యెను. నాదేశప్రజలు ధన్యులైరి." అని అనేక విధమ్ముల కొనియాడి, తన ప్రాసాదమ్మునకు కొంపోయి, బ్రహ్మాసనాసీనుంజేసి, బంగారు పళ్ళెరమ్మున

తత్పాదములు కడిగి, తజ్జలము
యతీంద్రుల పాదములుంచి, భార్యాన్వితీయుడై
శిరమ్మున ధరించి, గృహాంగణమ్మున చల్లించి,కృతార్థుండనైతినని కొలిచియుండెను.

ఆ సమయమున యతీంద్రుల శిష్యులు రాజపుత్రికను రప్పించి, యతీంద్రుల పాదజలము నామె శీర్షమున ప్రోక్షించి, తత్పాదరజము నామె నుదుట తిలకముగా దిద్దిరి. అపుడామెను వహించియున్న బ్రహ్మరక్షస్సు కేకలు వైచుచు, "జగద్గురుండగు రామానుజుల పాదధూళిచే నేను తరించితి. నా శాపము నశించినది నేను స్వర్లోకమున కేగుచుంటినని యరచుచు, రాకుమారిని వీడి వెడలిపోయెను. రాజపుత్రిక నభ్యంతర పిశాచముచే విడువబడి, తన స్థితిని చూచుకొని సిగ్గువడి, వేగముగా నభ్యంతర మందిరమ్మున కరిగి, అభ్యంజన స్నానమాచరించి, దివ్యవస్త్రమ్ములు ధరించి, దివ్య భూషణ భూషితయై, దేవకాంతవలె వచ్చి తలిదండ్రుల పాదమ్ముల కెఱగి చెంత నిలిచియుండెను. రాజదంపతు లపరిమితానంద మందిరి. రామానుజశిష్యులకు మణి సువర్ణ భూషణాంబరమ్ముల నొసంగిరి. లక్ష్మణయోగి రాజకుటుంబమునకు పంచ సంస్కారము లాచరించి, ఆ రాజునకు విష్ణువర్ధనరాయలను నామకరణ మొనర్చెను.

ఈ యుదంతమునంతయు తెలిసికొని, తొంటి రాజగురువులు సత్వరులై యేతెంచి, రామానుజులచూచి, "నీ వేవియో ద్రావిడ మంత్రములు చదివి, తంత్రము లొనర్చి, మా శిష్యుని నీకు శిష్యునిగా చేసికొంటివి మేమొక మాత్రమున నిన్ను విడచువారము కాము. మాతో వాదించి, జయించి, యాతని శిష్యునిగా చేకొమ్ము. లేదా, ఆతని మా పరము గావించి, తిరిగి పొమ్ము" అని అనేక విధముల గర్జ లొనరించిరి, రామానుజుల శిష్యులు గురునిం జూచి, "స్వామి ! వీరు పదివేల మంది. వీరితో నెక్కటి వై మీ రెట్లు వాదింపవచ్చు ? వాదింప తలకొన్నచో మన కిచ్చటనే కొన్నిసంవత్సరములు గడుపవలసివచ్చును. మీ దివ్యమహిమ ప్రదర్శనముచేగాని వీరు మనల వీడిపోరు" అని విన్నవించిరి.

యతీంద్రులిట్లే యొనర్తునని, బౌద్ధులం గాంచి, "మీరు పదివేల మంది. నేనొక్కండను ఏక కాలమ్మున నేనెట్లు మీతో వాదింపనేర్తు ? అదే ఆ కన్పించుచున్న మంధిరమ్మున కూరుచుండెద. చుట్టును తెరలు, కట్టింపుడు. మీరు తెరలకు బయటనుండి ప్రశ్నింపుడు. నేను లోపలనుండి అందఱకును సమాధానమ్ము లొసంగెద" అని చెప్పి మంటపమునందు ప్రవేశించిరి. ఆదిశేష స్వరూపమును ధరించి, బౌద్ధుల ప్రశ్నలన్నింటికిని ఏకకాలమ్మున సమాధానములిచ్చుచుండిరి, అపుడా బౌద్ధులు "ఈ మంటపమునందున్న వ్యక్తియొక్కండుకదా ! ఇంతమంది కెట్లు సమాధానము లొసంగుచున్నాడు ?" అని అచ్చెరువంది, తెరల తొలగించిచూచిరి.

యతీంద్రులు లోపల సహస్ర ఫణములతో వేంచేసి యుండిరి. ఫణముల పైనున్నరత్నకాంతులచే దశదిశలు ధగధగాయితములాయెను. ఫణములనుండి బయలువెడలిన విషవాయువుచే బౌద్ధులు చాలమందిస్పృహతప్పి క్రిందబడిరి. కొందరు దర్శింపలేక నేత్రములు మూసికొనిరి. కొందరు స్తబ్ధులై నిలిచిపోయిరి. ఇట్లు నిశ్చేష్టులై కొంత తడవుండి పిమ్మట శేరుకొని, అనేక తెలుంగుల శేషమూర్తిని కొనియాడదొరకొనిరి. "స్వామీ! అనుగ్రహింపుడు. నీ దివ్య తేజమ్మును తిలకించుటకు మేమంత? మా మాంస నేత్రములెంత? అఖండ భూమండలము నెల్ల నొక్కఫణమున దాల్చు నీవెక్కడ? ఈ భూమి యందున్న అనేక కోట్ల జీవరాసులలో మహాల్పులమగు మేమెక్కడ? వేద స్వరూపుండవు నీవు. అజ్ఞాన స్వరూపులము మేము. అట్టి మేము నీతో వాదించుటెట్లు? మాయజ్ఞానమును సహించి. మాయపనారములను క్షమించి, యధాపూర్వుడవుకమ్ము"

వారి ప్రార్థనలు మన్నించి శేషరూపమును వీడి. యధారూపమ్మును గ్రహించి యతీంద్రులు మందిరమునుండి బయటకువచ్చిరి. ఆ దివ్యమహిమను. దర్శించుచున్న విష్ణువర్ధనరాయలానందపడి; గురు దేవులకు సాష్టాంగంబాచరించి "స్వామీ! మీరు సహజముగా ననంతులు. సర్వ విధముల ననంతుండవగు మిమ్ము సాంతులగు తుచ్ఛులు ఏమి చేయగలరు?" అని ప్రస్తుతించెను. బౌద్ధులు తమ మతమును పరిత్యజించి, పదివేలమంది ఒక్కసారిగా రామానుజులకు శిష్యులైరి. వారికెల్లరకు పంచ సంస్కారములొనరించి, సంప్రదాయ విషయ గ్రంధములు బోధించుచు, భక్త గ్రామమునందు గ్రామ పూర్ణాంధ్ర పూర్ణాది శిష్యులగూడి, విష్ణువర్ధన రాయలకు విష్ణుతత్త్వోపదేశం బొనరించుచు కొంత కాలమట నివసించి యుండిరి,

## రామానుజులు యాదవాద్రి కరుగుట.

యతీశ్వరులు శ్రీరంగంనుండి కొనివచ్చిన తిరుమణి లేక పోవుటచేతను, సమీప స్థలముల నెచ్చటను తిరుమణి లభింపని కతముచే స్వరూపధారణ మొనర్చుటెట్లు లా? యని రామానుజులును. శిష్యులను చింతాక్రాంతులైరి. అంత నొకరాత్రి యతివర్యుల స్వప్నమున యాదవాచల నాయకుండగు తిరునారాయణ స్వామి గోచరించి "అయ్యా! నువు యాదవాద్రికి వచ్చి, ఆలయ విహీనుండనగు నన్నాదరించి, ఆలయ గోపుర, మంట ప్రాకారాదులు కట్టింపుము. అచ్చటనే శ్రీ వైకుంఠమునుండి, నా సంకల్పముచే గరుత్మంతుండుకొని వచ్చివైచినశ్వేతమృత్తిక అక్షయమై తనరారుచున్నది. నీవచ్చుటకు వచ్చిన సమృద్ధిగా లభ్యము కాగలదు. "రమ్ము" అని చెప్పి అదృశ్యుండయ్యెను. తెల్లవారిన తదుపరి యతీంద్రులు మేలుకాంచి,కాలకృత్యమ్ముల తీర్చుకొని. శిష్యులను విష్ణువర్ధనరాయలను పిలిపించి, వారికీ విషయమును విన్పిం

చిరి. వారు సంతసించి, హస్తకమలంబులు మోడ్చి ''స్వామీ! అట్లే పోవుదము గాక. మంచి ముహూర్తమును నిర్ణయింపుడు'' అని కోరిరి.

వారొక శుభలగ్నంబును నిశ్చయించిరి, యతిగ్రామణి శిష్యసమేతుడైన, విష్ణువర్ధనరాయలు సపరివారుడై తనను సేవించిరా, యాదవాద్రికి పయనమాయెను, విష్ణువర్ధనరాయల కింకరులు తదాజ్ఞచే, రాజధానినుండి, యాదవాద్రి వఱకునున్న మహారణ్యమును ఛేదించుచుండిరి కొందఱువ్యత్యస్థమగు మార్గమును, సమీకృత మొనరించుచుండిరి, అచ్చటచ్చటవాపీ కూపమ్ములు త్రవ్వుచుండిరి, ఏనుగులు, గుఱ్ఱములు, ఒంటెలు మొదలగు జంతువులపై నిడుకొని, కొందఱు సమస్త వస్తువులను యాదవాద్రికి కొంపోవుచుండిరి. ఇట్లు సమస్తసన్నాహముతో పృధ్వీపతిని గూడి రామానుజులు, మహావైభవము పరిఢవిల్ల బహుధాన్యనామ సంవత్సర పుష్య మాసమున, శ్రీ యాదవాద్రికిచేరిరి. అచ్చట నున్న వేదపుష్కరిణి దర్శించి, యతీంద్రులు దానియందు, యథాశాస్త్రముగా, నిమజ్జనం బాచరించి, పరిధాన శిల యందు కాషాయాంబరమ్ములు ధరించి, పర్వతమున ధిరోహించిరి. తత్పరిసర ప్రదేశ మంతయువెదకిరి. కాని శ్రీ యాదవాద్రీశ్వరుండు గోచరింపడయ్యె.

స్వప్నవృత్తాంతము నంతయును విచారించి, యతీశ్వరుండు ''సర్వేశ్వరుండు వచించినది సత్యమా? అసత్యమా?'' యని విచారించి, ఆ రాత్రి నిద్రింపగా, యాదవాచలనాయకుండు స్వప్నమున సాక్షాత్కరించి, ''యతీంద్రా! నేను చెప్పిన గుర్తులు తప్పిపోయితివి, చక్కగా వక్కాణింతు వినుము, కల్యాణీ పుష్కరిణికి దక్షిణముగా, పర్వతమునకు దిగువభాగమున చంపక వృక్షములున్నవి. వానికి నుత్తర దిశగా నొకవల్మీకమున్నది. దానియందు నేను నివసించియున్నాను. నేను చెప్పినగుర్తులను చక్కగా వెదుకుము.'' అని వచించి అంతర్ధానమందెను.

ఉదయముననే రామానుజులు మేలు కాంచి, స్వప్నవృత్తాంతము నంతయు శిష్యులకును, విష్ణువర్ధనరాయలకు వివరించిరి. వారందఱును సంతసించి పుష్కరిణిలో తానమాడి, శుభ్రవసనంబులుతాల్చి, యూర్ధ్వపుండ్రంబులు లలాట పట్టికల తీర్చిదిద్ది, సర్వేశ్వరుండు నిర్దేశించిన పుట్టను వెదకుచుబోయి, దానింగనుంగొని, వేదాధ్యయన పూర్వకంబుగా దానిని త్రవ్విరి. దానియందు యాదవాద్రీశ్వరుండు సాక్షాత్కరించెను. వారికి యాదవాద్రీశ్వరుండు గోచరించినకాలము, శాలివాహన శకమునందు, వేయివత్సరమ్ములు గడిచెనని పెద్దలు చెప్పెదరు, దివ్యకాంతి గోచరుండగు నా సర్వేశ్వరుంగాంచి, వారందఱు జయజయధ్వానమ్ము లాచరించిరి. కొందరాడిరి. కొందరుపాడిరి, కొందరు మంగళవాద్యంబులు మొరయించిరి, కొందరు పుష్పవృష్టి కురిపించిరి. ఆనందాబ్ధి నోలలాడు వారి నందరు నొక్కచో పరివేష్టింప

జేసి యతీంద్రులు ఆ దివ్య మంగళ విగ్రహమును వెలికి తీయించి, జలాధివాస ధాన్యాధివాస క్షీరాధివాసమ్ములు చేయించి, స్వామిని దేవాలయమ్మున ప్రతిష్ఠించి మంటప్రాకార గోపురాదులు నిర్మింపించి, నిత్యోత్సవ పక్షోత్సవ, మాసోత్సవ ఆలనోత్సవములు జరిపించి కళ్యాణోత్సవము చేయవలెనని భావించి కళ్యాణోత్సవ మూర్తియగు రామప్రియుండు గోచరింపకయ్యెను.

కల్యాణోత్సవమూర్తి లేనిది కల్యాణం యెట్లు చేయింపగలనని యోచించి, విచారముతో శయనించెను. ఆ రాత్రి రామప్రియుండు యతీశ్వరుల కలలో కన్పించి "అయ్యా ! నేను ఢిల్లీ పాదుషా గృహమ్మున నుంటిని. నీ వచ్చటి కరుదెంచి పాదుషా నడిగి నన్నచ్చటకు తీసికొనిరమ్ము" అని ఆదేశించెను.

యతీంద్రులు మేలుకాంచి యీ విషయమును రాజునకును, శిష్యులకును, వినిపింప, వారు సంతసించి "గురుదేవా! మీరు సాక్షాత్తు దైవ స్వరూపులు. పర్వేశ్వరుడు ఎప్పటికప్పుడు మీకు కన్పించి, విషయములు తెలియజేయుచున్నాడు. మీ మహిమను కొనియాడ మే మెంతటి వారము? పూర్వము ఢిల్లీ ప్రభుం డొకండు దేవాలయమునందలి విగ్రహమ్ములు కొనిపోయెను. మనకుకావలసిన విగ్రహ మాతని యింట లభింపవచ్చును. మీరు పోయి యడిగినచో నాతండు తప్పక ఆ విగ్రహంబు నొసంగగలండు. సన్నాహం బొనరింపుడు." అని వేడుకొనిరి.

యతీంద్రులు నలుదిక్కులందున్న తన శిష్యులందఱకును లేఖలు వ్రాయించిరి. ఆ లేఖలను చూచి యతీంద్రుల శిష్యులగు బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు, కిరాతులు, సంకరులు, పంచములు జగత్తున కలవారందరు తండోపతండములుగా యాదవాద్రికి వచ్చి చేరిరి. యాదవాద్రియు, తత్పరిసర ప్రదేశమును నేలయీనినట్లు జన బాహుళ్యముచే మిక్కిలి క్రిక్కిరిసియుండెను. వచ్చినవారెల్లరు యతీంద్రుల ముందు మోకరిల్లిరి. వారు సెలవొసంగ తమతమ విడుదులయందు వసియించి యుండిరి.

ఒక శుభలగ్నమునందు, యతీంద్రులు సకల పరివార సమేతులై విష్ణువర్ధన రాయలతో గూడి, చతురంగబల సమన్వితముగా ఢిల్లీకి పయనమైరి. వరశుశాలాధ్యా

యుధి పాణులగు విత్యులు అనగా పంచములు, ఊర్ధ్వ పుండ్రధారులై ముందు నడచుచుండిరి. అఖిల శస్త్రాస్త్రములు ధరించి, ఆ వెనుక కులశేఖరులు నడచుచుండిరి. వారి వెనుక మిగిలిన వారందరును పోవుచుండిరి. రథ గజ తురగాది వాహనముల నధిరోహించి, ఆంధ్ర పూర్ణదాశరథ్యాది శిష్యులు పోవుచుండిరి. విష్ణువర్ధన ద్వితీయులై యతీంద్రులు ఒక్క స్యందనం బధిరోహించి, శిష్యులు వింజామరలు వీచుచుండ సైన్య మధ్యంబున నుండి కదలుచుండిరి. సైన్యాధిపతులు, తమతమ సేనలను రక్షించుచు చుట్టును, నడచుచుండిరి. తండులములు, ఖాద్య తైలములు, సూపశాకాది పదార్థములు శకటముల మీద నెత్తించి కొందరు తోలుకొని పోవుచుండిరి. ఆ సైన్యముల లెక్కించుటకు, ఏకముఖ, ద్విముఖ, త్రిముఖ, చతుర్ముఖ, పంచముఖ, షణ్ముఖులకైన అలవికాక యుండెను.

యతీంద్రులును, విష్ణువర్ధనరాయలును, చతురంగ బలముల మధ్య, వానరవరూధినీ మధ్యమ్మననున్న రామసుగ్రీవులను ననుకరించిరి. ఇట్లు ఆ సైన్యము మార్గమధ్యమునందలి, జనపద్మములకును, పట్టణములకును హాని కలుగకుండా ప్రయాణించుచు, కతిపయదినములకు ఘాటాహూటి ఢిల్లీకిచేరి, తత్పరిసర ప్రదేశము నాశ్రయించి యుండిరి.

ఆ ఢిల్లీశుండును, సైన్యవారమును గాంచి, ఎవడో చక్రవర్తి తనపై దండెత్తివచ్చివాడని చింతించి, మంత్రులతో నాలోచించి, నగరమ్మునకు రక్షణ కల్పించి, వేగువాండ్రను రావించి, తత్ సైన్య విషయముల నారసిరమ్మని పుత్తెంచెను. వారలు సైన్యవిశేషము లామూలాగ్రముగా నెఱింగి, తిరిగి ప్రభుసన్నిధికిం బోయి వానితో "దేవా! ఆ సైన్య విశేషముల నేమని తెల్పుదుము ? దాని ప్రమాణ మింతయని వర్ణింప నలవికాదు. మ్లేచ్ఛులు, శ్వేతజాతియుతప్ప యావద్భారత దేశమునందలి హిందువులందరు నేకముఖముగా నడచివచ్చినట్లున్నది. ఆ సైన్యమందున్న వారందరు నూర్ధ్వపుండ్రధారులే. తులసీనలినాక్ష మాలాతక్షులు, ఆయుధపాణులే, సాత్త్వికవేషధారులైనను, చూచుటకు మిక్కిలి భయంకరులై యున్నారు. వారిలో కొందరు పెద్దలు కాబోలు భగవద్విషయమును బోధించుచున్నారు. కొందరు

వారిని పరివేష్టించి యున్నారు. దక్షిణాపథమునకు ప్రభువులగువారు కొందరు గూడ వచ్చియున్నారు. ఏనుగులు – గుఱ్ఱములు – రథములు – అపారసంఖ్యలో నున్నవి. ఈ మొత్తమునకు ప్రభువు ఒక బ్రాహ్మణ సన్న్యాసి. మూడు కర్రలు కలిపి కట్టి దానిని హస్తమున ధరించి యున్నారు. ఆ సైన్యమందున్న ప్రభువులు – సైన్యము, అతనిని దైవముగా సేవించుచున్నారు. ఆయన తన సమీపవర్తుల కేదియో, దైవ భాషలో వచించుచున్నాడు. ఆ సైన్యమును, సామముచే సాధింప నలవికాదు. దానముచే సాధించు మంటిమా, అందున్న వారందరు మహావిరాగులు. భేదమును ప్రయోగింపదలకొంటిమా, వారందరును ఒకరిపై నొకరు మహా ప్రేమమున సంచరించుచున్నారు. కావున నీ మువ్విధయిలగు నుపాయములు ప్రయోగింప సాధ్యము కాదు. ఇప్పటికి దండోపాయ మొక్కటే యుక్త మని తోచుచున్నది. దానిని గూర్చి విచారింప నవసరములేదు కదా! జయాపజయములు దైవాధీనములు, పైని దేవర యిష్టము" అని వచియించిరి.

పిమ్మట సైన్యాధ్యక్షులు రాజును వీక్షించి "దేవా! అనుజ్ఞ నొసంగుడు ససైన్యముగానేగి, ఆ సైన్యముల మాపుమాపి, జయలక్ష్మితో మరలివత్తుము" అని విన్నవించిరి. ఆ వాక్యములు విని పాదుషా కుమారుడు "తండ్రి ఈ బుద్ధిహీనుల ఆలోచనమును నీవు మన్నింపవలదు. ఈవచ్చినసన్న్యాసి సామాన్యుడు కాదని తోచుచున్నది. బుద్ధిమంతుడగు వాడు తొలుతనే దండమును ప్రయోగింపరాదు. సామ దాన భేదములకు సాధ్యముకానినాడు దండము తప్పదు. ఈ సన్న్యాసి హిందూదేశమునకంతటికిని గురువు కాబోలు. ఆ కారణముననే ప్రభువులు, వారి సైన్యము, నీతనిని పరివేష్టించి వచ్చియున్నవి. యుద్ధమునకు పూనితిమా మన సైన్య మాతని సైన్యము ముందల్పమని తోచుచున్నది. అసలీ సన్న్యాసి యెందుల కిటకు వచ్చినాడో? అతని నివాస స్థానమేదియో? మనపై దండెత్తుటకు కారణమేమో విచారింపుడు. ఆలోచనా రహితముగా, నేకార్యమును నొనర్చుటయు పాడికాదు. కార్య మొనర్చినపిదప ఆలోచించుట వ్యర్థము. ముందుగా చక్కగా పెద్దలతో నాలోచించి కార్యము నిర్వర్తించుట తగిన పని" అని చెప్పెను.

అపుడా పాదుషా కుమారుని వాక్యములు విని, అతడు వచించినది మేలు మార్గమనిఘెంచి, తన మంత్రులగు పండితరాయలు, భగవంతరాయలు అనువారిని పిలిచి, "మీరీ సైన్యమును ప్రవేశించి, తత్ప్రభు సన్నిధికేగి, ఆతం డేకతమున నిచ్చటకు వచ్చినాడో యెరింగి రండు" అని పంపెను.

వారిరువురును వల్లెయని! గృహములకేగి పట్టంచు ధోవతులు కట్టి పైని శాలువలు ధరించి, మెడలలో తులసి పూసలపేరులు ధరించి, చేతులకు రుద్రాక్షలు చుట్టి, చెవులకు మకరకుండలములుపెట్టి నొసట నూర్ధ్వపుండ్రములను దిద్ది, శరీరములపై భస్మమలది "ఓన్నమో భగవతే వాసుదేవాయ" శంభోమహాదేవ, వరద నారాయణవాసుదేవ" యని నోటనుచ్చరించుచు, సైన్యమున ప్రవేశించి, వరుసగా సేనలతిలకించుచు, యతీంద్రులను సమీపించి. అర్ఘ్యపాద్యాది విధుల యతీశ్వరుల పూజించి, పాదాభివందనం బాచరించి, చేతులు మోడ్చి నిలువబడి" జగద్గురూత్తమా! తమ నివాసముచే ధన్యతగాంచిన గ్రామమెద్ది? మీ పాదరజోరాజీచే పవిత్రమైన దేశమెయ్యది? మీరిచ్చటకు చనుదెంచిన హేతువేమి? మేమీ దేశప్రభువునకు ప్రధానమంత్రులము. మీ విషయమును విచారించిరమ్మని మా ప్రభువాజ్ఞాపింపగా నిచ్చటకు వచ్చితిమి. మీ విషయము ఆనతింపుడు అని వేడుకొనిరి.

అంత యతీశ్వరులు ఆ మంత్రుల నాదరమున వీక్షించి "ఈ ప్రభుండు మిక్కిలి బుద్ధిమంతుడని లోకులు చెప్పగా వినియున్నాము. అట్టి సజ్జన శ్రేష్ఠు నొక్కసారి చూచి పోవలయునని యిచ్చటికేగుదెంచితిమి. అంతకన్న వేరుపని యేదియును లేదు." అని వక్కాణించిరి. అపుడా మంత్రు లానందమ్మున, యతీంద్రుల యొద్ద సెలవుగైకొని, ప్రభు సమీపమున, కరిగి తాము పోయివచ్చిన విషయమంతయు విన్నవింపగా, నా పాదుషా యతీంద్రుల గౌరవ మర్యాదలతో నాహ్వానించి, తన నగరమ్మునకు తోడ్కొని రమ్మని తగు పరివారమును సముచితముగా పంపెను

రాజ పరివార మొనర్చిన అభ్యర్థనమును పురస్కరించుకొని, సముచిత పరివారులై యతీంద్రులు ఢిల్లీకి పయనమైరి. పాదుషా పరివార సమన్వితుడై యతీంద్రులకు ప్రత్యుత్థానం బొనరించి, సలాము చేసి తన కొలాపు కూటమునకు తీసికొని వచ్చి సువర్ణాసనమ్మున నాసీనుంగావించి తగిన సత్కారములాచరించి, కరకమలములు మోడ్చి "యతీంద్రా! తాము వచ్చిన కార్యమేదో సెలవిండు" అని వేడుకొనెను.

యతీంద్రులా పాదుషాను చూచి "రాజసత్తమా! మీరు మా హిందు దేవాలయముల యందలి విగ్రహములు కొన్నింటిని తీసికొని వచ్చితిరి. యాదవాచలాలయమునందలి రామప్రియ విగ్రహమును గూడా తెచ్చితిరి. మాకా విగ్రహము కావలసి వచ్చినది. దానినిప్పింపుడు" అని కోరిరి.

అపుడు తురుష్క ప్రభువు "స్వామీ! ఒక విగ్రహంబననేల? వలయునెడల నిందున్న విగ్రహములనెల్ల మీరు కొని పోవచ్చును. అదే ఆ కన్పించుచున్న భవనమున విగ్రహములున్నవి. వానిని దర్శించి. మీ కవసరమగు వానిని తీసుకొని పొండు" అని పలికి సేవకుని చేత ఆ భవనము తాళం తీయించెను. యతీంద్రులా విగ్రహములనన్నింటి శోధించిరి. అనేక విగ్రహములు కన్పించినవి. కాని రామప్రియుండు మాత్రము కన్పింపలేదు. అంత రామానుజులు తమబసకు మరలి, యింత వ్యయ ప్రయాసలకోర్చి యిచ్చటకు వచ్చితిని. రామ ప్రియుండు కన్పించలేదు. సర్వేశ్వరుండబద్ధమాడునా?" యని చింతాకాంతులై శయనించిరి. రామ ప్రియుండు స్వప్నమున గోచరించి, ఆర్యా! ఈ ప్రభుని కన్యకాంతఃపురమున, నీతనికొమరితతో గూడి భోగించుచునందున్నాను. నీవటకు వచ్చి నన్ను తీసికొనిరమ్ము:" అని ప్రబోధించెను.

రెండవ దినమున రామానుజులా విషయమును రాజునకు తెల్పగా, నాతండు కుమార్తెను పిలిపించి, "అమ్మా! నీ యొద్ద నొక బొమ్మ కలదట. దానికొరకై ఈ సన్న్యాసి. అపారబల సమన్వితుడై వచ్చియున్నాడు. ఆ బొమ్మ వారి దేవుడట. ఆ బొమ్మనాతనికి ఇచ్చి వేయుము. నీకు కావాలయునన్న అట్టిబొమ్మలు వేయి చేయించి యిత్తును." అని పల్కెను కుమార్తె అతని మాటలకులికి, "తండ్రీ! అట్టిబొమ్మ జగత్తునలేదు. అది హిందువులది కానీ, లేక మహమ్మదీయులదే కానీ ఆ బొమ్మను మాత్రము నేనిచ్చునదిలేదు. అట్టి బొమ్మలు చేయించి వారికే యిమ్ము. ఆ బొమ్మ నిచ్చితినేని తత్‌క్షణమున నా ప్రాణములును పోవును. నా ప్రాణములుపోయిన తదు

వరి వారికా బొమ్మ నిండు'' అని నిష్కర్షగా చెప్పి వేదనచే దుఃఖించుచుండెను. దానింజూచి సహింపలేక ఆ పాదుషా యతిచంద్రునితో "స్వామీ! మీరీ బొమ్మను మీ దైవమనుచున్నారు కదా! ఆతడు నిజముగా దైవమైనచో ఆ బొమ్మను పిలుచు కొని పొండు ఆ బొమ్మ మీ వెంట వచ్చిన నిజముగా నాతడు దేవుడే.

ఇప్పుడు మీ దేవుని విషయమును, మీ విషయమును, చూడ వలయును'' అని వచించెను. యతీంద్రులు అంతఃపుర ప్రాంతమునకు పోయి 'రామప్రియా'యని బిగ్గరగా కేకవైచెను. వెంటనే రాజకుమార్తె ప్రక్కపైనున్న రామప్రియుడులేచి వచ్చి రామానుజుల అంక పీఠిపై నధివసించెను. ఆ విచిత్రమును గాంచి యటనున్న వారెల్లరు, రామ ప్రియుని 'యతిరాజసంపత్కు మారుడు' అని పిలిచిరి. యతీంద్రులు సంతసించి, రామప్రియుని తీసికొని తన బసకు వెడలిపోయిరి రాజును, రాజ పరి వారమును, మిక్కలి ఆశ్చర్యపడి రామానుజులు మహా మహిమోపేతుండగు సన్న్యాసియని విశ్వసించియుండిరి. రాజపుత్రి మాత్రమావిగ్రహవియోగమును సహింపలేక రెండు చేతులతో తలను బాదుకొనుచు, నేలపైబడి పొరలుచు, అధిక వేదనా భారమున వెక్కివెక్కి యేడ్చుచుండెను ఆ విషయమామె చెలికత్తెలు వచ్చి చెప్పగా విని, ఆమె తలిదండ్రులు, కుమార్తె యొద్దకుంబోయి, బుజ్జగింపు మాటలతో ననేక విధమ్ముల నూరడించిరి. ఎన్నియో బొమ్మలు తెప్పించి యొసగిరి. బంగారు బొమ్మను చేయింతుమని చెప్పిరి. ఆ రాతి బొమ్మతో నీకేమి ప్రయోజనమని ప్రశ్నించిరి. ఎన్ని చెప్పినను వినక ఆ బాల అట్లే దుఃఖించుచుండెను.

అట యతీంద్రులు, రామప్రియునింగాంచి సంతసించి, విష్ణు వర్ధనరాయలను, తదితర శిష్యులను జూచి, మనము వచ్చిన పని నెరవేరినది. మరలి యాదవాద్రి కేగుదుము.' అని వచించి, ఆ రేయి సుఖనిద్ర సేసిరి. ఆ రేయి రామప్రియుండు యతీంద్రుల స్వప్నమున సాక్షాత్కరించి "ఆర్యా! ఈ రాజపుత్రి లక్ష్మ్యంశమున జన్మించి నది. నా భార్య. నేను నిజ రూపమున నీమెతో భోగించుచు సమస్త సుఖముల ననుభవించుచున్నాను. అందువలన నీమె వియోగమును సహింపజాలను. ఈమెతో వివాహమును జరపించి, మా యిరువురను, తోడ్కొనిపొమ్ము అట్లు కాదంటివా, నన్నును నిచ్చటనే విడిచి పొమ్ము. అదియును కాదందువేని నేని యమునా తర మ్మున జోగినై సంచరించెద. నీ వెంట మాత్రము రాను రాకుమార్తె వివాహము నాకెట్లు సాధ్యమాయని విచారింపవలదు. ఆ కార్యక్రమమంతయు నేనే నిర్వర్తిం తును. నీవు మాత్రము, మా కిద్దరకును కల్యాణము జరిపించి, వెంటకొంపొమ్ము." అని చెప్పి అంతర్హితుండయ్యెను. అదే రేయి ఢిల్లీ సుల్తానునకు, తత్పుత్రికి నొకే పర్యాయము కలలో కనుపించి'' మీ గారాల కొమరిత లక్ష్మ్యంశచే జన్మించినయది. ఆమెనా భార్య. ఇప్పటికే నేనామెను గూడి రమించుచున్నాను.

కావున రేపు సమస్త ప్రజాసమక్షమున; మీరు మీకుమార్తెనిచ్చి నాకు వివాహమును జరిపించి, మా యిద్దరిని, యతీంద్రుల వెంట బంపుడు. అట్లాచరింతు రేని, సకల శుభములు నీకు చేకూరగలవు" అని ఆనతిచ్చెను.

ఆ రాజదంపతులు మేలుకాంచి స్వప్నవృత్తాంతముచే కలంగినవారలై "మనకు కుమార్తె యొక్కతియే యైనందుల కెంతయో వైభవముగా శుభకార్యము నిర్వర్తింపవలయునని యెంచితిమి. అట్టి మనకీ యిక్కట్టు దాపురించుటయా? కట్టా! ఊరును పేరునులేని యొక బాపనసన్యాసి మనకు వియ్యంకుడా? ప్రాణరహితమైన రాతిబొమ్మ జామాతయా?" అని ఆలోచించి, చేయునదిలేక పెల్లుచింతిల్లుచుండిరి.

ప్రభాతంబగుటయు యతీంద్రులు, హరినామస్మరణచే మేల్కాంచి, కాల్యకరణీయంబులు నెరవేర్చి, స్వప్నవిశేషములను దలంచి, విష్ణువర్ధన రాయకును, శిష్యులకును విన్పింపగా, వారలు విస్మయావిష్టులై "దేవా! సర్వేశ్వరుండు స్వప్నంబున వచించిన విషయంబున కన్యథాత్వంబు సిద్ధింపదు. మనము రాజభవనంబున కేగుదము" అని పలికిరి. యతిరాజులు సపరివారులై రాజప్రసాదమున కరిగిరి. అంతనా రాజు నెదురువచ్చి. తన స్వప్నవృత్తాంతమును. రామానుజులకు నివేదింప నవ్వి "రాజా! నీ జన్మమే జన్మము, ఎన్ని జన్మములయందు చేసిన పుణ్యఫలమో లక్ష్మీశ్వరుండగు సర్వేశ్వరుండు నీకల్లుడయ్యె. పాలకడలివలె నీవును మామవైతివి. నీ భాగ్యమ్మున కవధిలేదు. వివాహప్రయత్నమును కావింపుము" అని పలికెను.

రాజు భయభక్తి వినయ దుఃఖాంతరంగుడై కుమార్తెను పెండ్లికుమార్తెను చేయింపుమని తనదేవేరి కెఱింగించెను. అంత ననేకులు ముత్తయిదువులేతెంచి, ఆ బాలకు మంగళస్నానములు చేయించి, కురులు తడియార్చి, విరులు తురిమి, దివ్యవస్త్రాలంకారముల నామె నలంకరించి, కల్యాణమంటపమ్మునకు తోడుకొనివచ్చిరి. యతీంద్రులు రామప్రియుని పెండ్లికుమారుని చేయించి, యొకానొక స్వర్ణపల్యంకమునందు కూర్చుండబెట్టి వివాహవేదిక కడకు తోడుకొనివచ్చెను. పరివార సమన్వితుడగు విష్ణువర్ధనరాయలతోగూడి యతీంద్రు లొకవైపున కూర్చుండి యుండిరి. తురుష్క ప్రభువును, అమె ధర్మపత్నియు, సమస్తపరివార సమేతముగా మరియొక వైపున వేచియుండిరి. రాకుమార్తె నొక రాతిబొమ్మ కిచ్చి పెండిలిసేయు చున్నారట. చూచివత్తము రండని సమీపగ్రామ ప్రజలాబాలగోపాలము ఇసుక వైచిన రాలనట్లుగా వచ్చి వివాహ మంటపప్రాంతము ననువిష్టులైరి.

అట్టి సమయమున రాజదంపతులుత్సాహహీనులై యుండుట గాంచి, వారి విచారము రూపుమాపదలంచి, సర్వేశ్వరుండు, తాను నీలవిలదమాలా శ్యామ

శరీరుండై, పీతాంబరధారియై, హారకేయూరాది దివ్యభూషణ భూషితుండై, పాద పద్మములవఱకు దేదీప్యమానముగ ప్రకాశించు పై జయంతీమాల విరాజిల్లుచుండ శ్రీవత్సలాంఛనాంచిత దేహుండై, చండమార్తాండ మండలంబు తిరస్కరించు మకర కుండదీప్తి దిశదిశలు వెలిగింప, చతుర్భుజంబుల శంఖచక్ర నందకాద్యాయుధంబుఁ భాసించుచుండ! నవరత్న ప్రభాభాసమానకిరీటము, శిరము నలంకరింప, ముల్లు, కులుకు మోము దమ్మియందు ములకనవ్వులు చిందులాడ పెండ్లికుమారుడై సభా సదుల యెదుట నొక్కసారి ప్రత్యక్షమయ్యె, బ్రహ్మాది దేవతలు శిరములకేలుబోయి మొగిడ్చి జయజయధ్వానము లాచరించుచు. మొయిలుదారుల గోచరించిరి, కామ ధేనువు. కల్పకము మొదలగునవి యచ్చటతోచె. నారదాదిమహర్షులు. సనకాది యోగులు. విష్వక్సేనగరుడాది నిత్యసూరులు, ఊర్వశీమేనకాద్యప్సరసలు, విశ్వావసు ప్రభృతిగంధర్వులు, అనేకు లొక్కసారి సభ నలంకరించిరి. ఆ సభ నిత్యవిభూతి యందున్న తిరుమామణిమంటపమును తలపించుచుండెను. దేవగురుండగు బృహస్పతి పురోహితకృత్యము నాచరించుచుండెను, పార్వతీ. సరస్వతీ, శచీదేవి మొదలగు దివ్యకాంతలు పురంధ్రీకార్యములు నిర్వర్తించుచుండిరి. యతీంద్రులు శేషస్వరూప మును ధరించి కూర్చుండియుండిరి. అట్టి సమయమున శచ్యాదిముత్తైదువులు, రాజపుత్రిని తీసికొనివచ్చి సర్వేశ్వరుని ప్రక్క పెండ్లిపీటపై కూర్చుండబెట్టిరి, సమస్త దివ్యమంగళవాదిత్రధ్వనులు, భూనభోంతరమ్ములు నిండి, మెండుకొని యుండెను. అంతశుభలగ్నంబున రామప్రియుండు జీలకఱ్ఱ బెల్లమును, వధూశిర మ్మునను౦చి. ఆమె గళమ్మున మంగళసూత్రమును కట్టెను. వధూవరులిర్వురును పసిండి పళ్ళెరములనున్న మంచి ముత్తియముల తలబ్రాలొకరి శిరమున, నొకరు విలాసముగ పోసికొనిరి. వారి సౌందర్యశోభ వర్ణనాతీతమై వినుతిగాంచెను. సదస్సు లెల్లరు, జయజయధ్వానము. లాచరించిరి. గగనతలమ్మునుండి విరివానగురిసె, దేవదుందుభులు మ్రోసె. అప్సరోనృత్యము మించె, ఆ సమయమున. వధూవరు లిర్వురును, లక్ష్మీనారాయణులై గోచరించిరి. కన్నులాగ ఈ వైభవమునెల్ల తిల కించుచున్న రాజదంపతుల ఆనందమున కవధులు లేకుండెను. ఇట్లు మహావైభవ ముగా వివాహకార్యమును నిర్వర్తించుకొని వధూవరు లిరువురును రాజదంపతులకు ప్రణమిల్లిరి. వారలు పులకితశరీరులై అనేకాశీర్వచనములు చేసిరి. అంత రామ ప్రియుండు భార్యాద్వితీయుండై అత్తమామలకు పోయివచ్చెదమని చెప్పి దివ్యశతాం గము నధిరోహించెను. సమస్త దేవతలును సర్వేశ్వరానుజ్ఞచే తమ తమ నెలవుల కేగిరి. నారదుండమందానందహృదయుడై లక్ష్మీశుని దివ్యగాథల గానమొన రించుచు, కుంచె వీచి, ఆనందతాండవం బాడుచు, మౌళినంజలును సేర్చి, "దేవాది దేవా! నీ లీల లత్యద్భుతములు. వానిని వర్ణించుటకు మేమెంతవారము? అని ప్రస్తు తించుచు, తదాజ్ఞగైకొని, త్రిజగత్సంచారార్థియై వెడలిపోయెను. ఆ దివ్యవైభవ మును, వేనోళ్ళ కొనియాడుచు, నేదియో యింద్రజాలమువలె నున్నదికాని

మున్నెన్నడును విన్నదియు కన్నదియు కాదు.' అని అచ్చెరువందుచు, న్నచ్చటికి వచ్చిన పౌరజనులెల్లరు, తమ తమ నివాసములకు తరలిపోయిరి.

రాజు వధూవరులకు గజాశ్వరథపదాతి బలములును, రత్న సువర్ణ రాసులును, దాసదాసీజనమ్ములును, కట్నముగ నొసంగి చాల దూరము సాగనంపి, వారిని యాదవాచలమువరకును పంపి రమ్మని స్వాత్మజునకాదేశించి. యతీంద్రులకడ వీడ్కోలు గైకొని, వధూవరు లకు చెప్పి విషాదహృదయములతో తిరిగిపోయెను. యతీశ్వరులు సమస్త పరివారముతో మంగళవాద్య పురస్సరముగా, వధూవరులు దివ్య స్యందనారూఢులై తనవెంట వచ్చుచుండ. కొన్ని దినములకు యాదవా ద్రికి వచ్చి చేరిరి. ఒక శుభలగ్నమున వధూవరుల ఆలయప్రవేశము చేయించి, పీఠములపై నిలువబెట్టి, వేదమంత్రములు లుచ్చరించుచు ప్రతిష్ఠించిరి. సర్వ జన సమక్షమున నా వధూవరులిరువు రొక్కసారిగా శిలాకృతులంగైకొనిరి. రాజపుత్రుండగు కబీరు మాత్రము సోదరి పాదములపైబడి బోరన దుఃఖించెను. విష్ణువర్ధనరాయలు మొదలగు వారు, కబీరును పైకిలేపి, నాయనా! అమె లక్ష్మ్యంశమున మీ గృహ మ్మున జనించినది. లోకమాత కావున నీయాకారమును గ్రహించినది. అన్నియు తెలిసియుండి నీవిట్లు చింతింపదగదు." అని వేవిధమ్ముల నోదార్చిరి. ఇట్లు మహా వైభవముగా తదుత్సవము ముగిసెను. కబీరు లక్ష్మణ సూరి యొద్ద సెలవుగైకొని, ఢిల్లీకి పోయి తల్లిదండ్రులకు చెప్పగా వారు యాదవాచలమునకువచ్చి సంపత్కుమారునకు నమస్క రించి, అపారముగా కానుకలు చెల్లించి, రామానుజులతో కూడి తిరు నారాయణ పురమ్మున కొంతకాలము వసించిపిమ్మట వారియొద్ద సెలవు గైకొని ఢిల్లీకి తరలిపోయిరి,

## కబీరు చరిత్రము

అంత కబీరు శ్రీరంగమును దర్శింపవలయునని తలంచి, రామా నుజానుమతిని గ్రహించి, శ్రీరంగమున కరిగి, కావేరీనదీ తోయముల స్నానమాచరించి. దేవాలయము ప్రవేశించి, రంగేశ్వరుని సేవించి, సంతోషించి "జగదీశ్వరా: నాకు మోక్షమిమ్ము" అని యాచించి శ్రీరంగమునందు కొంతకాలము వసించెను.ఒకనాటి రాత్రిరంగధాముడు కబీరు స్వప్నమున గోచరించి, "వత్సా! మోక్షము నర్థించితివి. కాని

కాని నా సుదర్శన స్పర్శలేనిది యెట్టి ప్రాణికిని మోక్ష ప్రాప్తిలేదు. అదియుంగాక, నేనిచ్చట పరమపావన బిరుదాంకితుండనై యున్నాడను. నీకు సుదర్శన స్పర్శలేని కారణమున మోక్షమిచ్చుటకు వలను పడదు. పురుషోత్తమ క్షేత్రమునకు పొమ్ము. అచ్చట దేవాలయముపై గల చక్రదర్శన మాత్రముననే మోక్షము సిద్ధించును. అందు పతితపావన బిరుదముతో నున్నాడను. కావున అచ్చట తప్పక నీ కోర్కి తీర్చెద. పురుషోత్తమక్షేత్రమునకు రమ్ము." అని ఆదేశించి, అంతర్హితుండయ్యెను.

కబీరు రంగనాథుని యాజ్ఞగైకొని జగన్నాథమున కరిగెను. చక్ర దర్శనము కావించెను. నీలాద్రి వాసుండగు పురుషోత్తమ దేవుని దర్శించి, అనేక విధమ్ముల కొనియాడి మోక్షమిమ్మని యర్థించి ఒక మఠమున నివసించుచు జగన్నాథుని సేవించు చుండెను. ఒక దినమున నాతడు గోధుమ రొట్టెలను చేసికొని వానిని కాల్చుటకు బజారునుండి, నేతిని కొని తెచ్చుచుండెను. జగన్నాథస్వామి ఒక శ్వానరూపమ్మును ధరించి కబీరు మఠమున ప్రవేశించి, రొట్టెలను నోట కరచుకొని పోవు చుండెను. జగత్తంతయు బ్రహ్మ స్వరూపముగా గోచరించు చుండు టచే కబీరు, ఆ శునకమునుచూచి, జగనాథస్వామిగా భావించి, "ఓ స్వామీ! ఆ రొట్టెల నెత్తుకొని పోవుచుంటివి. ఆ రొట్టెలయందు చక్కెరగాని, నేతిని గాని వేయనైతిని, ఆ రొట్టెలను భక్షించితివా, కడుపునొప్పి వచ్చును. ఇదిగో నేయియు చక్కెరయు కొని వచ్చు చుంటిని, దానిని కలిపి తిందువేని, రుచికరముగా నుండును. మీదు మిక్కిలి ఆరోగ్య హాని చేయవు, ఇట్టి రస హీనములగు వూపంబుల నెప్పుడు స్వీకరించి యుండవు: నీ తల్లియగు యశోధ ఘృత క్షీరములచే నిన్ను పెంచినది. నీవీ నీరస కర్కశములగు రొట్టెల భక్షింపజాలవు. రమ్ము" అని పెన్నాడెను. అట్లు వారిరువురును సముద్ర తీరమ్మునకు పోయిరి. జగన్నాథుండు కుక్క రూపమును వీడి దివ్యమగు తన మంగళ రూపమ్ముతో కబీరు ముందు సాక్షాత్కరించెను.

కబీరు స్వామికి సాష్టాంగవందన ప్రణామమ్ము లాచరించి, మోక్షమిమ్మని యాచించెను. జగన్నాథుండు కబిరు భక్తికి సంతసించి యాతని పాంచభౌతికశరీరమును విడిపించి, పుణ్యకోటి విమానముపై నెక్కించి, నిత్యవిభూతికి పంపించి, ఆ నగరవాసులకు, కబీరునకు మోక్ష

మొసంగిన యుదంతము తెలియజేయ, తత్పుర వాసులు సముద్రతీర మ్మునకేగి చూచిరి. కబీరు శరీరము భూమిపై పడియుండెను. ఇట్టి మహాపురుషుని దివ్యకళేబరమును, విడిచిపుచ్చుట భావ్యముకాదనితలంచి తత్పురప్రజలొక సమాధిని నిర్మించి. దానియందు కబీరుదేహమును నుంచిరి. ఇప్పటికిని ఆ కబీరు సమాధి సర్వప్రజలకు సముద్రతీరమున దర్శన మిచ్చుచున్నదని పెద్దలు వచింతురు.

అంత నిచ్చట తిరునారాయణపురమునందు కల్యాణోత్సవము పూర్తికాగా, వచ్చినవారందరెచ్చటివారచ్చటకు పోవుచుండిరి. అంతని త్యులు (పంచములు) యతీంద్రుల సమీపించి "స్వామీ! ఈ రామ ప్రియుని గూర్చి చాల శ్రమించితిమి ఢిల్లీ విజయమునకు పోవునప్పు డాయుధపాణులమై ముందునడచినది మేమేకదా! దానికై మాకేదైయైన గొప్ప కానుక దేవరవారొసంగవలె" నని విన్నవించుకొనిరి.

రామానుజులలరి "వత్సలారా! మీకెల్ల అరు శ్రియఃపతికి చెప్పి మోక్షసామ్రాజ్య మిప్పించెద" నని వచించిరి. అందులకు వారు "ప్రభూ! తాము చేతనులకెల్ల మోక్షమొసంగుచున్నారు. అదియుగాక, ఈలోకమందు, ఈ విశేషమునకు గుర్తుగా మాకొక్క వరము దయ చేయవలె. పవిత్ర కర్మభూమియగు నీ భారతవర్షమున, పంచములమగు మాకు నే దేవాలయమునందును ప్రవేశార్హత లేదు. సర్వేశ్వరునకు కులమత వివక్షత లేదుకదా! సమస్త ప్రాణులకు సర్వేశ్వరుం డొక్క రుండేకాడే? మీరు జగద్గురువులు. మీరొసంగిన అధికారమును, వ్యతి రేకించువారీ ముల్లోకముల నుండరు. నాల్గు వర్ణములవారితోపాటు మాకును సర్వదేవాలయ ప్రవేశార్హతను కల్పింపుడు. తాము దయతో నీ వరమును ప్రసాదింపుడు" అని వేడుకొనిరి.

యతీంద్రులు మందహాసరేఖా విలాసవదనులై "ఆర్యులారా! ఈ విషయమున నాకు సందేహము లేదు. కులవ్యవస్థను నిర్మూలించుటకు నేనెంత కృషిచేయుచున్నానో మీరు రెంగనిదికాదు. సర్వేశ్వరారాధ నమునకు, జీవుల కెల్ల అరు సమానాధికారము లేదు. కాని అగ్రవర్ణస్థులు మిమ్మాటంకపరచుచున్నారు. నేనిపుడధికార మొసంగితినేని, నా ముఖ ప్రీతి కొరకై మిమ్ములను దేవాలయముల ప్రవేశింపనిత్తురు. తదుపరి యథాప్రకారము మిమ్మడ్డగింతురు,

కావున మీకొక్క అధికారము నొసంగుచుంటిని. వినుడు. ఈ దేవాలయమున ప్రతి సంవత్సరమును జరుగు నీ యుత్సవ సమయములో మూడుదినములు నిరాటంకముగా మీరు ప్రవేశింపవచ్చును యథేచ్ఛగా భగవద్దర్శనము కావించి తీర్థ ప్రసాదములు పుచ్చుకొని పోవుచ్చును. దీనికి మాత్రమేమియును భిన్నమురాదు." అని సెల విచ్చిరి. వారందరును సంతసించి, రామానుజుల ప్రస్తుతించి, ఎవరి గ్రామములకు వారు వెడలిపోయిరి. అప్పటి నుండియు పంచములు తిరు నారాయణ పురమునందు దేవాలయ ప్రవేశము కావించి తండుల ఘృతాది వస్తువులు స్వామికి సభక్తికముగా సమర్పించి, సర్వేశ్వరుని దర్శించి వెడలి పోవుదురు. అర్చకులు వారు తెచ్చిన పదార్థములను ప్రసాదము చేసి, భగవదారాధన మొనరించి సర్వ వర్ణముల వారికి పంచిపెట్టు చుండిరి. భగవద్రామానుజుల వారి, దివ్య శాసనమును శిర సావహించి చతుర్వర్ణముల వారు తదుత్సవము నందు పంచములతో కలిసి తీర్థ ప్రసాదములు స్వీకరింతురు. ఈ యాచారము నేటికిని కొన సాగుచున్నది.

కొంత కాలమునకు ముందు అచ్చటి అగ్రవర్ణస్థులు రామానుజ శాసనమును ధిక్కరించి, యుత్సవ సమయమున పంచములను దేవా లయమున ప్రవేశింపనీయక, నిషేధించిరట. వెంటనే స్వామివారి కల్యాణి పుష్కరిణిని నిండ పురుగులులు కలుకలాడితజ్జము కలుషీభూతమయ్యెను. అపుడు రామానుజాజ్ఞా తిరస్కారమే, ఈదుస్థితికి మూలమని తలంచి, మరల వారికి ప్రవేశార్హత కల్పించిరట. మరల పుష్కరిణీజలము స్వచ్ఛతమమై యొప్పెనని యిప్పటికిని పెద్దలు చెప్పుచుందురు.

కృతయుగమున సనత్కుమారమహర్షి ఈ పర్వతాగ్రమున నారాయణుని ప్రతిష్ఠించిన కారణమున దీనికి నారాయణాచలమనియు, దత్తాత్రేయమహర్షి త్రేతాయుగమ్మున, ఈ భూమిధ్రమ్మున సర్వేశ్వరు నారాధించి, శిష్యులకు వేదములు బోధించిన హేతువున దీనికి వేదాచల మనియు, ద్వాపరయుగమున యదుసంభవులగు రామకృష్ణులు భగ వంతుని సేవించిన కతనమున దీనికి యాదవాద్రి యనియు, కలియుగ మున యతీంద్రులీస్వామి నుద్ధరించిన హేతువున యతిశైలమనియు, నీ పర్వతమునకు నామము లేర్పడియెను.

చుట్టును పరివేష్టించి నడచుచుండిరి. ఇట్లు మహావైభవ సమన్వితముగా రంగనాథుని దివ్యాలయమును ప్రవేశించ, రంగేశ్వరుని పాదముల మీదబడి నమస్కరింపగా, రంగేశ్వరుడు యతీశ్వరుని చూచి 'నాకొఱకై చాల బాధలు పడితివి. అవి యన్నియు గతించిపోయినవి. ఇప్పటినుండి నీవెచ్చటికిని పోక శ్రీరంగమును నెలవుగా గొని, నివసించియుండుము' అని ఆజ్ఞాపించి తీర్థప్రసాదము లిప్పింపగా 'ధన్యోఽస్మి' యని రామానుజులు వానిని స్వీకరించి దేవాలయమునుండి, నిర్గమించి, కూరేశుని గృహమునుగూర్చి పోయిరి.

కూరేశులు గురువుగారి ఆగమనవార్తను విని శిష్యసమేతులై ఎదురేగిరి. నేత్రవిహీనుండగు శిష్యునింగాంచి రామానుజు లత్యంత వేదనం బొందుచుండ, కూరేశులు వచ్చి ఎంబెరుమానారు పదసరోజములపై వ్రాలెను రామానుజులు శిష్యునిలేవనెత్తి ప్రియంబొదవ కౌగిలంజేర్చి, 'నాయనా' నాకొరకై నీవిట్లు నేత్రరహితుండవైతివిగదా, యని దుఃఖించిరి. అందులకు కూరేశులు 'స్వామీ! పూర్వజన్మమున నేనే భాగవతునిలలాటము నందలి స్వరూపమును గాంచి హేళన గావించితినో? తత్ఫలమీజన్మమున నీవిధముగా ననుభవించుచున్నాను.' అని వచించిరి. అందులకు రామానుజులు 'వత్సా' నీవట్టివాడవుకావు. నీకిట్టి యిక్కట్టు కలుగుట నా కర్మఫలంబుగా చింతించుచున్నాడ. ఐనను మనపాలిటి పారిజాతము, శ్రీ వరదరాజస్వామి వారువున్నారు. వారు మనకు నేత్రము లీయక యూరకుండునా! యని యోదార్చి తన మఠమునకుపోయి, అచ్చటి విశేషములన్నింటిని పరిశీలించి వచ్చిన భాగవతుల యోగక్షేమములారసి, రెండు మూడు దినములుండి, కూరేశులను వెంట నిడుకొని కొంతమంది శిష్యులతో గూడి సత్యవ్రతక్షేత్రమున కేగిరి.

యతీంద్రులరుదెంచుచున్నారని విని కాంచీపుర వైష్ణవులెల్లరు, ఎదురువచ్చి ఘనస్వాగతము నెఱపిరి. స్వామియొక్క పాదములను (శఠగోపము) ఒక దివ్యవిమానము నందిడుకొని, అర్చకపరిచారకులందరును, సమస్త వాద్యబృందముతో, యతిరాజులకెదురేగిరి. యతీంద్రులు స్వామివారి పాద సరసీజములకు సాష్టాంగ వందనంబాచరించి, శిరస్సున ధరించి 'ధన్యోఽస్మి' 'కృతకృత్యోఽస్మి' అని

సంతసించిరి. కరిగిరిపురనిలయులెల్లరు, యతీశ్వరు పాదములకు ప్రణమిల్లి 'ఆర్యా' మీదర్శన భాగ్యమ్మున కృతార్థులమైతిమి. కరిగిరీశ్వరుని కరుణావిశేషముచే నేటికి మరల మిమ్ము దర్శింపగల్గితిమి అని స్తోత్రముజేయ యతినాధు లాపరిజనులు వెంటరాక రిగిరికి ప్రదక్షిణించి, లోపల ప్రవేశించి గర్భాలయమందలి జయావిజయులకు నమస్కరించి నారసింహానకు మంగళాశాసనామాచరించి, దేవాదిదేవుండగు వరదరాజును దర్శించి

కః శ్రీ శ్రియః పరమసత్త్వ సమాశ్రయః కః
కః పుండరీక నయనః పురుషోత్తమః కః
కస్యాయుతాయుత శతైక కలాంశకాంశే
విశ్వం విచిత్ర చిదచిత్ప్రవిభాగవృత్తమ్.

ఓ జగదీశ్వరా! ఈ జగత్తులన్నియు జగన్మాతయగు ఏ లక్ష్మీ కటాక్షమునకై యత్నించుచున్నవో, ఏదేని కటాక్షలేశము, ఇంద్రాద్యుత్తమ పదప్రాప్తికి హేతుభూతమో, అట్టి లక్ష్మికి లక్ష్మివైన వాడవును, శుద్ధసత్త్వస్వరూపుడవును వికసించిన తెల్లదామరలవంటి కన్నుదోయి కలవాడవును, పురుషశ్రేష్ఠుడవును, ఎవ్వని దివ్య మహిమాంబుధియందు చిందిన శీకరలేశముచే ఈ జగత్తులు సృష్టి స్థితిలయములను పొందుచున్నవో అట్టి దేవాది దేవుండవగు నీకు మంగళమగును గాక 'అని స్తుతించి కూరేశులను పిలిచి, 'వత్సా నీవు దేవరాజస్వామిని గూర్చి స్తోత్రమొనరింపుము. సర్వేశ్వరుడు నీకు ప్రసన్నుడగును అపుడు నీవు దృష్టినొసంగుమని వేడుకొమ్ము. అని స్తోత్రమును ప్రారంభింపజేసి, తాను దేవళమును వీడి వెలుపలకు వచ్చెను' కాంచీనగరము చాలా పెద్దదగుటచేతను, దానియందు వైష్ణవులధిక సంఖ్యలో నుండుటచేతను, ప్రజలు తండోపతండములుగా యతీంద్రుని పరివేష్టించిరి. చాలా కాలము క్రింద రామానుజుల దర్శించినవారగుటచే, చంద్రికా పూరమ్మును గాంచి యుప్పొంగు చకోరమ్ముల భంగిపాదమ్ములపై బడువారును యోగక్షేమములారయువారును తనవితీర వీక్షించు వారునై యుండిరి యతీంద్రులు వచ్చిన వారినందరిని కుశల ప్రశ్నలచే గౌరవించి తానుమేలు నాడునకు పోవుజయు తిరునారాయణస్వామి

సుదరించుటయు, చెలప్పిళ్ళరాయని ఢిల్లీనుండి తెచ్చి ప్రతిష్ఠించుటయు, ఢిల్లీ శునాత్మజతో నాయనకు వివాహము జరిపించుటయు మొదలగు విషయములు, వారితో ముచ్చటించుచుండిరి. ప్రజలందఱును తన్మయులై యితర ప్రపంచము నెఱుంగక వినుచుండిరి.

అలయమున కూరేశులు 'స్వస్తిహస్తిగిరి మస్త శేఖరః సంతనోతుమయి సంతతం హరిః నిస్సమాభ్యధిక మభ్య ధత్తయం, దేవమౌపనిషదీ సరస్వతీ. (వేద వేదాంత రూపయగు వాగ్దేవి, యే దేవుని దేవతా సార్వభౌమునిగాను, సమాన రహితునిగను వర్ణించుచున్నదో, అట్టి నాగాద్రి శిఖర భూషణుండగు వరదుడు నాయందనుగ్రహముంచునుగాక' అని ప్రారంభించి

నీలమేఘ నిభంజనపుంజ
శ్యామకుంతల మనంత శయం త్వాం
అబ్జపాణి పదమంబుజ నేత్రం
నేత్ర సాత్కురు కరీశ, సదా మే.

(నీలమేఘ కాంతిని తిరస్కరించు దేహము కలవాడును, కాటుకవంటి నల్లనగు కచపాశము కలవాడును శేషాహియందు పవ్వళించియుండు వాడును, తామరల నదఃకరించుచున్న పాణిపాదములు కలవాడును, పంకజనేత్రుడును, అగు కరిగిరీశుడు నా కన్నులకెప్పుడు సాక్షాత్కరించుగాక) అనగా తనకు నేత్ర దృష్టిని ప్రసాదించుము' అని వేడుకొనుచు స్తోత్రమును ముగించెను అంత వర దుడు 'కూరేశా! నీ స్తవమునకు సంతసించితి ఈ విభూతి ద్వయమునందు నీవు దేనిని వాంఛింతువో దానినెల్ల ప్రసాదించెద అడుగుము' అనెను. ఆ వాక్యములు విని కూరేశులు తన మనమునందు 'జగదీశ్వరుడు వరమనుగ్రహింతుననుచున్నాడు. నేను స్వార్థము నభిలషించుట యుత్తమ మార్గము కాదని' తలంచి, 'ప్రభూ! మీరు వరమొసంగ నిశ్చయించితిరయేని, క్రిమికంఠచోళ భయకంపితులై, దేశాంతర

గతులై యనేక బాధలకాశ్రయమై, లోకాంతరగతులైన శ్రీవైష్ణవుల కెల్లనీ దివ్య లోకప్రాప్తిని కలిగింపుము. అని వేడుకొనియెను. వరదుడట్లే యొసంగెదనని పలికెను. అటనుండి వీక్షించిన వైష్ణవులీ విశేషమును యతీంద్రులకు విన్నవించిరి. యతీంద్రులా యుదంతమును విని, వరదుని దేవాలయమును ప్రవేశించి, కూరేశుని జూచి, మండిపడుచు, 'కూరేశా! నేనేమి చెప్పితి, నీవేమి జేసితివి? నీవింతటి స్వతంత్రుడవెప్పుడైతివి. నా మాట నీకిట్లు నిర్లక్ష్యమగుటకు కారణమేమి? అని ప్రశ్నించెను. ఆ వాక్యములకు కూరేశులు పరితాపమందుచు 'అయ్యో! నేను గ్రహింపనైతిని. ఆచార్యాజ్ఞను దాటినవాడనైతిని. స్వరూపహానివచ్చెగదా! యని చింతించుచుండెను.

అంత రామానుజులు, వరదునిగాంచి క్రోధమూర్తియై, బొమలు ముడిపడ, కటములదుర, పెదవులు చలింప 'నీ లీలావిభూతియందు నూటయేడు దివ్యదేశము లున్నవి. ఏ సన్నిధికిపోయి నేనడిగిన నా శిష్యునకు నేత్రము లీమరు? నీవు నా యిష్టదైవమనియు, ప్రేమ పాత్రుండవనియు, నా పాలిటి కల్పవృక్షంబవనియు, ముంగొంగు పసిండివనియు, నూటయేడు దివ్యదేశములందున్న దివ్యమూర్తుల కందఱకంటె కరిగిరియందు నీ దివ్యనిధాన మున్నదనియు తలంచి, శిష్యుని తీసికొని వచ్చినందులకు గొప్ప పనిజేసితివి. అతడజ్ఞుండు కావున పొరపడవచ్చును. సర్వజ్ఞుండవగు నీవాతని దిద్దవలదా? నేనెందులకు వచ్చినది, నా శిష్యునెందును స్తోత్రము చేయుమన్నది, నీ వెఱుంగవా? వచ్చినవానకి మంచి మర్యాద చేసితివి. పోయివచ్చెద. నా శిష్యుని నేత్రములు తప్పించుకొనలేక పోయినప్పుడు చూచెదవు గాక' అని కూరేశుని చేయి పట్టుకొని, 'రారమ్ము! నీ నేత్రములు ఎట్లురావో నేను చూచెద' అని ఆజ్యము వోసిన మండు హుతాశనుంబోలె, మండిపడుచు వెనుకకు తిరిగెను అంత కరిగిరి నాధుడు రామానుజునింగాంచి 'ఆర్యా! నీకు కోపము వచ్చు పని నేన్నెందును చేయను. నీ శిష్యుడు కోరినదాని నిచ్చితినిగాని, క్రొత్తదేమియు నేనీయలేదు.

ఇప్పుడు మించి పోయిన దేమియు లేదు. నీకేమి కావలయునో కోరుకొనుము. ఇచ్చెదను. అనిపలికెను. అప్పుడు యతీంద్రులు శాంతించి "జగదీశ్వరా! నేను రథాశ్వ, గజసౌధ రత్న ధనధాన్యాదు లేమియు కోరను. నేను కోరునది నాశిష్యునకు దృష్టి మాత్రమే అని వచించెను. అపుడు కూరేశులు స్వామింజూచి "ప్రభూ! మీదర్శనంగు దృష్టి మాగురు దేవులను, దేవరవారిని, సద్గ్రంథములను, దేవర సంబంధములగు దివ్యదేవాలయమ్ములును, గోచరించు నట్లు మాత్ర మొసంగుడు. ఇంతకు తప్పయితరప్ర పంచమేదియునాకవసరము లేదు అని వెల్లడించెను. వరదుండు యతీశ్వరుంజూచి; అయ్యా నీ శిష్యుని వాంఛానుసార మీయవలందువా? లేక నీయిచ్ఛానుసారమా? తొలుతనే వచింపుము. దృష్టి నిచ్చిన తదుపరి నన్ను దూరవలదు" అని పలికెను. అపుడు రామానుజులు స్వామితో ప్రభూ! అతడు కోరినట్లే మొసంగుడు. నేనేమి సేయగల" ననినవెంటనే వరదుండు అట్లే యిచ్చితినని పోయెను. వెంటనే కూరేశునకు యథాప్రకారముగా కన్నులు వచ్చి చక్కగా గోచరించు చుండెను. రామానుజులు వరదరాజ స్వామి వారి భూషణములను కూరేశునకు చూపించి, యివి యే భూషణములో వాని నామములు నిర్దేశింపు మనగా; కూరేశులు, వాని పేర్లనుచెప్పిరి. అపుడు రామానుజులు శిష్యునకు దృష్టి వచ్చినదని విశ్వసించి, వరదరాజస్వామి వారియాజ్ఞగై కొని, శిష్యునితో సమస్త పరివారముతో శ్రీరంగమునకు వెడలిపోయినదిమొదలు సుఖంబొందెను.

యతి చంద్రులొక దినమున గోదాదేవి విరచితస్తోత్ర మొకదానిని పఠించు చుండిరి. అందొకచోట గోదాదేవి సుందర భుజ స్వామి వారికి చేసిన విన్నప మొకటి యీవిధముగా నుండెను. ఓ దయాళూ! నీవు నన్ను పాణి గ్రహణము జేసికొన్నచో, నీకు శత సంపూర్ణ పాయస ఘటములు, సహస్ర నవనీత ఘటములును సమర్పించెద". ఈవిషయమును గాంచిన యతిపద్యులు, అయ్యో గోదాదేవి చేసిన మ్రొక్కుబడి చెల్ల లేదేయని చింతించి, సుందర బాహు స్వామి సన్నిధికి పోయి మ్రొక్కుబడికి కట్టింపుగా స్వామికి

సమర్పించి "ఓ కరుణా నిలయా! మాతల్లి యొనర్చిన మ్రొక్కుబడికి కాలదోషము పట్టినది. అందు వలన వడ్డీతో సహా నీకు మ్రొక్కుబడిని తీర్చితిని" అని విన్నవించి శ్రీవిల్లి పుత్తూరున కేగెను. అచట "వడ పెరుంగోయిలు డయాస్" అను నామముతో ప్రసిద్ధుడై యున్న వటపత్రశాయిని దర్శించి ఆండాళాలయమునకు పోయి, ధ్వజ దండము కడ నమస్కరించు చుండెను. గోదాదేవి, యతీంద్రులంజూచి "అన్నా! అని కేకవైచెను. ఆ కేక విని రామానుజులు గోదాదేవిని సమీపించి, ఆమె పాదారవిందముల కెరగి, ప్రక్కన ఉన్న సర్వేశ్వరు నకు పాదాభివందన మాచరించి సమీపమున నిలచి యుండెను. అంత గోదాదేవి రామానుజులం జూచి నీవు నాకన్న చిన్న వాడవైనను నేను చేయలేని పనిని చేసితివి. కావున నాకన్న పెద్ద వాడవు సుమి! స్వామికి మ్రొక్కుబడిని జేసి తినేగాని, దానిని తీర్ప లేక పోయితిని. దానిని వడ్డీతో కూడా చెల్లించితివి. తత్కారణమున నిప్పటి నుండియు నీకు గోదాగ్రజులను నామంబు ప్రసిద్ధమై యుండు, యింతియగాక నీవు నాకొరకు మిక్కిలి శ్రమించితివి కాన నేను నీకు ఋణపడి యున్నదానను. నీవేదైన వరము కోరుకొమ్ము ఇచ్చెద"నని ఆదరంబున భాషించెను.

రామానుజులామెయను గ్రహంబున కుప్పొంగి "తల్లీ! నీ విట్లనుట నాకు చాలదా! ఇంత కన్న నాకు వేరు వరము యేమికావలె. నీవు కోరు కొమ్మంటివి: కోరిక యూరకుంటినేని, అది నిరసన భావముగా గోచరించును. అందు వలన నేకోరు కొనుచుంటిని నామ తానుయాయులైన సర్వవర్ణస్థులకు మోక్షమును ప్రసాదింపుము వారు బద్ధ సంసారులైన కారణమున మిమ్ము గూర్చియేమియు చేయజాలరు వారియందరికొరకు నేనే ప్రపత్తిచేయుచుండెదననిపలుకనామె సంతసించి అట్లే యొసంగెద నని తెలిపెను. ఈ విధముగా రామానుజులూమెచే వరములు గ్రహించి, వారికిమంగళా శాసనములు జేసి, అచటినుండి బయలుదేరి చించాకుటమను నొక గ్రామమును జేరిరి.

ఆ గ్రామమధ్యమునగల యొకవీధి యందు బాలబాలికలాడు కొను చుండిరి. రామానుజులా పిల్లలజూచి ,,ఇచ్చటకు ఆళ్వార్ తిరు

నగరి ఎంత దూరమున గలదు,, అని ప్రశ్నించిరి. వారిలో పది సంవత్సరముల యీడు గల బాలిక యతీంద్రుల జూచి ఆర్యా! మీరు వైష్ణవ సన్యాసులుగదా! మీకు తిరువాయ్ మొళిరాదా? యని ఎదురు ప్రశ్న వైచెను. ఆ మాటకు రామానుజులాశ్చర్య చకితులై అమ్మా! తిరువాయ్ మొళివచ్చినంత మాత్రమున కురు కాపురము యొక్క దూరము వెట్లు తెలియును? అని అడిగిరి. అపుడా కన్యక అయ్యా? ఫలాని పాశురమున చించాకుమునకు మరు కాపురము కూతపెట్టుదూరము అని యున్నదికదా! చూడుడు అని పలికి ఆపాశురమును పఠించి అర్థమును చక్కగా విపులీకరించెను. ఆవాక్యములువిని యతిరాజు లక్క జంపడి ఔరా! ఆళ్వారుల కృపాకటాక్షములచే సీదేశ స్తులకు సహస్ర గీతి ఎంత సుళువుగా నోటికి వచ్చుచున్నది? ఇంతటి చిన్నపిల్లలకు, ఈ పాశురములు అర్థముతో గూడా కంఠస్థములుగా నున్న వన్నచో నదియంతయు ఆళ్వారుల ప్రభావముకదా యని తలంచి కన్యకనుముద్దు చేసి, వారి గృహమున కరిగి ఆ బాల తల్లిదండ్రుల కావిషయమంతయు తెలిపి, ఆపూట వారి యింట బస చేసి, ఆపిల్లతల్లి వండిన పదార్థములు వరదరాజు స్వామికి నైవేద్యమిడి తానుభుజించి, వారికి జెప్పి మరుకాపురికి పయనమైరి.

రామానుజులు మరుకాపురము ప్రవేశించి, ఆదినాథ స్వామి వారి యాలయ ప్రాంగణమ్మునకేగి అనేక సహస్ర వర్షముల నుండి యున్న చింత చెట్టును దర్శించి దాని గొప్ప తనమును కొనియాడుచు, తొఱ్ఱ యందు నున్న శఠారాతిని జూచి సాష్టాంగదండ ప్రణామంబు లాచరించి, వేదమంత్రములనుచ్చరించుచు, ద్రవిడ పాశురములు పఠించుచు, నర్చకులు తీరు మంజనము సమర్పించు చుండ, వారి భక్తిప్రపత్తులకు సంతశించుచు, వారి కందరకు నమ్మాళ్వార దివ్య మహాత్మ్యముగా నుపన్యశింపప్రారంభించిరి. ఆర్యులారా! ఈ శఠారాతి ప్రపన్న జనకూటస్థులు. వైష్ణవ దర్శనమూల భూతులు అనాదిసిద్ధమై కలిప్రభావమున శిథిలీభూతమైన వైష్ణవ మతమును వేదాంతరహస్యార్థ ములను. ద్రవిడ భాషలలో సులభముగావచించిరి సామవేద రూప సహస్రగీతి నిర్వచించి, లోకోద్ధారణము నెరపిరి

వీరు సర్వదా మనకు పూజ్యులు వైష్ణవ మతంబునకింత హితమొనర్చిన వీరి ఋణమెట్లు తీర్చుకొనవచ్చును? నాకొక పుత్రకుండున్నచో వీని పేరు పెట్టి నిరంతరము పిలుచుకొనుచు కొంతవరకు ఋణవిముక్తుఁగ యుండెడివాడను.

అచ్చట నొక మహా తేజస్సంపన్నుడగు బాలకుండుండెను ఆతఁడీ వాక్యములువిని యతీంద్రుల మోమున దృష్టినిలిపి స్వామీ! మీకట్టి భావమే యున్నచో, నన్ను మీయాత్మజుంగా భావించి, మద్దివ్య నామంబును నాకొసంగుఁడు, అని కోరెను. యతీంద్రులు సంతసించిఆ, బాలునకు మరుకానాధుఁడను పేరు పెట్టి స్వాత్మజుండని యెంచిరి. అప్పుడు నమ్మాళ్వారు స్వీయ పదపద్మములే, యతీంద్ర స్వరూపమందె నని తలంచిరి. అప్పటి నుండి లక్ష్మీశ్వరుని పాదములు శఠారాతియనియు శఠారాతి చరణములు యతీంద్రులనియు, యతీంద్రుని పద్మములు దాశరథియనియు, సంప్రదాయ సిద్ధముగా మిక్కిలి లోకవిశ్రుతినందెను. కావున భాగవతులందఱు లక్ష్మీశ్వరుని సన్నిధియందు తాము స్వీకరించు శఠగోపమును నమాళ్వారనియు, శఠారాతి సన్నిధిని గ్రహించు శఠగోపమును యతీంద్రులనియు యతీంద్రుల చెంత తీసుకొను గోపమును దాశరథియనియు భావింపవలయును.

యతీంద్రులిట్లు నమ్మాళ్వారిని పూజించి, వారికడ సెలవుగైకొని శ్రీరంగమునకు వేంచేసి, రంగనాథుని సేవించుచు యథాసుఖంబుండిరి.

ఇట్లు శ్రీరంగమునవశించు రామానుజులు బ్రహ్మాత్మైకవాదులగు నద్వైతులను, ఆత్మానిత్యవాదులగు బౌద్ధులను, నిరీశ్వరవాదులగు మీమాంసకులను, సర్వక్షణికవాదులగు జైనులను, నైమిత్యబ్రహ్మవాదులగు కాపిలులను, దేహాత్మవాదులగు చార్వాకులను జయించి, వైష్ణవదర్శనమును అభివృద్ధి పరచుచుండిరి. యతీంద్రులిట్లు విజయ ధ్వజమును ప్రతిష్ఠించి, బద్ధచేతనుల నెల్లనుద్ధరించుచున్నారని, సర్వవర్ణముల వారును, సకల మతస్థులును వారి సన్నిధి కేతెంచి వారి పదపద్మముల నాశ్రయించి వారికి శిష్యులగు

చుండిరి. భారతవర్షంబంతయు వైష్ణవ మతపూరితంబై విరాజిల్లు
చుండెను. ఎచ్చట జూచినను తులసీ నలినాక్ష మాలాధారులే. ఎందు
కన్గొన్నను శంఖచక్ర ముద్రిత భుజమూల ప్రదేశులే. ఎవరిని వీక్షిం
చినను ద్వాదశోర్ధ్వ పుండ్రధారులే ఇట్లు జగత్తంతయు భాగవతమ
యంబై యతీంద్రుల శిష్య పరంపరను లెక్కింప ఫణిపతి కైనను,
వాణికైనను లెక్కింప శక్యముగాక యుండెను, వారిలో డెబ్బది
నలుగురు ముఖ్యశిష్యులైరి. వారే పీఠాధిపతులు. మరికొందరు
ముఖ్యతములుగా నెన్నబడిరి. ఏట్లనవరద విష్ణ్వాచార్యులు, కూరత్తా
ళ్వార్; భట్టవర్యులు, ఈ మువ్వురును రామానుజులు శ్రీ భాష్య
మును రచించుటలో చేదోడు వాదోడు గాయుండి సద్రహస్యము
లను సకల కనులకు తేట తెల్లముగా వించుచుండిరి. దేవరాజముని
భగవదారాధనము చేయుటకై నియోగింపబడిరి. ప్రణతార్తిహరా
చార్యులును, వారి సోదరులును, రామానుజులకు వంట చేయుటకు
నిర్ణయింపబడిరి. ఆంధ్రపూర్ణులు నిత్యమును యతీంద్రులకు అభ్యం
జనము చేయించుచుండిరి. బాలాచార్యులు గురువుగారి కమండలపు పాదు
కనును, మోయుచుండిరి ధనుర్దాసు యతీంద్రులు లేచునప్పుడు కైదండ
యొసంగుచుండెను. అమ్మంగియను వారు ప్రతిరాత్రమునను యతీం
ద్రులకు పాలు కాచి యిచ్చుచుండిరి ఉత్కలార్యులాచార్యులభోజన
పాత్రములను శుద్ధిచేయుచుండిరి ఉత్కల వరగుడు గురుదేవునకు
చామరములు విసరుచుండెను. కలంకదేశికుడు పరవాదుల జయిం
చుట యందు నియుక్తుడయ్యెను. చండశుండలను విఖ్యాతి నందిన
మల్లయుద్ధ వీరుడు, రాజాస్థానము లందలి మల్లురను జయించి, ఆ
రోజు లొసంగిన బహువిధపారుక్రియలను యతీంద్రుల పాదములకడ
సమర్పించుచుండిరి ఇట్లు తలకొక కైంకర్యము చేయుచు యతి భూపతి
నాశ్రయించి యుండిరి.

ఆంధ్ర పూర్ణుడు గురుభక్తి యందద్వితీయుండై ఆచార్య
లేయుపాయోపేయములని తలంచి రామానుజాష్టోత్తరశతమును
చెప్పి ప్రతి దినమును ఆచార్యుల పాదుకల నర్చించుచుండెను.
ఆయనకు గురువుకన్న పరదైవము వేరు లేదని దృఢ ప్రత్యయము

సర్వశాస్త్రము లీవిషయమునిట్లే ఘోషించుచున్నవి. జలమువంటి
వాడు గురువు తామర వంటివాడు ఛాత్రుడు, సూర్యునివంటివాడు
సర్వేశ్వరుడు తామరనీరు నందుండగా సూర్యోదయముచేవికశించును
అదియే నీటిని బాసిన చోనదే స్నేహితుడగు సూర్యుడు తామరను
మాడ్చివైచును. ఆట్లే అచార్య భక్తియుక్తుడగు భాగవతుని భగ
వానుడను గ్రహించును. లేనిచో అను గ్రహింపడు సరికాదా నిగ్ర
హించి తీరును ఇదియే గదా గీతాచార్యులు సాయించినది. ,,అర్జునా
నీవు పెద్దల కడకేగి కర్మయోగరహస్యము నవగతము కావించు
కొమ్మన్న ఎట్లన జ్ఞానవంతుల సన్నిధికేగి, వారికి సాష్టాంగ వందన
ప్రణామంబులాచరించి, శుశ్రూషయొనర్చి సమయము నాలోచించి
వారికి దయ కలిగినపుడు వినయభరితుడవై ప్రశ్నించి, తెలిసికొనుము
అంతేకాని నీవు వారిగడకేగిన క్షణముననే నాకు కర్మ యోగరహ
స్యమునెరిగింపుమని పరుషముగా నడుగవలదు. అట్లు జేసినవారి తద్ర
హస్యములు వెల్లడింపరు సరికాదా! నీపై కోపగింతురు. అంతట
నీవు వ్యర్థుండ వగుదువు.

యతి భూపతి యొకదినమున గ్రామాంతరమునకు పోవుచుండ
ఆంధ్రపూర్ణులు, యతీశ్వరుల తార్చన దేవతాటికను తలపై ధరించి తన
దేవతార్చనమందపీమును హస్తమున నిడుకొని, వారి వెంట నడచు
చుండిరి. కొంతదవ్వరిగిన పిదప చేయి నొప్పిపుట్టి తన చేతియందలి
మందసమును రామానుజుల దేవతార్చన పేటికపై నిడుకొనెను ఇట్లు
కొంతదూరము పోయిన వెనుక యతీంద్రులు వెనుదిరిగి చూచి ,,ఆంధ్ర
పూర్ణాయిదియేమి? నీనెత్తిమీద నున్న నాదేవతార్చన పేటికలో
స్వామి వారున్నారు. నీయర్చన మందసములో నాపాదుకలున్నవి.
అట్టిచో నీశిరముపై నున్న స్వామిపై నాపాదుకలనుంచితివి. నీకు మతి
చలించినదా? అని మందలించిరి అపుడాంధ్రపూర్ణులు గురుదేవుం
జూచి ,,స్వామీ! మీయిష్టదైవమును తెచ్చి నానెత్తికెత్తితిరి. మరి
నా దైవము యెచ్చట నుండవలె? నా దైవము మీదైవముకన్న
నికృష్టుడు కాదుగదా!,, అని పలికెను. (రామానుజుల యిష్టదైవ
ము వరద రాజ స్వామి ఆంధ్రపూర్ణుల యిష్టదైవము యతీంద్రుల

పాదుకలు ఆ వాక్యము విని యతీంద్రులు నవ్వి ఇది యీాతని గొప్ప తనముదదా యని తలంచిరి.

ఒకానొక దినమున యతీశ్వరు లాంధ్రపూర్ణ సహితులై రంగేశ్వరు సన్నిధానమున కేగి స్వామిని సందర్శించి, శిష్యుంగాంచి „ఆంధ్రపూర్ణా! రంగధాముని నేత్రయుగ్మక సౌందర్యమును చూడుము. అరవిందములకచ్చులడగించుచు, సమస్త జీవకోటిని, కరుణారస ప్రవాహమునముంచుచూ, సూర్యచంద్రులవలె ప్రకాశించుచున్నది.,, అని పలికెను అందులకాంధ్రపూర్ణుడు „ఆర్యా! ఆచార్యాంబక సౌందర్యము ననుభవించుచున్న ఈ దాసునకు ఇతరనేత్ర సౌందర్యము గోచరింపదు. ఈ నానేత్రము లితరములు దర్శింపవు" అని సమాధానమొసంగెను. ఆవాక్యములకు లక్ష్మణదేశికులు దరహాసమొనరించి, యాతని గురుభక్తికి సంతసించి, ఇదియొక అధికారమని తలంచి మిన్నకుండెను.

మరియొక దినమున దేశికులు భుజించును, నాంధ్రపూర్ణుని పిలిచి „వత్సా! ఇదిగో యీా కబళమును భక్షింపుము,, అని అన్నపు ముద్ద నొసంగిరి. ఆంధ్రపూర్ణులు సభక్తికముగా దోయెలొగ్గి మహా ప్రసాదమని యాయన్నమును స్వీకరించి భక్షించి, చేతులను కడుగ కూడదని నిర్ణయించి, రెండు చేతులను శిరస్సునకు తుడుచు కొనుచుండెను. యతిసార్వభౌములద్దాని వీక్షించి „ఆంధ్రపూర్ణా ఆ ఎంగిలి చేతులట్లు శిరము తుడుచు కొందువేల? తప్పుకాదా! త్వరగా వెళ్ళి హస్త ప్రక్షాళనమాచరింపు,, మని కోపముతో నిర్దేశించిరి. చిత్తమని ఆంధ్రపూర్ణుడటనుండి బయటకు వెడలిపోయెను.

ఇంకొక వాసరమున రంగనాథుని కోవెలయందు అర్చకులు ప్రసాదమును కొనివచ్చి యతీంద్రుల కర్పించిరి వారందు కొంత భుజించి శేష ప్రసాదము నాంధ్రపూర్ణున కొసంగిరి ఆంధ్రపూర్ణుడా ప్రసాదము తిని, అచ్చటనే దేవాలయమున చేతులు కడుగుచుండెను. అది జూచి లక్షణ దేశికులు „ఆంధ్రపూర్ణా! నిజముగా నీకు మతి పోయినది లేదా పిశాచము సోకియుండవచ్చును. భగవత్ప్రసాదమును భుజించి చేతులు కడుగవచ్చునా? అందునా దేవాలయమున! ఇది

మహా పాతకముగదా! ఇంత వరకు నీకు జ్ఞానము కలుగకుండుట
విచార్యాము. అని క్రోధమూర్తియై వచించిరి. ఆ వాక్యమును విని
ఆంధ్రపూరుడు గురుదేవా! తమరొకప్పుడొకవిధముగా మరొకప్పుడు
వేరువిధముగా సెలవిచ్చుచుందురు. మొన్నటి దినమున నేను చేతులు
తలరు దుద్దుకొనుచుండగా నట్లునర్చుట దోషమని మందలించితిరి.
ఇప్పుడు చేతులు కడుగుట దోసంగనుచుండిరి. దేనిని మేమాచరింప
వలయునో తెలియకున్నది. అనెను అంగులకు యతీంద్రుడు కొంత
నడిమోచించ వత్సా! అప్పుడు నేనొసంగినది మద్భుక్తశేషము ఇప్పు
డొసంగినది భగవత్ప్రసాదము. దానికిని దీనికిని భేదము లేదా?
అని ప్రశ్నింప నాంధ్రపూరుడు ప్రభూ! మీరు సర్వజ్ఞులు కావున
ఆ వ్యత్యాసము మీకు తెలియును. అల్పజ్ఞులమగు మాకెట్లు తెలి
యును. యదార్థమునకు భగవత్ప్రసాదము గొప్పదనియు, మీభుక్త
శేషము తక్కువదనియు, మాకునమ్మకములేదు, మీరొసంగనదేదియై
నను మహా ప్రసాదమనియే మావిశ్వాసము" అని ప్రత్యుత్తరమొసం
గెను. ఆవాక్యములకు మురిసి యతీంద్రులు మిన్నకుండిరి.

ఆంధ్ర పూర్ణుడొకప్పుడు, రాత్రివేళ యతీంద్రుల కొఱకై.
పాలను కాచుచుండెను. అట్టి సమయమున రంగేశ్వరుడు నిజవైభవం
బుతో రథాధిరూఢుడై యూరేగుచు వచ్చుచుండెను. అది చూచి
లక్ష్మణసూరి "ఆంధ్రపూర్ణా! రంగేశ్వరుడు మహా వైభవోపేతుడై
వీధివెంట కన్నులపండువుగా వేంచెయుచున్నాడు. నేత్ర పర్వముగా
వీక్షింపవచ్చునురమ్మని అని పిలిచెను. ఆంధ్రపూర్ణుడందులకు "స్వామీ
నేనిపుడు బయటకువచ్చితినేని మత్స్వామి కొరకు కాచుచున్న పాలు
పొంగిపోయి, వ్యర్థమగును. కావుననేనిపుడు రాజాలను. తనుపరి
ఎప్పుడైనను రంగధాముని సందర్శింపవచ్చును." అప బదులు చెప్పెను.

ఓకానొక సందర్భమున నాంధ్రపూర్ణుని శరీరసంబంధులగు
బంధువులాతని యింటికివచ్చిరి, రెండులోజులటనుండి వెడలిపోయిరి.
ఆంధ్రపూర్ణుడు వారింగూర్చి, ఈవచ్చిన బంధువులుశరీరసంబంధులు
పరమపామరులు. ఇట్టివారిదర్శన స్పర్శనాదులతో నేనేగాక, మద్గృ
హమును అపవిత్రమైనది, అని చింతించి

గృహమును గోమయంబుచే శుద్ధి చేయించి, ఇంటగల వంటపాత్రము లన్నింటిని దూరముగా పారవైచి, మొదలియాండాన్ (దాశరథి) గృహసీమకేగి వారు తీసివేసి దొడ్డిలో పారవైచిన పాత్రల గొనివచ్చి గేహమ్మునుంచి, భార్యం జూచి 'యోతన్వీ! మన గృహము పవిత్రమైనది. ఇక వంటచేయుము' అని ఆదేశించెను. గురు సంబంధులు కాని వారలెల్లరు, నపవిత్రులని యాతని భావము. గురుపాద తీర్థమును తప్ప. అన్యజలము నాతడెప్పుడును అంటియెరుంగడు. తన గ్రామమున సైతము, గురుపాద తీర్థంబును నిల్వచేసి దానినే స్వీకరించుచుండెను. గురుని పాదుకలను పూజించుట, గురుపాద తీర్థంబును గ్రోలుట, గురుండే సాక్షాద్దైవ స్వరూపుడని తలంచుట, ఆంధ్రపూర్ణులకు తక్క పరులకెవ్వరికిని, సాధ్యంగాని నియమమై యుండెను. రామానుజులకు వేలకొలది శిష్యులున్నను, వారిలో నాంధ్రపూర్ణుండగ్రేసరుండని, సర్వులును విశ్వసించి యుండిరి. ఆంధ్రపూర్ణుండు తన చరమదశయందు బంధువులనెల్ల రావించి, మీరందఱు యతీంద్రుల పాదపద్మంబుల నాశ్రయించి జీవింపుడు. మీరు ధన్యులగుదురు; అని వచించి రామానుజాష్టోత్తర శతనామావళిం జెప్పి లోకంబు నుద్ధరించెను.

లక్ష్మణసూరి యొకానొకా దినంబున, కావేరీతరంగముల మున్గి శిష్యపరివృతుడై తిరిగి మఠంబునకు వచ్చుచుండెను. అట్టి సమయంబున పెరియనంబిగారు యెదురేగి యతీంద్రుల పాదపద్మంబులపై బడుచుండిరి. రామానుజులు చేతులు జోడించి నిలువబడియుండిరి. పెరియనంబి పాదాభివందనమాచరించి, ఇంటికేగెను. అది చూచి అచ్చటనున్నవారు ఆశ్చర్యచకితులై, పెరియనంబి గృహంబునకు పోయి, ఆయనతో 'అయ్యా!' రామానుజుడు మీకు శిష్యుడుగదా! శిష్యుని పాదంబుల కెఱగుట దోషసంయుతం గదా! మీరట్లేల యొనర్చితిరి?' అని ప్రశ్నించిరి. ఆ మాటలు విని పెఱియనంబి 'అయ్యా! నేను రామానుజుల పాదంబులపై బడితినా? కాదు. కాదు. మాగురు చంద్రులగు యామునమునుల చరణ సరసిజంబుల పై బడితినని కొంటిని, యామునమునులే వచ్చినట్లు తోపగానే నేనట్లు చేసితి' నని బదులొసంగెను. అచ్చటి వారందరు అయ్యా! మీ మాటలు చిత్రంబుగా నున్నవి. ఏనాడో పరమపదించిన యామునమునీంద్రులెట్లు వత్తురు?" అనిరి. అంత వారలంగాంచి యాతండు చిరునవ్వు నవ్వి 'అయ్యలారా! రామానుజుల తత్త్వము మీకింతవఱ కవగతము కాలేదు. ఆళవందారు పరమపదించిన తదుపరి, ఆచార్య పూర్తి యీ యతీంద్రులయందు తప్ప వేఱొకచోట లేదు. మేమేకాదు ముందు గతించిన వారందఱు వీరికి నమస్కరించిపోయిరి. అని విషయమంతయు సాకల్యముగా వివరింప వారు సంతసించి, తమతమ గృహమ్ముల కరిగిరి. కొందఱు వైష్ణవులు యతీంద్రుల దర్శించి 'స్వామీ! పెరియనంబిగారు మీకు గురువులు గదా! వారు మీ పాదములపై వ్రాలుటకేమి కారణము?' అని

అడిగిరి అంతవారు వైష్ణవుల కలయం గనుగొని 'మా గురువుగారల్లేల యాచి
రించిరో నాకేమియు తెలియదు. మీరిట్లు చేయుడు ఇట్లు చేయకుడు అని వారి నాదే
శించుటకు మాకధికారము గలదా? వారెట్లు చేసిన నదియే పరమార్థమని భావించు
టయే మాకువిధి' అని సమాధాన మొసగిరి.

యతిచంద్రు లొకప్పుడు తిరుమల సమీపమునందలి యొకానొక గ్రామమున
శిష్యులతోకూడ యుండిరి. తొండూరు కొండయను పేరుగల యొక వృద్ధ
గోపాంగన, పెరుగు నమ్ముకొనుచు నచ్చటికి వచ్చెను రామానుజాంతేవాసు
లామెకడ పెరుగును తీసికొని, మూల్యమును చెల్లింపబోయిరి ఆజరఠ వారిచ్చు
ద్రవ్యమును గ్రహించుటకు నిరాకరించి, 'అయ్యలారా! ధనము కొఱకు మీకు దధి
సమర్పించినదాననుకాను జగద్గురువగు నీయతీంద్రులు మోక్షాధికారులని యెఱుం
గుదు మీరు నాకొసంగవలసిన ధనమునకు, నిత్యవిభూతియం దెంత భూమివచ్చునో,
అంత నాకు మీగురు చంద్రులచే నిప్పింపుడు' అని కోరెను. అందులకు వారందఱు
మందస్మిత వదనారవిందులై, గురు సన్నిధికేగి వారికీవిషయమును విన్నవించు
కొనిరి యతీంద్రులామెను పిలిపించి 'అవ్వా! నీవొసంగిన పెరుగునకు ఖరీదీయ
గలముగాని పరమపదమున నీకు స్థలమెట్లు కేటాయింపగలము? అది మాచేత
నున్నదా! నీవెట్లడిగితివి? ఇట్టి విచిత్రము లోకమునం దెచ్చటనైన కలదా? అని
ప్రశ్నించిరి.

ఆ వృద్ధ యతిశ్రేష్ఠుని తిలకించి, నమస్కరించి 'ప్రభూ! ఈ విచిత్రము
లోకమునం దెచ్చటను లేకుండుట వాస్తవమే కాని మోక్షాధికారి మీసమస్తాజాండ
మున మీకొక్కరికేగలదు. పశుపక్షి మృగాదులకు సైతము మోక్షము నిచ్చు మహా
దాతవు కదా! అట్టి నీకు దీనురాలనగు నాకు మోక్షమిచ్చినంతమాత్రమున తగ్గి
పోవునది లేదుకదా! పైని మీచిత్తము, నాప్రాప్తము' అని పలికి మిన్నకుండెను.
ఆ మాటలకు ఎంబెరుమానారు సంతసించి, నవ్వుచు నొక పత్రముపై 'నీ వృద్ధాంగ
నకు మోక్షమిమ్ము' అని శ్రీనివాసప్పెరుమాళ్ళకొక లేఖను వ్రాసి దాని నా
వృద్ధాంగనకిచ్చి, నీ పత్రికం గొంపోయి, తిరుమలేశునకిమ్ము, అతండు నీ కోరిక
తీర్చును' అని పలికిరి. ఆ గోపాంగన ఆ కమ్మను తీసికొని, వెంకటాచలమునకు
పోయి దివ్యభవనమునందు ప్రవేశించి, గోపురమునకు జోహారువులొనర్చి, జయ
విజయులకు నమస్కరించి, పెరియ తిరువడికి వందనంబాచరించి, స్వామిసన్నిధి
కరిగి, ఆ పత్రికను సర్వేశ్వరుని పదములపై నుంచి, భక్తితో 'దేవాది దేవా!
ఈ జాబును మీకిమ్మని యతీంద్రు లొసంగిరి. అనుగ్రహింపుడు' అని వచించి
నమస్కరించెను. అంత నచ్చటనున్న జనులందఱకు వినిపించునట్లుగ 'ఓ
అవ్వా! రామానుజులు నీకిచ్చిన పత్రముచు గైకొంటిని. యతీంద్రు నానతిచొప్పున
నీకు మూడు దినములకు మోక్షమొసంగెద' అని దేవాలయమునుండి యొక ధ్వని
వీతెంచెను. అది విని యెల్లరును ఆశ్చర్యచకితులై నిశ్చేష్టులైరి. అంత నా

గోపాంగన కొంతగిగవచ్చి, సర్వేశ్వరానుగ్రహమున, మూడవ దినమున మోక్ష లోక ప్రాప్తినొందెను పరమపదమ్మున స్థలమునిచ్చుటకు యతీంద్రులొక్కరికి మాత్రమే సాధ్యమని లోకమంతయు కొనియాడెను.

ఒకానొక సమయమ్మున సుందరబాహుస్వామి రామానుజ సంబంధులెల్లరు తన కోవెలకు రావచ్చునని ఆనతిచ్చెను. అంతట రామానుజుల శిష్యులందరు ఏతెంచిరి. కాని పెరియనంబి సంబంధులు మాత్రమచ్చటికేగలేదు. అంతసుందర భుజస్వామి పెరియనంబి సంబంధుల పిలిపించి 'మీరేం నా సన్నిధికి రాలేరు? అని ప్రశ్నించెను. వారు స్వామినిజూచి 'అర్యా! మీరు రామానుజు శిష్యుల నాహ్వానించితిరి. కాని మమ్ము పిలువలేదుకదా! అని సమాధానము చెప్పిరి. అపుడు స్వామి వారినిజూచి 'మీకు రామానుజ సంబంధమున్నది. ఎట్లన పెరియనంబి, రామానుజుల గురువుకదా! గురు సంబంధముచే మీరును రామానుజ సంబంధులే' యని పలుక వారు సంతోసించి వెడలిరి.

రామానుజులకు పూర్వులగు శర, గోపాది ఆళ్వారులును. ఆచార్యులను యతిరాజులకు పరమగురువులమను సంబంధమును పురస్కరించుకొని మోక్షప్రాప్తి నందిరి. తరువాతివారందరు వారి పాదములే రక్షకములని యెంచి, మోక్షమున కేగిరి కూరేశుడు, పరాశరభట్టరు, వ్యాసభట్టరు, ఎంబారు, దాశరధి, ఆంధ్ర పూర్ణులు, మొదలగువారందరు, తమ శిష్యుల కుపదేశించునపుడు 'రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే' 'ఎంబెరు మానారు దివ్యతిరువడిగళే శరణమ్' అని విశ్వసించియుండుడు' అని యుపదేశించిరి తిరుమలయందలి వేంకటేశ్వరుడును, శ్రీరంగమున రంగేశ్వరుడును, యాదవాద్రియందు తిరునారాయణస్వామియు, శెల్వప్పిళ్ళరాయండును, తిరక్కుడి గుడియందున్న సర్వేశ్వరుండును కరిగిరి దేవరాజ స్వామియు రామానుజుల గౌరవించి, యుభయ విభూతులకు నధికార మిచ్చిన కారణమున యతీంద్రుల కట్టిగౌరవము కలిగెను.

సర్వేశ్వరావతారము లనంతములు. ఐనను రామకృష్ణ నారసింహావతారములు ముఖ్యములు. జ్ఞానము, శక్తి, బలము, ఐశ్వర్యము వీర్యము, తేజము అను నారుగుణములకును, భగమనినామము. ఈ ఆరు గుణములు కలవాడు కావుననే సర్వేశ్వరుడు భగవంతు డనబడుచున్నాడు. ఈ పై జెప్పిన షడ్గుణములును, పరిపూర్ణముగా నెలకొనియుండుటచేతనే, ఈ మూడవతారములకును, అత్యధిక ప్రసిద్ధి కలిగెను. అందునను నారసింహావతార ముగ్రమైనందున సర్వజనులుపాసించుటకు సాధ్యముకాదు. రామకృష్ణావతారములు మిక్కిలి సౌమ్యములైన కారణమున, నందరునుపాసింపవచ్చును. అవతారములెత్తువాడు సర్వేశ్వరుడు. ఆతడొక్కండుకదా! మరి యిన్ని భేదము లెట్లువచ్చె? అని ప్రశ్నింప భగవత్స్వరూపము 'పరము' 'వ్యూహము', 'విభవము', అంతర్యామిత్త్వము', అర్చారూపము', అను నైదు రూపములుగా యున్నది.

1. పరమనగా పరస్వరూపము త్రిపాద్విభూతియందు నిత్యసూరిపరివేష్టితుండై, శ్రీ, భూ, నీళాది దివ్యమహిషీ సమేతుండై శేషాహిపర్యంకమున శయనించియుండురూపము. దానినే మోక్షలోకమనియు, పరమపదమనియు, పరమాకాశంబనియు, పర్యాయ పదమ్ములు, లీలా విభూతియందు, సర్వేశ్వరారాధన చేసి కర్మబంధమ్ములు త్రెంచుకొని, జీవులు పొందునట్టి దివ్యలోకమిదియే

2. వ్యూహము. వాసుదేవ, ప్రద్యుమ్న, అనిరుద్ధ. సంకర్షణ అను నాల్గు రూపములుగా నున్నది. వాసుదేవ వ్యూహము, బ్రహ్మాండ కటాహంబున కావల మూలప్రకృతికిపైన, విరజానదిని దాటిన పిమ్మట నున్నది. కృష్ణావతార కాలమ్మున, వైదికుని చనిపోయిన పిల్లలను తీసికొనివచ్చి యిచ్చిన దాలోకము నుండియే యని చెప్పుదురు. ప్రద్యుమ్న వ్యూహము, బ్రహ్మలోకమునుండి, బ్రహ్మచే నారాధింపబడుచు, మార్కండేయాది మహర్షి పుంగవులచే పూజింపబడు చున్నది. అనిరుద్ధ వ్యూహము, క్షీరసాగరమునందుండి సమస్తదేవతా సేవ్యంబై ధర్మాధర్మంబులకు గ్లాని వృద్ధులు కలిగినప్పుడు, తన సంకల్పమాత్రముచేతనే భూలోకమ్మున కజహత్స్వభావముతో వచ్చి, రామకృష్ణాది రూపములతోనుండి, దుష్టశిక్షణ, శిష్టరక్షణముచేసి, లోకములను రక్షించు చుండునది. సంకర్షణ వ్యూహము పాతాళమునందుండి, ప్రళయకాలమునందు సర్వలోకములు లయము చేయుచుండును.

3. విభవములనగా అవతారములు. రామకృష్ణ, నారసింహాద్యవతారము లట్టివే. ఈ అవతారములలో పూర్ణావతారములు, అంశావతారములు, ఆవేశావతారములు, శక్త్యావేశావతారములు, నను నాల్గు విధములు గలవు రామకృష్ణ నారసింహావతారములు పూర్ణావతారములు. లక్ష్మణ బలదేవాద్యవతారము లంశావతారములు. కపిలాదులావేశావతారములు. పరశురామాదులు శక్త్యావేశావతారములు

4. అంతర్యామిత్త్వమనగా సర్వజీవుల హృదయకోశములందుండి స్మృతి జ్ఞానాదులు కలిగించుచు, భౌతిక శరీరభారమును, పూని యుండునది.

5. అర్చావతారమనగా సమస్త దేవాలయములందు, శ్రీరంగ వేంకటాచల అహోబిలాది దివ్యక్షేత్రములయందుండి సమస్తచేతనుల కభీష్టములొసంగుచు, మాంసనేత్రములకు గోచరించుచు, ఆనందము నొసంగుచు, భక్తుల యిచ్ఛానుసారము నడచుచు, వేంచేసి యుండునది. ఈ అర్చారూపమును సేవించుట సర్వులకును లభము. సర్వేశ్వరుని, రూపమును తన యిష్టానుసారము, చిత్తరువునందు వ్రాసి, దానిని సేవింపనగును. ఒక విగ్రహమును చెక్కి, దాని చేతియందు ధనస్సు నుంచిన నా విగ్రహము రామరూపమగును. హస్తమునందు వేణువు నుంచిన నదియే శ్రీకృష్ణుండగును. చక్రమునుంచిన విష్ణుండగును. కొలది మార్పులు చేసిన నదియే శంకర విగ్రహమును. ఇంక కొంచెము మార్చినచో నదియే కుమారస్వామియగును. నిజమునకు సర్వేశ్వరు నెవరైన సందర్శించిరా? ఎవరి యిచ్ఛానుసారము వారు ఆరాధింపవచ్చును.

---

"యో యో యాం యాం తనుం భక్తః
శ్రద్ధయార్చితు మిచ్ఛతి
తస్య తస్యా చలాం శ్రద్ధాం
తామేవదిదధామ్యహమ్.

ఎవ్వ డెవ్వ దేయే రూపము నర్చించుచున్నాడో, ఆయా రూపములందు, వాని వానికి భక్తి కలుగునట్లు నేనే సంకల్పించుచున్నాను అని గీతాచార్యులు సెల విచ్చుచున్నారు. సర్వేశ్వరుడు మనుజులను సృజింపడు. మనుజులు సర్వేశ్వరుని సృష్టించుచున్నారు. అనగా, ఈశ్వరుడు జీవులకు వారి వారి కర్మానుసారమగు దేహములిచ్చుచున్నాడేగాని స్వేచ్ఛగా తాను కోరిన రూపమొసగుటలేదు.

"తస్య కర్తారమపి మాం విద్ధ్యకర్తార మవ్యయం".

సమస్త జగత్తునకును నన్ను కర్తనుగా తెలిసికొమ్ము. అకర్తనుగా కూడ నెరుంగుము అని గీతయందు భగవానుడు వచించెను. అందుచే ఈశ్వరుడు తన వాంఛానుగుణముగా జీవులను సృజించుటలేదు. జీవులు మాత్రము తమ భావాను సారముగా సర్వేశ్వరుని సృష్టించుచున్నారు.

"రామాత్పరంతత్వమహంనజానే
మమసర్వకర్మసుకృతం రామం భజే శ్యామలమ్"

అని ఆదిశంకరులును, రామావతారమునకు మించిన యవతారము లేదని ఆంజనేయస్వామియు

"విహాయ కోదండ మిముం ముహూర్తం
గృహాణ పాణౌ మణి చారువేణుమ్"

భయంకరమగు నీ కోదండమును వీడి, సుందరమగు వేణువును ధరింపు మని లీలాశుకుండును,

"కృష్ణాత్పరంతత్వ మహంనజానే"

శ్రీకృష్ణుని కంటె పరదైవము మరొకటిలేదని నా యభిప్రాయమని మధు సూదన సరస్వతియు,

'కింకాలకూటః కిమువాయశోదా స్తన్యంతోవ స్వాదువద ప్రభోమే' కాం కూట విషమును ప్రీతిలో నారగింతువా లేక యశోదాదేవి తనుబాలను ప్రేమతో స్వీకరింతువా; ఓ ప్రభూ నాకు చెప్పుమని శివకేశవాభేదముగా తిక్కన సోమయాజియు,

"నవస్తు భేదప్రతిపత్తి రస్తిమే
తథాపి భక్తి స్తరుణేందు శేఖరే"

శివకేశవులయందు భేదప్రతిపత్తి నాకేమియు లేదు. రెండును ఒక్కటియే యయ్యెను. నా భక్తి మాత్రమే చంద్రకళాజూటునియందున్నదని భర్తృహరియు, ననేకు లనేక విధంబులుగా సర్వేశ్వరు నర్చించి తరించిరి. ఎవరే విధంబుగా నర్చించినను, గమ్యమొక్కటియేయని సర్వుల యభిప్రాయము.

సర్వేశ్వర పూజా విధానమున భిన్నరూపములను శాస్త్రము నిర్దేశించుచున్నయది. కర్మయోగ, భక్తియోగ, జ్ఞానయోగ, ప్రపత్తియోగములనునవి భిన్నములను కొన్నను, నిజమునకు వీనియన్నింటియు నొకే స్వరూపము. కర్మమనగా సర్వేశ్వరునకు దీపారాధనమాచరించి, పుష్పములచే పూజించి, మంత్రాదులచే నర్చించి, నైవేద్యాదులిడుట. జ్ఞానమనగా సర్వేశ్వర తత్త్వము నెరుంగుట. భక్తి యనగా భగవంతునియందు ప్రేమ కలిగియుండుట. ప్రపత్తియనగా తన సంబంధమ్ములగు సర్వభారమ్ములను ఈశ్వరుని యందు నిక్షేపించుట. సూక్ష్మదృష్టితో విచారించినచో నివియన్నియు నొకేస్వరూపము. ఎట్లన జ్ఞానహీనుడు భగవదారాధన యొనరింపడు. నేను జీవుండను. కర్మవశ్యుండను అస్వతంత్రుడను మాయచే కప్పబడియున్నాను. నేనాచరించిన కర్మముచే భవరూప సంబంధము సంభవించినది. ఇవి అన్నియు నశించి సుఖపడవలెనన్న స్వతంత్రుడును, కర్మరహితుడను. భవబంధచ్ఛేదియు నగు సర్వేశ్వరు నారాధింపవలె. అప్పుడుకాని సుఖము లభింపదు. అని తలంచిననే దాని ఈశ్వరారాధనము గావింపలేడు. ఇదియే జ్ఞానము. జ్ఞానము సంభవించినంత మాత్రమున ప్రయోజనములేదు. భగవదారాధన జేయవలెను. ఆరాధనయనగా, సర్వేశ్వరుని పూజించుట, దేవాలయము చుట్టును ప్రక్రమించుట, నమస్కరించుట. ఆలయము చుట్టును కసవునూడ్చుట, నీరుచల్లి రంగవల్లికలు తీర్చిదిద్దుట, భగవన్నామ సంకీర్తన మాలపించుచూ, భజన చేయుట, జపము ననుష్ఠించుట, ధనము సమర్పించుట, దేవాలయాదులు నిర్మించుట మొదలగునవి. ఇవియన్నియు కర్మము క్రిందకు వచ్చును.

ఇది చేసినగాని జీవుడు తరింపడు. ఇదియు నూరకచేయుటచే ప్రయోజనము లేదు. భక్తిపూర్ణ హృదయుడై చేయవలె. భక్తిలేని కర్మములన్నియు నిష్ఫలములు.

"పత్రం పుష్పం ఫలంతోయం
యోమే భక్త్యాప్రయచ్ఛతి
తదహం భక్త్యుపహృత
మశ్నామి ప్రయతాత్మనః"

ఒక ఆకుగాని, పూవుగాని, పండుగాని, ఇవియులేనిచో నొక్క ఉద్ధరిణెడు నీరుగాని నాకు సమర్పింపుము. సమర్పించుటమాత్రము భక్తి యుక్తుడవై చేయుము. అట్లొనర్చిన పరిశుద్ధాత్ముని ద్రవ్యమును నేను తినుచున్నాను అని సర్వేశ్వరుండు వాక్రుచ్చెను.

భక్తిలేనిచో స్వీకరింప డాయను సందేహము వలదు. ధృతరాష్ట్రుని కడకుపోయి నపుడు శ్రీకృష్ణుడు రాజాధిరాజుల తృణీకరించి, విదురుని యన్నమును భక్షించెను. బోయితయగు శబరి యొసంగిన ఎంగిలి పండ్లను ప్రేమతో భక్షించెను. కుచేలు డొసంగిన తుషమిశ్రతండులంబులు ఆనందముతో నారగించెను. రామచంద్రస్వామి గుహుండు కొనివచ్చిన పదార్థంబుల నన్నింటిజూచి 'ఓ గుహుండా! మా తండ్రి మా కరణ్యవాసము విధించిన కారణమున నిప్పుడు నీవు కొని వచ్చిన గ్రామ్య పదార్థములను భుజింపను. కాని నీవిచ్చినవన్నియు నా కర్పణమైనట్లే యని తలంపుము' అని చెప్పెను. 'భక్త్యాత్వనన్యయాశక్య అహమేవం విధోఽర్జున' ఒక్క భక్తితో తక్క మరియొక దానిచే నన్ను చూడలేరు అని భగవానుడు వచించెను. అనగా నేకర్మమును చేసినను భక్తితో చేయవలెను.

భక్తియనగా సర్వేశ్వరుని సర్వరక్షకుడని విశ్వసించి యుండుట. ఇక ప్రపత్తియనగా, భారములన్నియు భగవానునిపై వేయుట. అనగా జ్ఞానము లేక కర్మము పట్టదు. కర్మ భక్తి విహీనమైన ఫలమునీయదు. భక్తి సంపూర్ణదశ చెందనిచో నిష్ప్రయోజనము. అందువలన నీ నాల్గును ఒకే స్వరూపమని భావింప వలయును.

అవతారము లనేకములున్నను రామకృష్ణావతారములు ముఖ్యములైనట్లు, భూలోకముననున్న నూటయేడు దివ్యదేశములందు శ్రీరంగ, వెంకటాచల, సత్య వ్రతక్షేత్ర, యాదవాచలములు శ్రేష్ఠములైనట్లు స్తోత్రము లనేకములున్నను, యామునాచార్యకృతి ప్రధానమైనరీతి, పురాణములయందు విష్ణుపురాణము భాతి, నదులయందు గంగానదివలె, ఆచార్యాళ్వారు లనేకులున్నను, వారియందు యతీంద్రులే ప్రధానులైరి.

పక్షియగు జటాయువునకు మోక్షమిచ్చుటచేతను, శబరి ఎంగిలి పండ్లను ప్రేమతో స్వీకరించుటచేతను, రాముని సౌశీల్య వాత్సల్యాదులు ప్రకటితము లాయెను. గొల్లలతోకూడి సంచరించుటవలనను అర్జునుని రథమును తోలుట చేతను శ్రీకృష్ణుని గొప్పతన మధికమయ్యెను. అట్లే ఎరుకలు, యానాదులు మొదలగు హీనజాతులవారల కెల్లరకు, మంత్రోపదేశ మొనర్చియు శిష్యులచే చేయించియు, అజ్ఞాతకులుండగు ధనుర్దాసుని నుత్తమకులజుల కన్న మిన్నగా ఆదరించుటయును, యతీంద్రుల మాహాత్మ్యము నధికతరము చేసెను. అధికుడగు వాడు, అధములతో కలసిమెలసి తిరుగుటయే సౌశీల్యము దానిచే గొప్పతనము వచ్చునేగాని తగ్గదు.

ఆచార్యాళ్వారులందఱియందును, యతీంద్రులు గొప్పవారని సర్వులు తలంచిరి. రామానుజులిట్లు శ్రీరంగమునందు శిష్యులతో వేంచేసియుండగా, నొక దినమున కూరేశుడు, రంగేశుని సన్నిధి కొంటరిగాపోయి, స్వామిని దివ్యసూక్తులచే స్తోత్రమొనర్చెను. ఆస్తోత్రమునకు రంగధాముడు సంతసించి 'కూరేశా! నీ స్తవము

నకు మెచ్చితి, వరమొకదానినొసంగెద వేడుము' అనెను. అందులకు కూరనాథుడు బ్బి 'దేవరవారలు నాకు వరమీయ దలంచుచో, నీ ప్రకృతి బంధమును బాపి, నీ దివ్యధామ వాసమును ప్రసాదింపుము' అని వేడుకొనెను. అది విని రంగనాథుడు 'కూరనాథా! వరమడుగుమంటిని గదా యని యిట్టివరము నడుగ తగునా? అదికాక వేరొకదానిని వాంఛింపుము 'అనెను. అందులకు కూరనాథుడు 'స్వామీ! మీరు నన్ను వరము కోరుకొమ్మంటిరి. కోరితిని. అదికాదు వేరు వరము నడుగుమనుచున్నారు. తమవంటి జగద్భర్తల కిట్లు వచించుట తగదు మీరు సత్య సంకల్పులు. కావున మారుమాటకుతాక, నా కోర్కె మన్నించి వరమిండు' అని వచించెను. అందులకు రంగభర్త 'కూరేశా! నిన్ను విడనాడియుండలేక యట్లు పలికితినిగాని, నీకదే యిష్టమైనచో, నీకు, నీవారి కెల్లఱకు మోక్షమొసంగెద' నని తెల్పి, తీర్థ ప్రసాదము లిప్పించి, తాను ధరించి విడిచిన దివ్యపుష్పమాలలచేతను వస్త్రములచేతను అలంకరింపజేసి పోయిరమ్మని వీడుకొలిపెను. కూరనాథుడు రంగనాథునిచే చేయింపబడిన అలంకారమును గ్రహించి, 'ధన్యోఽస్మి' అని పలికి రంగనాథుని పాదయుగ్మస్థలి సాష్టాంగపడి, నమస్కరించి, స్వగృహమును గూర్చి బయలుదేరెను. అర్చరాది మార్గమున పోవు జీవులకు చేయు బ్రహ్మాలంకారమాయనునట్లు అలంకారము భాసించుచుండెను. ఈ విషయము యతీంద్రుల చెవిసోకినది. ఆయన తన కాషాయచేలమును పైకెగురవైచి త్రిదండమును త్రిప్పుచు, ఆనందనృత్యమును చేయుచుండెను. అది చూచి శిష్యులందఱు 'స్వామీ! మీ యీ ఆనందమునకు హేతువేమి? అని అడిగిరి. అందులకాగురుశిఖామణి, శిష్యచూడామణుల వీక్షించి, 'బిడ్డలారా! ఈ వేళనేనొక దొడ్డ వార్తను వింటిని. ఏమందురా! రంగపతి కూరేశులకు మోక్షమిచ్చుచు, నీవారి కెల్లఱకు నిచ్చెదనని యాతనితో పలికిరట. నేను కూరేశుని వాడనగుటచేత నాకును మోక్షము కలదు. అదియా ఈ ఆనందమునకు మూలభూతము' అని పలికెను. ఆ మాటలకు ఛాత్రులబ్బురంపడి 'దేవా! మీరందఱకు మోక్షమిచ్చువారలు కదా, మీకు మోక్షమునకేమి కొఱత,? అని అడిగిరి. అంత యతీంద్రులు శిష్యులంజూచి 'నే నిచ్చగించిన వారికి మోక్షము వచ్చును. కాని గురునాజ్ఞ మీరిన నాకు మోక్షమునందు సందియము కలదు. కాని యిప్పుడు తీరిపోయినది గుర్వాజ్ఞ దాటుట యెట్టిదందురా, మా గురుండగు తిరుక్కోట్టియూరినంబి, నాకు చరమశ్లోకార్థము నుపదేశించి, యీ అర్థము నెవఱికి చెప్పవలదని శాసించెను అది నే నుల్లంఘించితిని. అందులకు మోక్షప్రాప్తి విషయమున సందేహము కలదుకాని, నేడది నివృత్తి యయ్యెను. అని వచించిరి. అంత వారందఱు యతీంద్రుల వాక్యములచే గురు శిష్యులకు భేదములేదని గ్రహించిరి. అంత యతిసమ్రాట్టు, శిష్య సమేతుడై, కూరేశు నివాసమునకేగెను కూరేశుడు గురువకు ప్రత్యుత్థాన మాచరించి, పాదాభివందనం బాచరించి, చేతులు జోడించి, నిలువబడి యుండెను. అపుడు రామానుజులు శిష్యుని కూర్చుండ నియోగించి, తాము సుఖాసవిష్టులై

కూరేశుంజూచి, కంటనీరిడి, కూరేశా! మమ్మందఱను వీడి ముందుగా నీవు పరమ పదమునకు పోవుట ధర్మమా? నిన్నువిడిచి యీ లీలావిభూతి యందునేనెట్లు జీవింప గలను. ఈ రంగేశుడును, రంగ వాసులును, నేనును, ఏమి పాపము లాచరించి తిమో, నీయట్టివానిని పోగొట్టుకొనుచున్నాము. పరమపద నాథుండును, నిత్యసూరు లును, త్రిపాద్విభూతియు, నీదర్శనమున కృతార్థులగుటకు ఎన్ని పుణ్యము లాచరించి రోకదా; అఖిలాండ కోటి బ్రహ్మాండ నాయకుండును. కోటి సూర్య ప్రభాభాసమా నుండును. హారకేయూర, కిరీట కుండల గ్రైవేయక పీతాంబర కటి సూత్రశింజాను మంజు మంజీర, నూపురాది వివిధ దివ్యభూషణ భూషిత దివ్యదేహుండును. శ్రీ భూ. నీళాది దివ్యమహిషీ సేవిత పాదపంకేరుహుండును, శంఖచక్రాది దివ్యాయు, హస్తుండును, నిత్యసూరి పూజితుండును, భుక్తి ముక్తి ప్రదాయ కుండును, నగు శ్రీమన్నారాయణుని కల్యాణ గుణమ్ములునిన్నా కర్షింపు చున్నయవి. నేనేమి సేయం గలవాడ నదియుంగాక, మహాపదమ్మునకేగు సాధువులకు మనోవికలమ్ములను వాక్య మ్ములు పలుకరాదు. క్షేమమున పోయిరమ్ము! అని ఆశీర్వదించి. కూరనాధుని చెవిలో మంత్రరత్నమును మూడు మారులుచ్చరించిరి. కూరేశుడు గురుని శ్రీపాదతీర్థ మును, వారి శ్రీహస్తమునుండి స్వీకరించి, గురుని శ్రీపాదమ్ములు శీర్షమ్మున ధరి యించి, యోనిత్యమచ్యుత పదాంబుజ యుగరుక్మ "మనెడ తనియనుచ్చరించి, యతీంద్రుల దివ్యాకారమును తెప్పవాల్పక దర్శించుచు కూర్చుండెను. అంత నచ్చట నున్నవారిలో కొందఱు కూరేశుంగాంచి." కూరేశా! గురువుగారికన్న మున్ను నీవేల పరమపదమ్మున కరుగుచుంటివి? అని అడిగిరి. కూరేశుడు వారలంగలయజూచి, "అయ్యా మీకు లోకమర్యాద అణుమాత్రమేనితెలియదు. కావున న్నిట్లు ప్రశ్నించి నారు. లోక మర్యాద తెలిసియున్ననిట్లడుగరు. ఏ లోకమునైనను, ముందుకుపోయిన వారు, వెనుకకు బోయెడి వారికెదురురావలె. ఇది లోకమర్యాద. మాగురుండు ముందుబోయినచో నాకెదురురావలెకదా! అదినాకు స్వరూపహాని. నేను ముందేగినచో మాగురులకెదురువత్తును. ఇది శిష్య ధర్మము. అందులకై ముందేగుచుంటి" ననెను. ఆ మాట లాలకించి యతీంద్రులు "వత్సా! త్రిపాద్విభూతియందిట్టి మర్యాద లేమిలేవు సుమీ! యనిరి. అంద ఱును సంతశించిరి. కూరేశుంజూచి, యతీంద్రులు" బిడ్డా! యిక నేను మఠమునకు పోయివచ్చెద. నీవు నిత్యవి విభూతికి పోయినపుడు, అచ్చట నున్న నిత్యసూరులను. ముక్తులనుక్షేమమడిగితిననియు శ్రీభూనీళాది, జగనాత్మ, సర్వేశ్వరు

నకును నమస్కరించతినని చెప్పుము" అని పలికి మఠమునకు బయలుదేరిరి. శిష్యులు వెనువెంట సాగిరి. కూర నాథుడు గురునితోపాటు లేచి, కొంతదూరము వారివెంట వచ్చెను. రామానుజులు కూరేశుజూచి "వత్సా! ఇక నీవు నిలువుము"! అని అతనిని నిలిపి, కంట నీరిడి, వెను దిరిగి చూచుచు, పోవుచుండిరి. కూరనాథుడు గురుండు కనబడువరకు వెనుదిరిగి చూచుచు నిలుపబడి తదుపరి యింటికిబోయెను.

కూరేశుల పరమపద యాత్రా సంరంభమును జూచి ఆండాళమ్మగారు మిక్కిలి దుఃఖించుచుండిరి. అందులకు కూరేశులామెను జూచి "దేవీ కదుఃఖమ్మునకు నీత మ్మేమి? ఆత్మసంబంధమునుగూర్చి బాధ పడుచుంటివేని. యాత్మ నిత్యము కనుక దానింగూర్చి పరితాపమందవలసిన పనిలేదు. శరీర సంబంధము గూర్చి వగచుచుంటె నంటివా అది మూర్ఖ లక్షణమేగాని, జ్ఞానలక్షణము గాదు. ఇక భాగవత సంబంధము గూర్చి పెల్లుదుర పిల్లుచునుంటినందువా. దానికి దోషము లేదు. దీనిలో దేనింగూర్చి చింతించుచుంటివి?" అని ప్రశ్నింప నామె "అయ్యా మీ౽ంటి భాగవతోత్తములకు దూరమగుచుంటినని, శోకించుచుంటినే కాని, వేరుకాదు" అనిపలికెను అపుడు కూరేశుడు, పరాశర, వ్యాసభట్టరులను పిలిచి, వారిని బుజ్జగించి నాయనలారా! నేను పోవుచున్నానని బాధనందవలదు. మీ తల్లిని బాధ పెట్టక, ఆమె ఆజ్ఞానసారముగా ప్రవర్తింపుడు. మీరక్షణకురంగనాథుడును. రంగనాయకి అమ్మవారును కలరు. మీకేమియు తరుగు రానీయరు. కాని ఒక్క విషయము మనస్సున నిడుకొని జాగరూకులై యుండుడు. అది ఏమందురా! మేము రంగనాథుని అభిమాన పుత్రులమనియు, సర్వేశ్వరుడు రక్షకలడనియు గర్వింపక ఏంబెరు మానారు పాదాంబుజంబులే రక్షకంబులని నమ్మియుండుడు." అని కుమారులనిద్దఱను కౌగిలించుకొని యోదార్చుచుండెను. వారిరువురును తండ్రినిజూచి దుఃఖించుచుండిరి. వారి బాధను గాంచి కూరేశుడు మీరును ప్రాకృతులవలె నిట్లు లోదింపచెల్లునా? ఇట్లేడ్చినచో మీరు. ఎంబెరు మానారు దివ్యపదమ్ములకు దూరులై నమ్మాళ్వార్ల సంబంధమును పోగొట్టుకొన్నవారగుదురు. అని వారల మందలించి, యొక శిష్యుని యొడిలో శిరమునుంచి, భార్యయగు నాండాళమ్మ గారి యొడిలో పాదములుంచి, చేతులు జోడించి ఎంబెరు మానారు పాదములు తలంచుచు దివ్యధామమునకు వేంచేసెను.

అంత కూరేశుని భార్యా పుత్రులు పెల్లు శోకించుచుండగా రామానుజులకు తెలసి, వెంటనే శిష్యులతోకూడ వచ్చి, పరాశర భట్టరు. వ్యాసభట్టరును వోదార్చి

ఆండాళమ్మ గారిని విచారింప వలదని ఆదరించి, కుమారులచే కూరనాధులకు బ్రహ్మ మేధమును జేయించి, యుక్తాక్రియలన్నియును జరిపించి, పదమూడవ దినమున పిల్లలను వెంట బెట్టుకొని రంగధాముని సన్నిధికి తీసికొనిపోయి, తీర్థప్రసాదముల నిప్పించిరి. అపుడు రంగనాయకి అమ్మవారును. రంగనాధుడును అర్చకముఖమున నా పిల్లలతో "మీ తండ్రి బోయినాడని చింతింపవలదు. మీకేమియు కొఱతలురావు. మీ రక్షణ భారమును వహించ సదామేమున్నాము కదా!" అని తిరుత్తుళాయి మొద లగు కానుకల నిప్పించి పంపెంచెను. అంతపరాశరభట్టురును వ్యాస భట్టరును తల్లిని సేవించుచు తమతమ భార్యలతో గూడి, తండ్రి వియోగజ ధుఃఖమును వీడి, రంగ ధాముని, అమ్మవారిని అర్చించుచు. ఆనంద యుక్తులై శ్రీరంగమున నివశించి యుండిరి.

ఒకానొక దినమున యతిచంద్రు డొక శిల్పిని పిలిచి నా స్వరూపముగా నొక శిలను మలచి తెమ్మని యాజ్ఞాపించెను. ఆ శిల్పి తన సామర్థ్యము నంతయు నుపయో గించి సాక్షాద్యతీంద్రుల దివ్యరూపముగా నొక శిలను చెక్కితెచ్చెను. లక్ష్మణసూరి యా విగ్రహమును వీక్షించి శిల్పిని బహూమానించి, ఆ విగ్రహమును కౌగలించుకొని తన దివ్యశక్తితో కొంతభాగ మా విగ్రహమునందు ప్రవేశపెట్టిరి. ఆ విగ్రహమును తన జన్మస్థలమగు శ్రీ పెరుంబూదూరిలో ప్రతిష్ఠించి రమ్మని కొంతమంది శిష్యులను పంపెను. వారా విగ్రహమును దివ్యయానమునందిడుకొని, తీసికొనిపోయి, శ్రీ పెరుంబుదూరియందు ఆదికేశవ సన్నిధిన ప్రతిష్ఠించిరి. ఆ ప్రతిష్ఠా సమయమునందు విగ్రహమునకు జలాధివాసము చేయించుచుండ ఇక్కడ శ్రీరంగమునందు యతీం ద్రులు ఆయాసపడుచుండిరి. "ఇదియేమి స్వామీ! మీరెందుల కిట్లాయాసపడుచున్నారు" అని శిష్యులడుగగా "శ్రీ పెరుంబుదూరిలో నా యర్చా విగ్రహమునకు జలాధివాస మిప్పుడు జరుగుచున్నది, నాయీ ఆయాసమున కదియే కారణము" అని రామాను జులు వచించిరి. కాని కొంతమంది ఆ మాటలను విశ్వసింపకుండిరి.

అంతా రెండుమూడు వాసరములకు ఒక శుభలగ్నమునందు శ్రీ పెరుంబుదూ రిలో విగ్రహమును ప్రతిష్ఠించి, నేత్రోన్మీలనము చేయుచుండిరి. అట్టి సమయంబున శ్రీరంగమున మఠమునందు లక్ష్మణసూరి శిష్యులకు భగవద్విషయము చెప్పుచు, హఠాత్తుగా నేత్రములను మూసికొని బాధనందుచుండిరి. శిష్యులదిగాంచి, "ఏమి స్వామీ! భగవద్విషయము నుపన్యసించుచు, అట్లు నేత్రములను మూసికొని బా

నందుచున్నారేల ?" యని యడుగగా "ఇప్పుడు శ్రీ పెరుంబుదూరిలో నా అర్చాభావ విగ్రహమునకు నేత్రోన్మీలనము జరుగుచున్నది. అందువలన నేత్రములకు బాధ కలుగుచున్నది" యని నుడివిరి. వెంటనే నేత్రములను తెరచిరి. నేత్రములనుండి రక్తబిందువులు చిందిపడెను. అదిచూచి అందరును ఆశ్చర్యచకితులైరి. తరువాత శ్రీ పెరుంబుదూరిలో ప్రతిష్ఠ కావించుకొని, శిష్యులు శ్రీరంగమునకు మరలివచ్చిరి. ఆ వచ్చిన వారింగాంచి ఇచ్చట నున్న రామానుజ శిష్యులు యతీంద్రుల విగ్రహమునకు ఏ సమయమున జలాధివాసము జరిగినదియు, నేత్రోన్మీలన మెప్పుడు చేసినదియు అడిగిరి వారి చెప్పిన సమయములును, ఇచ్చట యతీంద్రులు బాధనందిన సమయమును సరిపోల్చిచూచి, ఒక కాలమగుట నిర్ణయించి ఆశ్చర్యపూరితులైరి. శ్రీ పెరుంబుదూరిలో ప్రతిష్ఠించిన విగ్రహమునకును, యతీంద్రులకును భేదము లేదని తలంచిరి.

హిందూదేశమున విష్ణ్వాలయము లన్నింటియందునురామానుజార్చా విగ్రహములు కలవు. అన్నింటియందు ముఖ్యమైనవి నాలుగు. అవ్వియేవి అనగా వేంకటాచల శ్రీరంగయాదవాచల శ్రీ పెరుంబుదూరు దేవాలయములందున్న విగ్రహములు వీనిలో శ్రీ పెరుంబుదూరునందున్నది. మిక్కిలి శ్రేష్ఠమని ప్రాజ్ఞులు వచింతురు. శ్రీ పెరుంబుదూరునకే భూతపురియను నది పర్యాయపదమని తొలుతనే వచించి యుంటిమికదా ? రామానుజుల కది జన్మస్థలమగుటచే, ఆయన జన్మించినపుడును, అవతార పరిసమాప్తియందునను పెరుంబుదూరు నగల భూతము లన్నింటికి మోక్షము నొసంగిరి. కావున నిదియే యన్నింటికన్న ప్రధానమైనదని పెద్దలందరు చెప్పుచు అట్లే అర్పించుచున్నారు.

యతీంద్రులు శ్రీరంగ మఠమున వేంచేసియుండగా నొకనాడు శిష్యులు "గురుచంద్రమా ! వైష్ణవుండనువా డెట్లుండవలయును ? అతడు పాటింపవలసిన నియమనిష్ఠ లెవ్వి ? యని యడిగిరి. అపుడు లక్ష్మణసూరి "నాయనలారా ! వినుండు ! భాగవతుడు దంభాహంకారముల నిశ్శేషముగా వదలవలయును. ఆకారత్రయమును తెలిసి, కొని, నిరంతరము వర్తింపవలయును. ఆకారత్రయ మనగా ననన్యార్హ శేషత్వము. అనన్య శరణత్వము, అనన్య భోగత్వము అనునవి. నేనితరులకు దాసుడను కాను. భగవంతునకే శేషుండను అనియు, సర్వేశ్వరుండు తక్క మరియొక రక్షకుడు లేడనియు, నేను శ్రియఃపతి కొక్కనికి తక్క మరియొక్కనికి భోగ్యవస్తువుని కానని నిత్యమును విశ్వసించి యుండవలెను. వైష్ణవు డర్థపంచక జ్ఞానమును కలిగి యుండ

వలయును. అర్థపంచకమనగా, స్వస్వరూపము పరస్వరూపము, విరోధి స్వరూపము, ఉపాయ స్వరూపము ఉపేయస్వరూము అనునవి. అందు స్వస్వరూపము మువ్విధములు నిత్యులు, ముక్తులు భక్తులు అనునవి.

నిత్యులు :- సంసార గంధలేశ మెప్పుడునులేక, నిత్యవిభూతియందు సర్వేశ్వరునితో సమానసుగానుండు శేష, శేషాశన గరుడాదు లందరు నిత్యులనబడుదురు.

ముక్తులు :- లీలావిభూతియందు జనించి, భగవదనుగ్రహము పొంది సర్వేశ్వర భజన మొనర్చి, పాంచభౌతిక శరీరమును విడిచి, పంచోపనిషణ్మయ స్వరూపమును ధరించి, నిత్యవిభూతికిపోయి అందు స్థిరపడువారు ముక్తులనబడుదురు.

సిద్ధులు :- సర్వేశ్వ రారాధన మొనర్పక, ఎల్లప్పుడును ఈ సంసార బంధమును వీడలేక, ఈ లీలావిభూతియందే నివశించువారు బద్ధులు.

ఇక పరస్వరూపమును గూర్చి వివరించెద. పరస్వరూప మనగా సర్వేశ్వర రూపము. ఇయ్యది పర, వ్యూహ, విభవ, అంతర్యామిత్వ, అర్చరూప భేదమ్ముల నెనసియుండును. దీని వివరణము ముందే చేయబడినది.

యతీంద్రు లీరీతి శ్రీరంగమునందు, విష్ణు దర్శనము స్థాపించుచు, అనేకుల బద్ధ చేతనుల నుద్ధరించుచు, రంగనాధునకు కైంకర్యముల యధాకాలముల చేయించుచు, మఠమునందు నివసించియుండ. వారికి నూట యిరువది వత్సరమ్ములు గడిచెను. ఒకనాడు యంతీంద్రులు రంగనాథముని సన్నిధికేగి నమస్కరించి "ఓ దయామయా ! నాకీ ప్రకృతి బంధములు బాపి, నిత్యవిభూతి నొసంగుము." అని అర్థించెను. ఆ వాక్యములకు రంగనాధుడు బాధనందుచు "యతీంద్రా! నిత్యవి తికి పోవుతలంపు నీకేల కల్గినది. ఇంకను కొంతకాలము నీవీ శ్రీరంగముననే యుండి చేతనులనుద్ధరింపుచు, నాకు కైంకర్యములు జరిపించుచు నాకానందము నొసంగుచుండును, నీవు నిత్యవిభూతికి పోవలయునని యెన్నడు వాంఛించిన ఆనాడే పోవచ్చును గదా ! ఇపుడింత తొందర యేల ? అని పలికెను. ఆ వాక్యము లాలకి యతీంద్రులు "దేవాదిదేవా ! జగదీశ్వరా ! నీ యిచ్ఛానుసారము ప్రవర్తించుటయె నా కర్తవ్యము. జనించి నూరు వత్సరములు జీవించుటయే మర్యాద. నేను దాని

నతిక్రమించి పై నిరువది వత్సరములుంటిని. ఎంతకాలమున్న నేమి కొఱంత యందువా, దేవరవార యనుగ్రహమున నాకు కొఱంతలేదు. కానీ నేనీ భూలోకము నకు వచ్చిన తదుపరి ఇచ్చటనుండి అనేక జీవులు ముక్తులై పరమపదము నలంక రించిరి. వారి సందడిచే నిత్యవిభూతి ఎంత కోలాహలముగా నున్నదో చూడవలయు నను కుతూహలము నాలో వెల్లుబుకుచున్నది" అని విన్నవించిరి. ఆ మాటలకు సర్వేశ్వరుడు "అట్లయినచో సుఖముగా పోయిరమ్మ. నీవీ భూలోకమునకు వచ్చిన నాటనుండి మాకొఱకెన్నో బాముల కగ్గమైతివి. అనేక జీవుల నుద్ధరించితివి. కాన నేను నీకు ఋణపడి యున్నాను. దానికై యేదేని వరమ్ము కోరుకొమ్మ ప్రసాదిం చెద"నని ప్రసన్నవదనుడై సెలవిచ్చెను.

ఆ వాక్యములు విని యతీంద్రులు "ఓరంగేశ్వరా ! ఇప్పుడు మీరు వచించిన మాట యీ దాసునకు చాలదా ? దీని కన్న నెక్కుడు వరమున్నదా ? మీదయ నిరం తరము మాపై ప్రసరించిన చాలును. అఖిలాండ కోటి బ్రహ్మాండ నాయకుండవు, శ్రియః పతివి, దేవాదిదేవుడవు, అట్టి మీరు నాకు ఋణపడియున్నాడ నంటిరి. అంత కన్న నాకు కావలసినదేమి ? కాని మీరు వరమిత్తుననగా నేను కోరకుండుట అహం భావమనబడును. సిరి రా మోకాలొడ్డి నట్లుండును. అందువలన కోరుకొనుచున్నాను. సమస్త భువనములయొక్క సృష్టి స్థితి, లయములే క్రీడలుగా గలవాడును, నతము లగు సర్వభూతముల రక్షణయందు బద్ధకంకణుండును, వేదాంత వీధుల దీపించు వాడును, పరబ్రహ్మయునగు నీయందు నా మనస్సు భక్తిరూపమున సదా స్థిరపడి యుండునుగాక. ఈ మధ్యలోకవాసులు భవబంధ బంధితులు. కాన నిన్నెప్పుడు ఆరా ధింపజాలరు. వారియందఱికొఱకు నేనే నిన్నుగూర్చి ప్రపత్తి చేయుచుందును. నా మతస్థులగువారి కందఱకు మోక్షమిమ్మ" అని కోరిరి, అందులకు సర్వేశ్వరుడు నవ్వి "వత్సా, అట్లే నీవారికందఱకు ముక్తి యొసంగెదనని పలికిరి.

యతీంద్రులు సర్వేశ్వరు నాజ్ఞ గైకొని, మఠమున కేతెంచి, శిష్యులనందఱను పిలిపించి, అహోరాత్రములు భగవద్విషయమును బోధించుచుండిరి. శిష్యుల కేదో అనుమానము తట్టి యతీంద్రులకు నమస్కరించి, "స్వామి ! యిన్ని సంవత్సరము లలో నిదివఱకెన్నడును, ఇంత తీవ్రముగా భగవద్విషయము నుపదేశింపలేదు. ఇప్పుడు మీకు నిద్రలేదు. మమ్ము. నిద్రవోనిచ్చుటలేదు. రేయింబవళ్ళకు తారతమ్యము లేకున్న యది. ఇందులకు కారణము మా బుద్ధి కనూహ్యముగా యున్నది. ఆ విషయము విన

తగియున్నచో సెలవిండు" అనిరి. ఆ మాటలు విని యతీంద్రులు "వత్సలారా! నేనిట్లు భగవద్విషయమును ఎడతెరిపి లేకుండ బోధించుటకు కారణమున్నది. అది మీరు ఎనతగనిదికాదు. అది యేదందురా యిక రెండు దినముల కవ్వల మధ్యాహ్న సమయమున మేము పరమపదమున కేగుటకు భగవదాజ్ఞ యైనది. నేను పోయిన తదుపరి మీకీ విషయములు బోధించువారుండరు. కనుక చెప్పుచున్నాను" అని వచించిరి.

ఆవార్త వినుటతోడనే శిష్యుల తలలపై పిడుగులు పడినట్లాయెను, హృదయ స్పందనము స్తంభించెను. కన్నులు కానరాకుండ పోయినవి. చెవులు విన్పింప వాయెను. అతిచంచలమగు మనస్సు ఇంక మిక్కిలి చలించెను. శరీరములు బిగుసు కొనిపోయెను, అట్లు కొంతసేపుండి, ఎట్లో తేరుకొన్నవారై, అందరునులేచి, పైవేసు కొనిన యుత్తరీయములను కటిప్రదేశములందు బిగించుచుండిరి. అది జూచి లక్ష్మణ సూరి "శిష్యులారా! ఏల ఏకకాలమున మీరెల్లరు పై వస్త్రముల కటిస్థలమున బిగించుచున్నారు?" అని అడిగిరి, అందులకా భాగవతోత్తములు గురువును గాంచి గురూత్తమా! మీరు పరమపదమునకు పోయిన తదుపరి మే మీ మానవ లోకమున నివశించజాలము. మిమ్ము జూడక ఒక్క నిమేషమైన జీవింపగలమా? మాకు కాలము గడచునా? మీరిట నుండగనే మీ దివ్య స్వరూపమును దర్శించుచు పవిత్ర కావేరీ తరంగమ్ములకు ప్రాణమ్ములు సమర్పింతుము. అంతియకాదు మీరులేని శ్రీరంగము మాకు శూన్యప్రాయము" అని శిష్యు లాయన పాదములపైబడి బోరన నేల్గునెత్తి యేడ్చిరి.

ఆ వాక్యము లాలకించి యతీంద్రులు "వత్సలారా! మీరు కడుంగడు సులభముగా మోక్షప్రాప్తి నందగల యుపాయమును చెప్పెద శ్రద్ధతో వినుండు. నేను రచించిన బ్రహ్మసూత్ర భాష్యమును గురుసేవచే చదివి శిష్యులకు చెప్పుచుండుడు. అట్లే కాలము గడిపితిరా మీకు మోక్షమునకు సందియము లేదు" అని పలికిరి. ఆ మాటలకు శిష్యులు దయానిధీ! మీరు చెప్పినది మాకు సాధ్యముకాదు. ఏలఅందురా, శ్రీభాష్యమును పఠింపవలయునన్న తర్క వ్యాకరణములు రెండును కరతలామలకములై యుండవలె. అవ్వి చదువవలయునన్న మాకు కొన్ని సంవత్సరముల కాలము పట్టును. ఆ విద్యలు భగవదనుగ్రహమున్ననే వచ్చును. ఆ శాస్త్రములు బోధింపగల యుపాధ్యాయులు లభింపవలె. మాకు చదువుటకు తీరిక దొరకవలె. ఇవన్నియు కుదిరినచోగాని శ్రీభాష్యమును చదువజాలము. అది చదివిన తరువాత మాయొద్ద నేర్చు

కొనువాడు సిద్ధింపవలె. వాడును శాస్త్రములు పఠించినవాడై యుండవలె. అట్టివాడు దొరికినచోగదా మేము తరించుట. ఇదెట్లు మాకు సాధ్యమగును ?" అనిరి. యత్రీంద్రులు వారింజూచి "పోనిండు అది మీకు సాధ్యము" కానిచో మరియొకటి బోధించెద. దానిని చేయుడు అది యేదందురా శఠారాతి భగవానులు చెప్పిన తిరువాయిమొళిని సర్వదా అధ్యయనించుచు కాలమును గడుపుడు అనిరి. శిష్యులు మరల గురునితో నిట్లనిరి. అదియు మాకు సాధ్యముకాదు. ఏలయందురా, సహస్రగీతిని చదువవలయునన్న తొలుత గురుసన్నిధిని చదువవలయు. దాని యర్థము తెలిసికొనవలయును దాని భావము నెరుంగుట చతుర్ముఖునకే సాధ్యముకాదు అట్టిదానిని మేమెట్లు చదువగలము ?" అందులకు గురుచంద్రులు మందహాస మొనర్చి "మంత్రరత్నార్థమదుద్వయమును పెదవులు తడి యారకుండున ట్లుచ్చరించుచు కాలము వెళ్ళదీయుడు," అని పలుక శిష్యులు గురునిజూచి "దేవా! మంచి యుపదేశం బొనరించిరి. చాల సుళువని మీరు తలంచియుందురు కాబోలు. ద్వయమును దినమునకు నూరు పర్యాయము లుచ్చరించుటకే ఈ సంసారము తీరిక నొసంగుటలేదు. అట్టి మాకు సదాద్వయమును సంధించుటకు అవకాశ మెట్లు కలుగును ?" అని ప్రశ్నించిరి. మరల గురువు వాత్సల్యముతో వారలంజూచి "అట్లయినచో మీ కనుకూలమగు వేంకటాచల, అహోబిల, శ్రీరంగ, సత్యవ్రతాది దివ్యక్షేత్రములలోనే దివ్యక్షేత్రమునకుపోయి అచ్చట యెల్లప్పుడు దేవాలయమున కసవు నూడ్చుటయో, కలయంపి చల్లుటయో ప్రాగ్దీపికారోపమో, పుష్పములు సమర్పించుటయో యేదో యొక కైంకర్యమును, శరీర పతనావీధి చేయుచుండుడు" అని చెప్పిరి.

ఆ మాటలువిని శిష్యులు "ఆర్యా! ఇదివరకు మీరుపదేశించిన యుపాయములు ఎక్కడనో యొకచోటనుండి ఎవరికివారు చేసికొనదగినవి. ఇప్పుడు మీరుచెప్పినది అత్యధిక కష్టసాధ్యము మేము మా గృహములు, గ్రామములు విడిచిపోవలయునన్న సుకరమగు కార్యమందురా ? ఒకవేళ సాధక బాధకములు భరించిపోతిమిపో, ఆ దివ్యదేశములందు మాకు నివాస గృహములు లభించునా ? అచ్చట గృహములను కట్టుకొనుటయన్న సామాన్య విషయమా ? ఒకవేళ నిర్మించుకొంటిమి పొందు, మాకును, మా కుటుంబములకును భుక్తి ఎచ్చటనుండి వచ్చును ? కుటుంబమును వీడి యొంటరిగా పొమ్మందురు, వారు మమ్ము విడచినగదా, మేము పోవుటకు వీలగునది, ఇది మరియు దుస్సాధ్యము అని విన్నవించిరి.

"అట్లగుచో మీరు నిరంతరము భాగవతసేవచేయుచు కాలమును గడుపుడు." అనియతంంద్రులు మరలవచించిరి. అపుడు శిష్యులు "గురువర్యా! ఇదియు మేము ననుష్ఠింప దగినదికాదు. ఎట్లంచురా భాగవత సేవ చేయవలయునన్న, అసలు భాగవ తుండనవెవ్వండు? అతడెట్లుండును. వారి లక్షణములెవ్వి? యను విషయములు తెలి యవలె. మనతో సమానులగు వారీ అఖండ భూమండలమున నొక్కండునుండడు అను దురహంకార పూరితులమై యున్నమాకు భాగవతుల లక్షణము లెట్లు తెలి యును. తెలిసినను, అట్టి భాగవతోత్తములెట నుండి వత్తురు? వాసుదేవస్సర్వమితి సమహాత్మాసుదుర్లభః" అనికదా భగవద్వాక్యము. ఒకవేళ భాగవతులు వచ్చినను. మాచే సేవచేయించుకొనుచు, మాయొద్ద నుండి వలసిన కర్మను వారికేమి పట్టును? ఇదియు మాకు సాధ్యముకాదు. కావున నోదయాళూ మాకింకను సుళువగు మార్గము నుపదేశింపుడు" అనిపలికిరి. అపుడు యతీంద్రులు ఆ వాక్యములు విని, శిష్యుల జూచి "బిడ్డలారా! అట్లయిన మీకొక పరమ రహస్యంబు చెప్పెద. ఆసక్తితో వినుడు మీకు తోచిన వఱకు భగవద్విషయము లాచరించుచు మీయిచ్ఛ వచ్చినచోట నివశించుచు కలిగినది భుజించుచు, కాలమును గడిపి, అంత్యమున మోక్షేచ్ఛ కలిగినపుడు యాద వాద్రికి పోయి సంపత్కుమారునకు నమస్కరించి, అచట ప్రాణములను విడువుడు. దీనికన్న సుళువగుమార్గ మింకొకటి లేదు." పొండుఅని వచించిరి. అది విని శిష్యు లందఱు జయజయధ్వానము లాచరించి" స్వామీ! మీరు చెప్పినది మాత్రము చాల తేలికగా యున్నది. మాకు తగినది చెప్పితిరి. అట్లే చేయుదుము" అనివినయముతో విన్నవించుకొనిరి.

ఈ విధముగ శిష్యుల నందఱనోదార్చిన వాడై యతీంద్రులు. పరాశర భట్ట రును పిలిపించి, శిష్యానేక పరివృతుడై, రంగనాధాస్థానమునకు కొంపోయి యిక ముందు మేము పరమపదించిన తదుపరి ఈ పరాశర భట్టరే దర్శన పరిపాలకుడని వారందఱకు తెలిపి రంగేశ్వరు సన్నిధి తీర్థ ప్రసాదములు పరాశర భట్టరునకు తన కన్న ముందిప్పించి. తరువాత తాను గ్రహించి, ఆతనిని వైష్ణవ దర్శన పరిపాలకు నిగా అభిషేకించెను. రంగేశ్వర, శ్రీదేవ్యాదిలోకమాతలకును నమస్కరించి, పరాశర భట్టరు చేయిపట్టుకొని, మరలి మఠమునకే తెంచి, యందు ప్రవేశించి భట్టరునిజూచి, "వత్సా! ఈ విష్ణుదర్శనమును నావెనుక నీవు వృద్ధరించుచుండుము. తరువాత ఈస్థా

నము నధిష్ఠించుటకు తగినవాడు లేడు కావున మేలునాడు నకేగి, యచ్చట మహా విద్వాంసుడు. వేదాంతియును పేరుగల బ్రాహ్మణుండొక్కరుండు గలడు. ఆతనిని నీవిద్యచే జయించి శ్రీరంగమునకు తీసికొనివచ్చి నీ తదుపరి దర్శన పరిపాలకునిగా నభిషేకించి నీవు నిత్య విభూతికి రమ్మ. నీ తదుపరి యీ స్థానమునకు వేదాంతియే సమర్థుడు" అనినచించి, ఆతని నొప్పించిరి.

రామానుజులు నిత్యవిభూతికినేగు తలంపుగలవారై, శిష్యుల నందఱ పిలిచి, వారికి తన శ్రీపాద తీర్థము నొసంగి, భాగవతులనందఱిని భోజనము చేయవలసినదిగా ఆజ్ఞాపించి, వారు భుజించిన పిదప, మనందఱ చేర బిలిచి "నావియోగభీతిచే మీకు దిక్కులు తెలియుటలేదు. ఈ యెడబాటును సైరింపలేక ప్రాణత్యాగమును మాత్రము చేయవలదు. ఆత్మహత్యకు పాల్పడబోమని ప్రమాణములు చేయుడు" అని వారిచే తన గురుండగు పెరియనంబి సాక్షిగా శపథములు చేయించి, ఈ దర్శనముద్ధరించుటకు, మిమ్ముకాపాడుటకు పరాశరభట్టరు సమర్థుడు. ఇంతవరకు నాపై యెంతటి భక్తియుక్తులై మెలిగితిరో అంతటి భక్తియుక్తులే భట్టరుపై కలిగియుండుడు" అని వారినందఱ నోదార్చి. ఎంబారు నొడిలో శిరము నుంచి, ఆంధ్రపూర్ణుని యంక తలమున పాదములుంచి, దక్షిణ దిశా శిరస్కులై పవ్వళిలచిరి. యతీంద్రుల పరమపద వార్తవిని తండోపతండములుగా ప్రజలు మఠమునకు వచ్చి, యతిమూర్ధన్యుని పాదములకు నమస్కరించి, దుఃఖించుచు, అవనతవదనులై నిలిచి యుండిరి. అనేక వాద్యములు మ్రోగుచుండెను. అట్టి సమయమున రంగేశ్వరుని యర్చకులు భగవన్నిర్మాల్యములగు దివ్య వస్త్రములు, పుష్పమాలికలు, తిరుత్తుళాయి మొదలగునవి తెచ్చి యతీశ్వరునకు సమర్పించి, చేతులు జోడించి, యేమి సెలవు అని నిలువబడి యుండిరి. యతీంద్రులు వారింజూచి. చేతులెత్తి నమస్కరించి "అయ్యా! రంగనాథ కైంకర్యవిషయమున నేను మిమ్మనేక విధముల నిర్బంధించితిని. దండించితిని. అవి యన్నియు సర్వేశ్వర సేవానిరతమతినై యొనరించితినిగాని, వేరుకాదు. నాదోషములు క్షమింపవలయును" అని పలికెను. ఆమాటలు విని యర్చకులు, పరిచారకులు ఘోరననేడ్చుచు. "స్వామీ! మీ దోషములు క్షమించుటకు మేమెంతటి వారము? దోషభోగ్యులు, జగద్గురులకు మీకు దోషమొకటున్నదా? మమ్మందఱ నింతవరకు తండ్రివలె రక్షించితిరి. మీరున్న కారణమున నీ శ్రీరంగము నిత్యోత్సవములు గలిగి శ్రీవైకుంఠమును బోలియున్నది. ఇంక మీ వియోగభారము నీ శ్రీరంగ మెట్లు భరింప

గలదు? రంగనాథు డెట్లు సహింపగలడు? మేమెట్లు జీవింపగలము?" అని యనేక విధములుగా వచించుచు దుఃఖభారమున నేల వ్రాలిరి. యతీంద్రులే వారి నోదార్చిరి.

ఆ సమయమున యతీశ్వరు శిష్యులలో కొందరు భృగువల్లిని, కొందరు బ్రహ్మవల్లిని, మరికొంతరు సహస్రగీతిని, యింక కొందరు భగవద్గీతను, కొందరు రామాయణమ్మును, కొందరు విష్ణుపురాణమును, చక్కగా నధ్యయనించుచుండిరి. అనేక మంగళవాద్యములు బ్రహ్మాండ భాండమ్మును ప్రక్కలించుచుండెను. ఆ సమయమున లక్ష్మణసూరి పెరియనంబిగారి పాదుకలను, హృదయమున గీలుకొలిపి యా మునమునీంద్రుల పాదారవిందములు స్మరించుచు, బ్రహ్మరంధ్రమును చేధించుకొని అవతార సమాప్తి గావించుకొని, తన దివ్యధామంబునకుజని, శేషస్వరూపమును ధరించెను. ఇక భూమియందు ధర్మము పరిపూర్ణ వినాశము నందగలదని ఆకాశమునుండి యొక దివ్యవాణి విన్పించెను. అచ్చటనున్న ప్రజలందరు నిశ్చేష్టులై, యొక్కసారి స్థంభించిపోయెను. కుడ్యములపై వ్రాయబడిన చిత్రరూపములను తల పంచుచుండిరి. శ్రీరంగమంతయు దుఃఖనిర్మగ్న మయ్యెను. ఆ సమయమున శక్తి సంపన్నులును రామానుజుల శిష్యులలో పెద్దవారునగు ఎంబారు, దాశరధి, ఆంధ్రపూర్ణుడు, కరుకానాధుడు కొంత సేపటికి తేరుకొని తమ్ముతామూరడించుకొనిరి. కురుకానాధుని పుత్రునిగా రామానుజు లభిమానించిన కతమున, యామునముల కెట్లు బ్రహ్మమేధమును జలిపించిరో అట్లే రామానుజులకును కరుకానాధునిచే బ్రహ్మమేధమును జేయించిరి. ఇంకను చేయవలసిన విధులను నిర్వహించుటలో పరాశరభట్టరునకు ఎంబారు సహాయపడెను.

ఈవిధముగా ఎంబారు కొంతకాలము జీవించి గురువియోగమును భరింపలేక పరమపదంబునకు బోయెను. పరాశరభట్టరు ఎంబారునకు చేయవలసిన అంత్యక్రియలన్నియు జరిపించి, శ్రీరంగనాధుని దర్శించి, సర్వదుఃఖదూరుడై, రామానుజ దర్శనము నభివృద్ధి పరచుచు రంగేశ్వరుని, రంగనాయకి అమ్మవార్లయొక్క దయకు పాత్రుడై సమస్త సుఖముల ననుభవించుచు శ్రీరంగమున మహావైభవోపేతుడై యుండెను.

"మంగళమ్ వేంకటేశాయ, విష్ణుపత్న్యైచ మంగళమ్
మంగళమ్ లక్ష్మణార్యస్య మంగళమ్ మమసర్వదా"

లక్ష్మణ దేశికులు శిష్యుల కుపదేశించినవానిలో కొన్ని విశేషముల నిట పొందు పరచుచున్నాను.

వైష్ణవుండగువాడు ఆచార్య విషయమున భక్తికలిగి, ఆచార్యుని దైవస్వరూపునిగా భావింపవలయును. భాగవతులేజాతివారైనను, కన్పించినచో వారిని గౌరవించి, అన్నపానాదు లొసంగి సత్కరింపవలయును. హీనజాతివాడనియు, కురూపియనియు, ధనహీనుడనియు, అంగవిహీనుడనియు నవమానింపరాదు. అట్లే భాగవతునినైన నవమానించినచో నాతడు పతితుడై నరకగామియై చెడిపోవును.

వైష్ణవులు దృష్టిగోచరులైన వెంటనే ముందు తానే నమస్కరింపవలయును. నేను ప్రపత్తి నిష్ఠుడనని గర్వించి, జప, భజనాదులు నా కనవసరములని దురహంకారపూరితమతివై చెడిపోక, శ్రవణ కీర్తన స్మరణాదులచే నిరంతరము కాలమును గడుపవలయును.

భాగవతుల నేకవచనమున పిలువరాదు.

భగవత్సన్నిధిని, భాగవత సాన్నిధ్యమునకు గురుని సమీపమునను, కాళ్ళు సాచి కూర్చుండతగదు.

తన గృహ సవిధ ప్రదేశమున భగవదాలయముగాని, ఆచార్య గృహముగాని యున్నచో నావైపునకు కాళ్ళుపెట్టి శయనింపరాదు.

భాగవతులు కొంతమందిచేరి యొకచో భగవన్నామమును చేయుచుండ నచ్చటికిపోక మానరాదు. పోయినవెంటనే లేచిపోరాదు.

వైష్ణవుండగువాడు శబ్దాది విషయములందు నిమగ్నుడై యుండరాదు. ఇంద్రియలోలుడగువాడు వెంటనే నశించును. జ్ఞానేంద్రియములు లతుల బలవత్తరములు. కావున యింద్రియ వాంఛలను క్రమముగా విడిచిపుచ్చవలయును. భగవదారాధన చేయని యే పదార్థమును భక్షింపరాదు. "తేత్వఘం భుంజతే పాపా యేపచంత్యాత్మకారణాత్" తాను తినుటకు చేసికొన్న పదార్థమును సర్వేశ్వరార్పణ చేయక యెవ్వండు భుజించుచున్నాడో, అట్టివాడు తినుచున్నది యన్నముకాదు అది పాపమే యని గీతాచార్యులు వచించియున్నారు.

కొత్తవిహీనములైన ఏఏ పదార్థములను తానుపయోగించుచున్నాడో విధినిషేధములులేక ఆయా పదార్థముల నన్నింటిని సర్వేశ్వరునకు సమర్పింపవలయును. దేవాలయ మధ్యమునందు సాష్టాంగ వందనం బాచరింపతగదు. అర్చనర్చిన నలువైపుల సర్వేశ్వర బింబములుండును గాన తాను కాళ్ళు సాచినవాడగును. చుట్టును చూచి సర్వేశ్వర బింబములుగాని, తత్పరివార బింబములుగాని లేకుండునట్లు చూచి సాష్టాంగము నెరపవలయును. గురునికి సాష్టాంగదండప్రణామము చేయవలెనే గాని సామాన్యముగా నిలబడి నమస్కరింపరాదు.

గురు వుపదేశించిన మంత్రమును పరుల కెవ్వరికీని చెప్పరాదు. వారును తన గురువుగారి శిష్యులే యైనచో నట్టివారికి చెప్పవచ్చును. అష్టాక్షర మహామంత్రమును గాని, రామషడక్షరీ మంత్రమునుగాని, లేక యే భగవన్మంత్రమునుగాని, స్నానము చేసి శుచియై, శుభ్రవసనమ్ములు ధరించి, నిర్జనమును, నిర్మలమునైన ప్రదేశమున ధర్భాసనముపై కూర్చుండి జపింపవలెను. అపరిశుద్ధుడై చేయరాదు.

ద్వయమంత్రమును మాత్రము సర్వదేశ, సర్వకాల, సర్వావస్థలయందును అనుష్టింపవచ్చును. ఆ మంత్రానుసంధానమునకెట్టి నియమములును లేవు. పరిశుద్ధుడై గాని జపింపరాదను నియమము లేదు. రాత్రివేళ మంచముమీద పరుండియు ద్వయమును పఠింపవచ్చు.

తనకున్నదానిలో తృణమైనను భగవదర్పణ చేయవలెను. అట్లని సర్వేశ్వరునకు పత్రముగాని, పుష్పముగాని నివేదించి తాను శ్రేష్ఠపదార్థములనుపయోగింపరాదు. పత్రముగాని, పుష్పమునుగాని, ఫలమునుగాని, తీర్థమునుగాని నాకు సమర్పించిన చాలునని సర్వేశ్వరుడే వచ్చించినాడుకదాయని భావింపరాదు. ఆ వాక్యము సర్వజనులకు చెప్పినది. అనగా పేదవారికినూతన ననుగ్గుణముగా చెప్పిన మాట యది ఆ వాక్యము ధనికుల కన్వయింపదు. సర్వేశ్వరుడు గొప్ప వస్తువులతో తన్ను పూజింపమని చెప్పినచో నిరుపేద భగవాను నర్చింపగలడా? ఉన్నవాడున్నట్లు వైభవారాధన చేయవలె. దీనినే ధర్మసూక్ష్మ మందురు. భగవంతున కేమియును సమర్పింపని కారణముననే కుచేలుడు దారిద్ర్యము ననుభవించినాడని పెద్దలందురు గుప్పెటటుకులు సాధారముగా తీసికొని శ్రీకృష్ణదేవుడు కుచేలునకు కుబేరత్వము నొసగెను.

శ్రీ శ్రియఃపతి యొక్కడే నిరుపాధిక బంధువు. భక్తులైనవారందరును సోదరులేయని తలంపనగును.

భగవద్విగ్రహములయందు శిలాలోహదారు భావమును, గురునియందు మానుష భావమును, ఎప్పుడును ఉంచరాదు. గురువుగారు చెప్పిన మంత్రము స్వల్పములగు పంచాంగములందు సైతమున్నది.

దీనివలన మనకేమి ప్రయోజనము అని అనుమానింపరాదు. మంత్రము లనేక గ్రంథములందు ముద్రితములై యున్నవి. వానిని చదువుకొని గురువుతో నేమి పని యని భావించి వానిని జపింపరాదు.

ఏల జపింపరాదనగా తానొనరించుచున్న విధిలో దోషమే యున్నదో లేక ఫలమే యున్నదో తనకు తెలియదు. (మూర్ఖుని తపమున్) మూర్ఖుడగువాడు చేసిన తపస్సుకూడ ముందు ముప్పు తెత్తునని కదా పెద్దలనుడి. రాజాధికారము నందినవా డితరుల కుద్యోగము లీయగలడుగాని ఎంత చదివినను, ఎంత ధనికుడైనను నట్టివాడు పరుల కుద్యోగముల నొసంగలేడుకదా! అట్లే భగవదధికారమును పొందినవారే అనగా గురుశిష్య పరంపరగా వచ్చినవారే మంత్రాధికారులు. వారికడనే మంత్రోపదేశ మును పొందవలయును.

భగవన్మందిరములు, గోపురములు కన్పించిన వెంటనే చేతులు జోడించి నమస్కరింపవలయును.

భగవదాలయములకు ప్రదక్షిణించునపుడు ఆలయముల నీడలను త్రొక్కరాదు. అట్లు పోవుటకు వీలుకానపుడు ఆలయము నీడను మూడు భాగములుచేసి పై మూడవ భాగమునుండి పోవలయును.

భగవదాలయ గోపురాదుల సమీపమున మలమూత్ర విసర్జన చేయరాదు. భగవదాలయము లందు సర్వేశ్వర సన్నిధి నొసంగు తీర్థ ప్రసాదములను మహాభక్తితో స్వీకరింపవలె. నేనీ దినము నుపవసించుచున్నాననియు, నేనిపుడ పరిశుద్ధుడ నై యున్నాననియు, ప్రాకృత జనులు వీక్షించుచున్నారనియు తలంచి, పరిహరింపరాదు. పరిహరించుట మహా పాతకమని పెద్దలు చెప్పుచున్నారు. భగవదాలయములు

ప్రాకృతములా, దివ్యదేశము లాయని విచారింపక, నిత్యార్చన గల సర్వదేవాలయాదు లయందు తీర్థప్రసాదముల స్వీకరింపవలెను.

భాగవతులగు వారేజాతి వారైనను, వానిని మిక్కిలి గౌరవింపవలయునుగాని హీనజాతి వాడని తృణీకరించుట మహాపాప కారణము.

దేవాలయములయందు ప్రసాదమును భుజించి అచ్చటనే చేతులు కడుగు కొనుట మహాదోషము, ఇంటికి వచ్చి కడుగుకొనవచ్చును. లేదా దేవాలయ ప్రాంగణము దాటిన తదుపరి కడుగుకొనవచ్చును.

దేవాలయముల నుండి వచ్చిన తదుపరి కాలుసేతులు ప్రక్షాళణ చేయరాదు, మైలపడితినని స్నానము చేయుట దుస్తులు మార్చుకొనుట మిగుల దుష్టములు.

దేవాలయములందున్నంతసేపును, దివ్యదేశముల మహిమయు, భగవన్మహిమయు, భాగవత మహిమయు నుచ్చరించుచుండవలెగాని, లోక సంబంధ విషయముల నచ్చట చర్చింపరాదు.

గురుసన్నిధికి, భగవత్సాన్నిధ్యమునకు, రిక్తహస్తములతో నెన్నండును పోతగదు. నారికేళమైనను, తులసీ దళమైనను, నేదో ఫలమైనను తీసికొని పోవలయును, భాగవతుడగువాడు విధివిహితములగు పదార్థములనే భుజింపవలెనేగాని, శాస్త్రనిషిద్ధ పదార్థముల స్వీకరింపజనదు.

లలాట శూన్యుడై యనగా మొగమున బొట్టు పెట్టుకొనకుండ సర్వేశ్వర సన్నిధానము నకేగరాదు. మరియు దేవపితృ కార్యాదులేవియు చేయరాదు. దేవపూజాదులుసయము 12 గంటలలోపుగనే చేయవలెనుగాని తరువాత చేయరాదు.

నిత్యనైమిత్తికామ్యమ్ములగు వార్యమ్ములొకేవరి సంభవించినచో బలముగుదానినే ఆచరింపవలయును. కార్యములు మూడు రకములు. నిత్యములు, నైమిత్తికములు, కామ్యములు. నిత్యములనగా నెల్లప్పుడుండినవి. శ్రీరామనవమి. కృష్ణాష్టమి, ఏకాదశి, శివరాత్రి మొదలగునవి. నైమిత్తికములనగా ఒకానొక నిమిత్తము చేవచ్చు తద్దినాదులు. కామ్యములనగా నేదోయొక కోర్కెచే జనించునవి. అన్నదాన పూజాదులట్టివి. వీటిలో

కామ్యములకన్న నైమిత్తికమును, నైమిత్తికములకన్న నిత్యములు బలీయములు తండ్రి తద్దినమును ఏకాదశీ పుణ్యానాసళ్ళును ఒకే దినమున సంభవించినచో నేకాదశిని శ్రాద్ధాదులు చేయరాదను శాస్త్ర విధిచే తద్దినము నారోజుచేయుట మాని ద్వాదశినాడు పెట్టవలయును. భాగవతుడగు వాడుదయమున, గురు పరంపరాను సంధాన పూర్వక ముగా నిద్రనుండి లేపవలయును.

సర్వేశ్వరారాధన చేయనియే పదార్థమును ముట్టుకొనరాదు.

పద్నాల: దేవరాజు పెరుమాళ్ళు
పద్నాల: పద్మమండిర
పద్నాల: మైథిలీనాథ ప్రసాదు
పద్నాల: ఉశిక్ష్మకాంమానసరాంయులు






భాష్యకార సమాజ స్థాపకులు
మహర్షి శ్రీ వేంకటదాసస్వామి గారు



శ్రీరమా చిత్రశాల

తర్కవేదాంత విశారద

**పండిత శ్రీ మొవ్వ శ్రీనివాసపెరుమాళ్ళుగారు**



శ్రీవేణుగోపాల సేవాశ్రమాధిపతులు, తర్కవేదాంత "కవిభట్టారక"
శ్రీ మొవ్వ దాశరధి సూరి "విష్ణుదాసు" గారు.

పూడివాడ.

ది. 30-8-1998

